# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

సెప్టెంబర్ 2007 74 రు. 10

- ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య - పరిష్కారాలు
- కోనేరు రంగారావు కమిటీ సిఫారసులు
- ముదిగొండ కాల్పులపై నివేదిక
- చుండూరు హత్యాకాండ తీర్పు
- తస్లీమా నస్రీన్‌పై దాడి
- తెలంగాణలో సూక్ష్మ సేద్యం
- అరవై ఏళ్ల స్వాతంత్ర్యం




# యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ పై ఏకైక విశిష్ట సమాచార, విశ్లేషణా గ్రంథం

## సిడిఆర్‌సి ప్రచురణ
## ఇంగ్లీషులో, 568 పేజీలు
## రు. 225

# FIFTY YEARS OF ANDHRA PRADESH
## 1956 - 2006

## ప్రస్తుతం మార్కెట్లో ఉంది

యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ జయాపజయాలపై,
అభివృద్ధి పథంలో ఒడిదుడుకులపై
నలభై విశ్లేషణాత్మక, సమాచార భరిత వ్యాసాలు, పట్టికలు
చరిత్ర, వ్యవసాయం, పరిశ్రమలు, మౌలిక సౌకర్యాలు, ఆర్థిక వ్యవహారాలు,
సామాజిక పరిణామాలు, విద్యా వైద్య రంగాలు
ఆంధ్రప్రదేశ్ పురోగతి గురించి తెలుసుకోదలచిన వారందరూ
తప్పనిసరిగా అధ్యయనం చేయవలసిన గ్రంథం
ప్రతి గ్రంథాలయంలోనూ ఉండవలసిన గ్రంథం

ప్రతులకు, వివరాలకు




**సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040 - 66843495 ఇమెయిల్ : reachcdrc@yahoo.com

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

సెప్టెంబర్ 2007
సంచిక : 74



గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు:
వి. హనుమంతరావు
వర్కింగ్ ఎడిటర్:
ఎన్. వేణుగోపాల్

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి. సాంబశివరాజు

సహాయ సంపాదకులు
డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్
వై. రామచంద్రం
9949391028
కంపోజింగ్ & లే ఔట్
సి. రాజశేఖర్

**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,
డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.
ఫోన్ : 98482 49695
98484 28516

ప్రింటర్స్
చరితా ఇంప్రెషన్స్,
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


## సంపాదకీయ వ్యాఖ్యలు

## ముదిగొండ దారిలో...

భూమిని ఆక్రమించుకుని, చాపచుట్టగా చుట్టుకుని కూచున్న హిరణ్యాక్షులు అంత సులభంగా, శాంతియుతమైన విజ్ఞప్తులతో ఆ భూమిని వదలిపోరనీ, భూమికోసం నిరుపేదలు జరిపే పోరాటం నెత్తురు చిందించకతప్పదనీ ప్రపంచవ్యాప్తంగా ఎన్నోసార్లు రుజువైన చారిత్రక సత్యాన్ని ముదిగొండలో నేలకొరిగిన సామాన్యులు మరొకసారి తమ ప్రాణత్యాగంతో నిర్ధారించారు. ముదిగొండలో బయటపడినవి సామాన్యుల సాహసాలూ పాలకుల దౌర్జన్యాలూ మాత్రమే కాదు, భూమి సమస్య ఎంత గంభీరమైనదో, భూమి సమస్య మీద పోరాడుతున్నామనే వాళ్లు ఆ పోరాటాన్ని ఎంత నిబద్ధతతో నడపవలసి ఉంటుందో, ఆ పోరాటాన్ని మధ్యదారిలో వదిలేసి మరొక ప్రయోజనం పొందడానికి ఎన్ని ఆకర్షణలుంటాయో, నిన్నటిదాకా ప్రజలమీద, ప్రజల న్యాయమైన ఆకాంక్షలమీద ఉక్కుపాదం మోపినవాళ్లే, నెత్తురుటేర్లు పారించినవాళ్లే ఎట్లా మొసలికన్నీళ్లు కారుస్తారో, భూమి, భుక్తి పోరాటాలు విముక్తి పోరాటాలుగా మారకపోతే ఎట్లా దారితప్పిపోతాయో ముదిగొండ మళ్లీ ఒకసారి చెపుతోంది. నేర్చుకోదలచినవాళ్లకు ముదిగొండ అనేక పాఠాలు నేర్పడానికి సిద్ధంగా ఉంది. ముదిగొండలో రాస్తారోకో జరుపుతున్న ప్రజలపై, దీక్షాశిబిరంలో కూచున్న ప్రజలపై పోలీసులు అతిదుర్మార్గంగా దాడిచేసి నిర్విచక్షణగా కాల్పులు జరిపి ఏడుగురిని బలిగొన్నారు. పదిహేనుమందిని తీవ్రంగా గాయపరిచారు. తమ న్యాయమైన హక్కుల కోసం పోరాడుతున్న ప్రజలమీద ఇటువంటి అమానుష దాడిని తీవ్రంగా ఖండించవలసినది. రాష్ట్రంలో ప్రజల మీద, ప్రజల ధర్మాగ్రహం మీద, ఆందోళనల మీద ఇటువంటి దుర్మార్గ దాడులు చేయడమే తప్ప, నాగరికంగా చర్చించి పరిష్కారాలు కనిపెట్టవచ్చునని తెలియని, ఆ అలవాటులేని పాశవిక పాలన చాలాకాలంగా సాగుతున్నది. ఆ పాలక క్రౌర్యప్రదర్శనలో ముదిగొండ కాల్పులు మొదటివేమీ కావు. బహుశా చివరివి కూడ కాబోవు. వలసపాలనా కాలంలో బ్రిటిష్ ప్రభుత్వం, నిజాం ప్రభుత్వం, ఇతర సంస్థానాల పాలకులు ఇటువంటి క్రౌర్యాన్నే ప్రదర్శించి వేలాది మంది రైతుకూలీలను బలిగొన్నారు. అరవై సంవత్సరాల స్వతంత్ర భారతంలో కూడ చిన్నవీ పెద్దవీ భూమి కొరకు పోరాటాలు అసంఖ్యాకంగా జరిగాయి. ఆ పోరాటాలన్నిటి మీద పాలకులు, వాళ్ల జెండాలేవయినా, ప్రకటిత ఆదర్శాలేవయినా, ఉపయోగించినది దౌర్జన్యాన్నే, లాఠీలను, తూటాలను, చెరసాలలను, ఉరికొయ్యలనే. భూమి ఇంకెంతమాత్రమూ సమస్య కాదని, దాన్ని పట్టించుకోనవసరం లేదని నేలవిడిచి సాముచేస్తూ ప్రవచనాలు పలికేవాళ్లను ముదిగొండ అపహాస్యం చేస్తున్నది. భారత సమాజంలో దున్నుకోవడానికి ఎకరం నేల, ఆశ్రయం పొందడానికి గుంటెడు నేల కోట్లాదిమందికి ఇంకా అందని ఫలంగానే ఉన్నదని, అది సాధించడం కోసం భూమిలేని నిరుపేదలు ఎంతకైనా తెగించిపోరాడగలరని, పోరాడవలసిన ఉందని ముదిగొండ మరొకసారి చెపుతున్నది.

## ఏలినవారి క్షమాభిక్ష

జైళ్లలో ఏళ్ల తరబడి మగ్గుతున్న ఖైదీలను క్షమాభిక్షపై విడుదల చేయడానికి అనేక అవాంతరాలను సృష్టిస్తున్న రాష్ట్ర ప్రభుత్వానికి కరుణ, సంస్కరణ, మానవతాదృష్టి వంటి విలువల గురించి ఎవరయినా చెపితే బాగుండును. జైళ్ల గురించి, ఖైదీల గురించి మోహన్ దాస్ కరంచంద్ గాంధీ అనే పెద్దమనిషి అరవై ఏళ్లకింద చేసిన వ్యాఖ్యలను ఎవరయినా రాష్ట్రప్రభుత్వానికి గుర్తుచేస్తే బాగుండును. "అహింసాయుతమైన స్వతంత్ర భారతంలో నేరమనేది ఉంటుంది, కాని నేరస్తులుండరు. వారిని శిక్షించడం ఉండదు. నేరమనేది ఇతర అన్ని వ్యాధులలాగనే ఒక వ్యాధి. అది కొనసాగుతున్న సామాజిక వ్యవస్థ ఫలితమే. అందువల్ల హత్యతో సహా అన్ని నేరాలనూ వ్యాధులలాగనే పరిగణించాలి. అటువంటి భారతదేశం ఎప్పటికైనా ఏర్పడుతుందా అనేది వేరే ప్రశ్న" అన్నారు గాంధీ *1946*లో. "స్వతంత్ర భారతంలో చెరసాలలు ఎలా ఉండాలి? నేరస్తులందరినీ చికిత్స అవసరమైన రోగులుగా గుర్తించాలి. చెరసాలలంటే ఇటువంటి రోగుల సమూహాలు చికిత్సకోసం, బాగుచేయడం కోసం చేర్చుకునే ఆస్పత్రులుగా ఉండాలి. ఏ ఒక్కరూ సరదా కొద్దీ నేరం చేయరు. నేరమనేది ఒక రోగిష్టి మనసుకు చిహ్నం. ఆ ప్రత్యేక రోగానికి కారణాలేమిటో పరిశోధించి తొలగించాలి... జైలు సిబ్బంది ప్రవర్తన ఆస్పత్రిలో వైద్యుల, నర్సుల ప్రవర్తనలాగ ఉండాలి" అన్నారు *1947*లో. రాష్ట్రంలో ఖైదీలకు క్షమాభిక్ష ప్రసాదించి, వారికి శిక్షాకాలంలో రాయితీలు ఇచ్చి విడుదల చేయడం అనే ప్రక్రియ ఎంత నిర్దయాపూరితంగా, ఎంత అమానుషంగా జరుగుతున్నదో చూస్తే ప్రభుత్వంలో ఉన్నవారి మానవత్వం

మీద, గాంధేయ విధానాలమీద అనుమానాలు కలిగే పరిస్థితి ఉన్నది. ఏ కోణం నుంచి చూసినా క్షమాభిక్ష ఖైదీల హక్కు. అసలు మన సమాజంలో సర్వసాధారణంగా నేరం అని గుర్తింపు పొందేది నేరం అవునా కాదా, దానికి శిక్ష అనేది ఏ రూపంలో విధించడం ఉచితం అనే తాత్విక చర్చను పక్కనపెట్టినా, అసలు సమాజంలో సంపన్నులు, శక్తివంతులు, రాజకీయ ప్రాబల్యం ఉన్నవారు అవే నేరాలు, అంతకన్న పెద్దనేరాలు చేసికూడ ఏ శిక్షాలేకుండా తప్పించుకు పోతుండగా, పేదలు, బలహీనులు, అంగబలం లేనివారు మాత్రం పోలీసుల చేతచిక్కి, న్యాయస్థానాల బోనులెక్కి శిక్షలకు గురవుతున్నారు. వారు చేసిన నేరానికి ఎన్నోరెట్ల శిక్షను అనుభవిస్తున్నారు. ఆ శిక్షాకాలంలో వారి సత్ప్రవర్తనకు, వారు చేసిన శ్రమకు ప్రతిఫలంగా వారి శిక్షాకాలంలో రాయితీ ఇవ్వడం ఒక ఉదారవాద సంప్రదాయం. అట్లాగే స్వాతంత్ర్య దినం, గణతంత్ర దినం, జాతీయ నాయకుల జయంతులు, వర్ధంతుల సందర్భంగా కూడ శిక్షాకాలంలో రాయితీలు ఇవ్వడం మరొక సంప్రదాయం. జైళ్లు సంస్కరణ కేంద్రాలుగా పనిచేసి, ఖైదీలను సంస్కరించి సమాజంలోకి పంపడానికి ఈ రాయితీలు ఉపయోగపడతాయని ఎందరో మేధావులు చెప్పారు. మన రాష్ట్రంలో ఎప్పటినుంచో అమలవుతున్న ఈ సంప్రదాయాన్ని గత తెలుగుదేశం ప్రభుత్వం ఆపివేసింది. ఆ తర్వాత వచ్చిన ఇప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం ఆ సంప్రదాయాన్ని పునరుద్ధరించింది గాని తన ఆశ్రితుల కోసం మాత్రమే ఉపయోగించదలచుకుంది. ఆ ప్రయత్నాన్ని న్యాయస్థానం అడ్డుకుంది. అలా గత సంవత్సరం ఆగిపోయిన ప్రయత్నాన్ని కొనసాగించేందుకు ఈ ఆగస్ట్ 15 సందర్భంగా ప్రభుత్వం విడుదల చేసిన రెండు జివోలు అక్రమ పద్ధతిలో, ఖైదీలపట్ల చాల అవమానకరంగా, నక్సలైటు ఖైదీలను విడుదల చేయడానికి వీలు లేకుండా, విడుదలయిన ఖైదీలు కూడ నిత్యం పోలీసు ఉచ్చులో ఉండేలా తయారయ్యాయి. జైలు జీవితంతో ఎంతోకాలం ఇబ్బంది పడినవారి విషయంలో, తమవారికోసం ఆరాటపడుతూ పోరాటాలు చేపట్టిన కుటుంబాల మీద కూడ జాలీ దయా చూపించలేని అమానుషయంత్రంగా మారిపోయానని మన ప్రభుత్వం మరొకసారి నిరూపించుకుంది.

## అణుఒప్పందం అసలు రహస్యం

అమెరికా ప్రభుత్వంతో భారత ప్రభుత్వం కుదుర్చుకున్న అణు ఒప్పందం చిలికి చిలికి గాలివానగా మారుతున్నది. భారత శాంతియుత అవసరాలకు, అంటే ప్రధానంగా అణువిద్యుత్తు తయారు చేయడానికి మాత్రమే ఉపయోగించాలనే షరతు మీద అణు ఇంధనాన్ని సరఫరా చేయడానికి అమెరికా ప్రభుత్వం అనుమతించే ఈ నలభై సంవత్సరాల ఒప్పందం 123 ఒప్పందంగా కూడ ప్రాచుర్యంలోకి వచ్చింది. అలా అణు ఇంధనం సంపాదిస్తున్నందుకు గాను భారత ప్రభుత్వం తన అణు కేంద్రాలన్నిటినీ తనిఖీ చేసే అధికారాన్ని అంతర్జాతీయ అణు శక్తి సంస్థకు ఇస్తుంది. ఈ ఒప్పందం చేసుకోవడం భారత ప్రయోజనాల కొరకేనని, భారత విద్యుత్ వినియోగం రోజురోజుకూ పెరుగుతున్నందువల్ల అణు విద్యుదుత్పత్తి తప్పదని ప్రభుత్వం, దాని మద్దతుదారులు వాదిస్తుండగా, ఇది అమెరికా ప్రభుత్వానికి దాసోహమవడమేనని, అంటే భారత సార్వభౌమత్వాన్ని పణంగా పెట్టడమేనని, భారతదేశానికి అణ్వాయుధాలను తయారు చేసే శక్తి లేకుండా చేయడమేనని ప్రతిపక్షాలు వాదిస్తున్నాయి. అసలు వాజపేయి ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు ప్రారంభమైన అణుశక్తి కార్యక్రమ కొనసాగింపుగానే ప్రస్తుత ఒప్పందం కుదిరింది గనుక భారతీయ జనతాపార్టీకి ఈ విషయం మాట్లాడే అర్హత లేదు. అట్లాగే మన్మోహన్ సింగ్ అమెరికా ఏజెంట్ అనే విషయం ఇప్పుడే తెలిసివచ్చినట్టు ప్రవర్తిస్తున్న వామపక్షాలకు కూడ ఈ విషయం మాట్లాడే అర్హత లేదు. ప్రపంచబ్యాంకు ఉద్యోగిగా పనిచేస్తూ దేశంలోకి వచ్చి ఒక మైనారిటీ ప్రభుత్వంలో ప్రధాని ఎవరనేది నిర్ణయం కాకముందే ఆర్థిక మంత్రిగా రూపొంది, ఆ తర్వాత సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ఈ దేశంలో ప్రారంభించి, చివరికి ప్రధానమంత్రి అయిన తర్వాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ ఉపన్యాసంలో వలసవాదాన్ని సమర్థించిన మన్మోహన్ సింగ్‌ను మూడు సంవత్సరాలుగా గద్దెమీద నిలిపి ఉంచుతూ ఇవాళే సామ్రాజ్యవాద ఏజెంట్ అని కొత్తగా గుర్తించినట్టు నటించడం వామపక్షాల అవకాశవాదానికి చిహ్నం. భారత ప్రభుత్వం అమెరికాకు జూనియర్ పార్ట్‌నర్‌గా, దక్షిణాసియా ప్రాంతంలో పెద్దన్నగా వ్యవహరించడానికి అణ్వాయుధాలను సమకూర్చుకో దలచుకున్నది. అణు విద్యుత్ పేరుతో ఆ తర్వాత అణ్వస్త్రాలను తయారు చేయడానికి పనికొచ్చే ముడిసరుకును పోగేసుకోదలచుకున్నది. ఈ ఒప్పందం ద్వారా ఆ కార్యక్రమానికి అమెరికా అండదండలు దొరుకుతున్నాయి. అణు కార్యక్రమం మంచిదేగాని అమెరికాకు దాసోహమనడం మంచిది కాదు అనడం దివాళాకోరుతనం తప్ప మరేమీ కాదు. కావలసింది అణ్వస్త్రాలు కావు అసంఖ్యాక జనబాహుళ్యానికి అన్నవస్త్రాలు అని నినదించవలసిన, పోరాడవలసిన సమయంలో సాంకేతిక అంశాలమీద రభస చేయడం ప్రజల దృష్టిని మళ్లించే ఎత్తుగడ మాత్రమే. ఆ ఎత్తుగడలో మన పార్లమెంటరీ రాజకీయపక్షాలన్నీ మునిగి ఉన్నాయి.

## వాకపల్లి దురాగతం

విశాఖపట్నం జిల్లా జి. మాడుగుల మండలం వాకపల్లి గ్రామంలో పదకొండుమంది ఆదివాసి మహిళల మీద గ్రేహౌండ్స్ పోలీసులు సామూహిక అత్యాచారం జరపడం ఆ ప్రాంత పరిణామాలను సూక్ష్మంగా పరిశీలిస్తున్నవారికి ఆశ్చర్యం కలిగించదు. ఇటువంటి దుర్మార్గ ఘటనకు అక్కడ పాలకులు పథకాలు రచిస్తున్నారని కొంతకాలంగా కనబడుతూనే ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే చత్తీస్‌గఢ్‌లో సాల్వాజుడుం పేరుమీద జరుగుతున్నదాన్నే విశాఖలో గ్రేహౌండ్స్ పోలీసులు చేశారు. చత్తీస్‌గఢ్‌లోని విలువైన ఖనిజసంపదను బహుళజాతి సంస్థలు దోచుకుపోకుండా అక్కడి విప్లవోద్యమం నాయకత్వంలో సంఘటితమైన ఆదివాసులు అడ్డుకుంటున్నారు గనుక అక్కడ గత రెండుసంవత్సరాలుగా ఆదివాసులను భయోత్పాతంలో ముంచి బహుళజాతి సంస్థల ప్రయోజనాలు నెరవేర్చడానికి సాల్వాజుడుం జరుగుతున్నది. విశాఖ ఏజెన్సీలో కూడ బాక్సైట్, తదితర ఖనిజ నిలువలను దోచుకుపోవడాన్ని ఆదివాసులు ప్రతిఘటిస్తున్నారు గనుక వారిని భయభీతావహంలో ముంచడానికి ఒక హెచ్చరికగా, మావోయిస్టుల కొరకు కూంబింగ్ అనే సాకుతో వాకపల్లి అత్యాచారాలు జరిగి ఉంటాయి. చత్తీస్‌గఢ్‌లో రెండు సంవత్సరాలలో ఎన్ని గూడాలను తరలించి, ఎంతమందిని చంపినా, జైళ్లపాలు చేసినా, ఎంతమంది మహిళలపై అత్యాచారాలు చేసినా సాల్వాజుడుం బహుళజాతి సంస్థలకు మార్గం సుగమం చేయలేక పోయింది. విశాఖలో వాకపల్లి అత్యాచారాల వంటి ఘటనలద్వారా, పాడేరు - చింతపల్లి - అరకు ప్రాంతాల్లో సాగిస్తున్న దౌర్జన్యకాండ ద్వారా కూడా ఆదివాసుల ప్రతిఘటనను అణచివేయడం అసాధ్యమని చరిత్ర చెపుతున్నది. ◆

# లోపలి పేజీల్లో...

## ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య - పరిష్కారాలు

భూమి దగ్గర చర్చ మొదలుపెట్టే చాలమంది నిరుపేదలందరికీ పంచడానికి తగినంత భూమి లేదు గదా అనే వాదన మొదలుపెట్టి ఆగిపోతారు. నిజానికి వాదన మొదలుపెట్టవలసింది అక్కడకాదు. ఈ సమాజంలో ఒక గణనీయమైన భాగం, సమాజానికి అవసరమైన ముఖ్యమైన నైపుణ్యం ఉండి కూడ ఆ నైపుణ్యాన్ని ఉపయోగించలేని, లేదా సంపూర్ణంగా ఉపయోగించలేని దుస్థితిలో ఉన్నారని గుర్తించి వారికి ఆ అవకాశాలు కలిగించే మార్గాలు అన్వేషించడం దగ్గర చర్చ ప్రారంభం కావాలి. ఆ అన్వేషణలో అనివార్యమైన పరిష్కారాలు భూయాజమాన్యంలో సమానత్వం సాధించే పంపిణీ, ఆ భూమి సాగుచేసుకోవడానికి ఉపకరించే ఉత్పాదకాలను సరఫరా చేయడం.



### ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య - పరిష్కారాలు



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

- సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

- సర్క్యులేషన్ మేనేజర్
9949391028

# కొత్తపుస్తకాలు/సిడిలు







- **అనంత ప్రస్థానం** - డా. వై.వి. మల్లారెడ్డి - కదలిక ప్రచురణ, 169 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : కదలిక ప్రచురణలు, యెర్రనేలకొట్టాలు, ఆర్.సి. నగర్, అనంతపురం, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **ప్రపంచీకరణ పరిణామాలు, ప్రభావాలు, మహిళల జీవితం** – తోట జ్యోతిరాణి, కాత్యాయనీ విద్మహే - స్త్రీ జనాభ్యుదయ అధ్యయన సంస్థ, వరంగల్లు ప్రచురణ, 148 పేజీలు, 1/8 డెమీ, రు. 60. ప్రతులకు - ప్రొఫెసర్ తోట జ్యోతిరాణి, 5-11-176, మయుఖ, నయీం నగర్, వరంగల్ - 506 009. అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో
- **జండర్ సమానత దిశగా... సమాజం - సాహిత్యం** - కాత్యాయనీ విద్మహే, తోట జ్యోతిరాణి - స్త్రీ జనాభ్యుదయ అధ్యయన సంస్థ, వరంగల్లు ప్రచురణ, 167 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : కాత్యాయనీ విద్మహే, 5-11-667, పశ్యంతి, కె.యు. రోడ్, విద్యారణ్యపురి, వరంగల్ - 506 009. అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో
- **మచ్చుబొమ్మ** – దిలావర్ కథలు, సమత ప్రచురణలు. 98 పేజీలు, 1/8 డెమీ, రు. 50. ప్రతులకు : డా. దిలావర్, సిఐఐఎల్ క్యాంపస్, నవభారత్, పాల్వంచ, ఖమ్మం జిల్లా - 507 154. ఫోన్ : 9866923294, అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో
- **మా ఊరు మొలకెత్తింది - దీర్ఘ కవిత** - బి. హనుమారెడ్డి, ప్రకాశం జిల్లా రచయితల సంఘం ప్రచురణ, 71 పేజీలు, 1/8 డెమీ, రు. 40. ప్రతులకు : బి. హనుమారెడ్డి, రాజా పానగల్ రోడ్, ఒంగోలు - 523 002. సెల్ : 94402 88080
- **హోలియాదాసరుల ఆశాజ్యోతి మునెప్ప** - కుల నిర్మూలన ప్రచురణ, 43 పేజీలు, 1/8 డెమీ, రు. 10. ప్రతులకు : బి. లక్ష్మయ్య, మరికల్ (పోస్టు, గ్రా.), ధన్వాడ (మం.) మహబూబ్‌నగర్ జిల్లా
- **తెలంగాణ ఉద్యమంలో నక్సలైట్ల పాత్ర** - తెలంగాణ - నడుస్తున్న చరిత్ర - ఏడవపుస్తకం - బి.ఎస్. రాములు, తెలంగాణ కళాకారుల, రచయితల, మేధావుల ఐక్యవేదిక ప్రచురణ, 144 పేజీలు, 1/8 డెమీ, రు. 30. ప్రతులకు : తెలంగాణ కళాకారుల, రచయితల, మేధావుల ఐక్యవేదిక, 2-2-647/ఎ/57, సాయిబాబా నగర్, శివం రోడ్, హైదరాబాద్ - 500 013. ఫోన్ నెం. 9391036987
- **సైన్స్ ఇన్ హిస్టరీ** - జె.డి. బెర్నాల్ - సంక్షిప్తీకరణ: ఎన్. నరసింహారావు - 392 పేజీలు - 1/8 డెమీ, రు. 290, ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, జర్నలిస్టు, సంపాదకుడు, 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ - 500 044. అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

**సిడిలు**

- **పాలపిట్ట పాట** - ప్రత్యేక తెలంగాణ పోరాట పాటలు - రచన : వరవరరావు, గానం : సంధ్య, ప్రభాకర్, విమల, రడం శ్రీను, పుష్ప, వెంకట్ - వెల. రు. 35
- **తెలంగాణ వీరగాథ** - ఏడేడు తరాల కత - బతుకమ్మ పాట - రచన : వరవరరావు, గానం : సంధ్య, పద్మ, ఝాన్సీ, దేవేంద్ర - వెల. రు. 35, ఈ రెండు సిడిలు ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం, 1-1-187/ఎ/2, త్రినేత్ర సూపర్ మార్కెట్ పక్కన, ఆర్‌టిసి క్రాస్ రోడ్స్, చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020









జూలై 28న రాష్ట్రబంద్ సందర్భంగా, ఖమ్మం జిల్లా ముదిగొండ మండల కేంద్రంలో స్థానిక పోలీస్ స్టేషన్‌లోని స్పెషల్ పార్టీ పోలీసుల, ఎస్.ఐ., సి.ఐ.ల తూటాలకు ఏడు మంది సామాన్య ప్రజలు బలయ్యారు. ఈ సంఘటన రాష్ట్రంలో ప్రజల, పౌర, ప్రజాస్వామిక హక్కుల సమస్యను, రాజ్యాంగ మౌలిక సూత్రాలను ఒకసారి ప్రశ్నించింది. రాజ్యాంగాన్ని 'పోలీసు వ్యవస్థ' అవహేళన చేసింది.

రాజ్యాంగంలోని 21వ ఆర్టికల్‌ను ఈ సందర్భంగా ఉటంకించవలసి వస్తున్నది. దేశంలోని ప్రజల 'జీవించే హక్కు'ను కాలరాయడానికి ఎవరికీ హక్కులేదు. జీవించే హక్కుకు భంగం కలగకుండా ప్రజలను కాపాడడంలో పాలకులు విఫలమయినట్లు తెలుస్తున్నది.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి అరవై సంవత్సరాలు గడిచినప్పటికీ, ఈ దేశంలోని ప్రజల మౌలిక సమస్యలు పరిష్కారం కాలేదు. ప్రజలకు కూడు, గూడు, గుడ్డ, విద్య – ఉద్యోగ అవకాశాలను కల్పించడంలో, విఫలం కావడం ఈ దేశాన్ని అరవై సంవత్సరాల నుంచి ఏలిన, ఏలుతున్న పాలకవర్గాల అందరి బాధ్యత. అందుకే ఈ దేశంలోని సామాన్య ప్రజలు వాటికోసం ఉద్యమించి సాధించుకోవాలనే ప్రయత్నంలో భాగంగానే జూలై 28న రాష్ట్రబంద్ జరిగింది. అది ఎవరి నేతృత్వంలో జరిగిందనే విషయం పక్కన పెడదాం.

బంద్ ప్రశాంతంగా జరుగుతున్న దశలో ప్రజలను రెచ్చకొట్టే రీతిలో పోలీసు అధికారులు ప్రవర్తించడం వెనుక, ఏ వర్గ ప్రయోజనాలు ఆశించి రాష్ట్ర పోలీసు అధికారులు బంద్ సందర్భంగా నిరాహార దీక్షా శిబిరాన్ని సందర్శించి గంటలోపుగా బంద్‌ను రాస్తారోకోను విరమించాలని కోరగా అందుకు తిరస్కరించిన బండి రమేష్‌ను చేతులతో, కాళ్లతో, తుపాకులతో తన్నారు? అంత అవసరం పోలీసులకు ఏమొచ్చింది? బంద్‌కు ఒక రోజు ముందు, రాష్ట్ర శాసనసభ వర్షాకాల సమావేశాల ముగింపు సందర్భంగా ఈ రాష్ట్ర ప్రభుత్వం ఉద్యమకారులను, వారి నాయకత్వాన్ని చర్చలకు ఆహ్వానించడం, డిమాండ్‌లను పరిష్కరించడంలో బాధ్యతా రాహిత్యంగా ప్రవర్తించడం కూడా ముదిగొండ సంఘటన జరగడానికి ఆస్కారం ఇచ్చినట్లయింది.

కోనేరు రంగారావు కమిటీ సిఫారసులను అమలు చేయాలని కోరితే అవి పరిష్కరించడంలో 'విఫలం' చెందిన ప్రభుత్వం, వారిపై నిస్సిగ్గుగా కాల్పులు జరిపింది. ఇది రాజ్యాంగాన్ని అపహాస్యం చేసింది. రాజ్యాంగ మౌలికసూత్రాలు, ఆదేశిక సూత్రాలు, కూడా రాష్ట్ర పోలీసులు పాటించడం లేదంటే పోలీసులపై ప్రభుత్వానికి పట్టులేదనా? లేక ప్రభుత్వం కావాలనే ఈ సంఘటనను చేయించిందా అనే విషయం ప్రజలకు స్పష్టం కావడంలేదు. రాష్ట్ర ప్రభుత్వం చేసిన, చేస్తున్న తప్పిదాలను కప్పిపుచ్చుకోవడానికి ఒక నాటకం ఆడుతున్నారు ముఖ్యమంత్రి ఆయన మంత్రివర్గ సహచరులు.

భారత అత్యున్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు, జాతీయ మానవ హక్కుల కమిషన్ (ఎన్ఎచ్ఆర్‌సి) ఇచ్చిన ఆదేశాలనూ, ప్రజలపట్ల పోలీసులు వ్యవహరించవలసిన తీరునూ రాష్ట్ర ప్రభుత్వం, పోలీసు యంత్రాంగం తృణీకరించినప్పుడూ, తిరస్కరించినప్పుడూ, ప్రజలు వాటిని ఎలా గౌరవిస్తారు? రాజ్యాంగాన్ని కాపాడవలసిన పోలీసులే రాజ్యాంగ హక్కులను కాలరాస్తున్నప్పుడు, ఈ దేశ రాజ్యాంగం మీద ప్రమాణం చేసిన పాలకులు రాజ్యాంగాన్ని గౌరవిస్తున్నట్లా? లేనట్లా? ఇది రాష్ట్ర ప్రభుత్వ నైతిక విలువలకు సంబంధించిన విషయం. రాష్ట్ర ప్రభుత్వ గౌరవ, ప్రతిష్ఠలకు కూడా సంబంధించిన విషయం. దీనిని పాలకులు గమనించాలి. ప్రజా ఉద్యమకారులు కూడా ఇలాంటి సంఘటనల ద్వారా అనేక గుణపాఠాలను నేర్చుకోవలసి ఉంది.

1) ప్రజల పట్ల, పోరాడే వారిపట్ల, ఉద్యమకారుల పట్ల పోలీసుల ప్రతాపం ఇది మొదటి సారికాదు. నిరాయుధులైన ప్రజల పట్ల పోలీసు అధికారులు ఈ రాష్ట్రంలో చాలాసార్లు కాల్పులు జరిపారు. మసీదు వద్ద బాంబు పేలుళ్లు జరిగిన సంఘటనానంతరం జరిగిన పోలీసు కాల్పుల్లో తొమ్మిది మంది సామాన్య ప్రజలు చనిపోయారు.
2) పెనుకొండ శాసనసభ ఉప ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ అభ్యర్థినిగా పరిటాల సునీత నామినేషన్ సందర్భంగా జరిగిన పోలీసుకాల్పుల్లో నలుగురు వ్యక్తులు చనిపోయారు.
3) అదే విధంగా గంగవరం మత్స్యకారులపై, భద్రాచలంలో ఉద్యమకారులపై పోలీసుకాల్పుల్లో నలుగురు చనిపోయారు.

అంటే రాష్ట్రంలో పోలీసుయంత్రాంగం ఒక అహంభావానికీ, ఒక అరాచకవాదానికీ, పాలవర్గాల భజన చేయడానికీ అలవాటుపడింది. వారికి కోర్టులన్నా, మానవహక్కులన్నా ఏమాత్రం గౌరవం లేదు. ప్రజల ప్రాణాలను కాపాడడంలో ప్రజాసంఘాలు కూడా విఫలం చెందాయి. ఇందుకు అందరం కూడా బాధ్యత వహించాలి.

ఏ పార్టీ అధికారంలోకి వచ్చినప్పటికీ, ఇదే తంతు పోలీసులది. వారి అవినీతి, అక్రమాలను ప్రశ్నించిన వారిని 'లాకప్ మరణాలు'గా, 'ఎన్‌కౌంటర్'లో మరణాలుగా కథలల్లుతున్నారు. దీనిని అధిగమించడానికి 'ప్రజా ఐక్య సంఘటన'ను నిర్మించాలి. ప్రజాస్వామిక వ్యవస్థనూ రాజ్యాంగ వ్యవస్థనూ కాపాడుకోవడానికి పోరాటాన్ని ఉధృతం చేయాలి.

– చిమ్మె జాన్ బర్నాబాస్
కర్నూలు

## పాఠకుల వీక్షణం

అన్నిరకాల రచనలు వేస్తే సరైన అభిప్రాయమేదో మేమెలా తెలుసుకోవాలి?

– జి. గిరి
నెల్లూరు

పత్రిక చాలా బాగా వస్తోంది. మంచి విశ్లేషణాత్మకమైన వ్యాసాలు వస్తున్నాయి. పత్రిక పరిధిని ఇంకా పెంచితే బాగుటుంది. పుస్తక సమీక్షలు తప్పనిసరిగా ఉండాలి. ప్రజల జీవితాలను, మనోభావాలను విపరీతంగా ప్రభావితం చేస్తున్న సినిమా, టివి వంటి రంగాల మీద విశ్లేషణలు, విమర్శలు ఉండాలి. మన సమాజంలోని ప్రగతిశీల శక్తులు మన చారిత్రిక వారసత్వ సంపదలోని మంచి అంశాలను కూడా పనికిరానివని తోసివేశాయి. మరొకపక్క మతఛాందస శక్తులు ఆ వారసత్వ సంపదకు తామే హక్కు దారులమన్నట్టు, వాటిని ముట్టుకోవడానికి వీలులేని పరమ పవిత్ర వస్తువులుగా పరిగణించాయి. ఈ రెండు కొసల అతివాదానికీ పోకుండా మన ప్రాచీన కళా, తాత్విక, సాహిత్య సంపద గురించి మంచీ చెడూ విశ్లేషించే రచనలు కావాలి. 'వీక్షణం' అటువంటి రచనల వేదిక అవుతుందని ఆశిస్తున్నాను.

– రావెల సోమయ్య
హైదరాబాదు

కవిగా, విద్వద్ విమర్శకునిగా వాసికెక్కిన సాహితీమూర్తి మా నాన్నగారు గుంటూరు శేషేంద్రశర్మ మే 30న మరణించిన విషయం సాహితీ జగత్తుకు తెలిసిందే. (వీక్షణం జూలై సంచికలో సంస్మరణ). మృతి చెందినరోజు నుంచీ ఆయన గురించి వెలువడుతున్న వార్తల్లో, వ్యాసాల్లో ఆయన తల్లిదండ్రులు, కుటుంబసభ్యులు తదితర వాస్తవాల ప్రస్తావన ఎక్కడా రావడం లేదు. పైగా, అవాస్తవాలు, అభూత కల్పనలను ఒక పద్ధతి ప్రకారం, ధనబలంతో ప్రచారం చేయడం జరుగుతోంది. కన్నకొడుకునైన నాకు కూడా ఈ విషయం తీరని మనస్తాపాన్ని కలిగిస్తోంది. శేషేంద్ర శర్మ కుటుంబ సభ్యులు శ్రీమతి జానకి–భార్య, శ్రీమతి వసుంధర, శ్రీమతి రేవతి – కూతుళ్లు, వనమాలి, సాత్యకి – కుమారులు. వీరు మాత్రమే ఆయనకు చట్టబద్ధమైన వారసులు. సామాజికంగా, నైతికంగా కూడా శేషేంద్ర వారసులు వీరే.

– సాత్యకి
హైదరాబాదు

## జనం గోడు పట్టని అసెంబ్లీ

జూలై 16 నుండి పది రోజులపాటు జరిగిన శాసనసభ వర్షాకాల సమావేశాలు యధావిధిగా ఆరోపణలు, ప్రత్యారోపణలతో ప్రజల సమస్యలు చర్చకు రాకుండానే ముగిసాయి. ఈ సమావేశాలతో కలిపి గత మూడేళ్లుగా శాసనసభలో సృష్టించిన గందరగోళానికి 5.62 కోట్ల రూపాయల ప్రజాధనం (93.4 గంటల సమయం) వృథా అయ్యింది. పాలకపక్షం, ప్రతిపక్షం స్థానాలు మారుతూ పరస్పరం కూడబెట్టుకున్న ఆస్తులపై చర్చించుకోవడం, 'మీరు అవినీతిపరులంటే – మీరు అవినీతిపరులని' దుమ్మెత్తిపోసుకోవడంతోనే సరిపోతోంది. ప్రజా ప్రతినిధులు ఉపయోగించే భాషలో కూడా ఆ దిగజారుడుతనం కనిపిస్తోంది.

## ముదిగొండ దారుణం

సి.పి.ఎం., సి.పి.ఐ.ల నాయకత్వంలో గత కొన్ని నెలలుగా జరుగుతున్న భూపోరాటంలో భాగంగా జూలై 22 నుంచి ఈ రెండు పార్టీల నాయకులు చేపట్టిన నిరవధిక నిరాహారదీక్షను ఆరవ రోజున (జూలై 27న) పోలీసులు భగ్నం చేశారు. తదనంతరం జరిగిన ధర్నా, రాస్తారోకోల్లో పెద్ద ఎత్తున మహిళలు, కార్యకర్తలు పాల్గొన్నారు. జూలై 28న రాష్ట్ర వ్యాప్త బంద్‌కు ఆ రెండు పార్టీలూ పిలుపునిచ్చాయి. అందులో భాగంగా రాస్తారోకో, రైల్‌రోకో, ఇంకా వివిధ రూపాల్లో నిరసన ప్రదర్శనలు చేపట్టారు. పలుచోట్ల పోలీసులు లాఠీచార్జీలు, అరెస్టులు చేశారు. ఆ క్రమంలో ఖమ్మం జిల్లాలోని ముదిగొండలో నిరసన తెలుపుతున్న ప్రజలపై పోలీసులు విచక్షణారహితంగా జరిపిన కాల్పుల్లో ఆరుగురు చనిపోయారు. చాలామంది గాయపడ్డారు. ఒకరు చికిత్స పొందుతూ తరువాత మరణించారు. అరవై ఏళ్ల స్వతంత్ర దేశంలో కూడు, గూడు, గుడ్డకు నోచుకోని ప్రజలు దేశవ్యాప్తంగా ఉద్యమిస్తున్నారు. ఒక పక్క వేలాది ఎకరాల భూములను ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) పేరిట బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేస్తూ, మరోపక్క నిలువనీడ కోసం అరవైగజాల నేలకోసం ప్రజలు ప్రాణాలివ్వాల్సినస్థితి రాజ్యమేలుతోంది. ఇంద్రవెల్లి, కాల్దరి, బషీర్‌బాగ్, గంగవరం, ముదిగొండ దాకా ప్రజల నెత్తురుతో తడవని నేల లేదు.

## నమూనా 'న్యాయా'నికి 16 ఏళ్లు

ఆగస్ట్ 6, 1991న గుంటూరు జిల్లా చుందూరు గ్రామంలో ఎనిమిది మంది దళితులను అగ్రకులాల వారు దాడిచేసి నరికి చంపారు. ఈ కేసులో నిందితులుగా 219 మందిని పేర్కొనగా, వీరిలో 33 మంది మరణించారు. ఏడుగురి ఆచూకీ ఈనాటికీ లేదు. పదహారు సంవత్సరాల తర్వాత వచ్చిన తీర్పులో 56 మందికి శిక్ష పడింది. చుందూరు ప్రత్యేక కోర్టు 123 మందిని నిర్దోషులుగా ప్రకటించింది. రాష్ట్రంలో దళితులపై జరిగిన అనేక దుర్మార్గమైన సంఘటనల్లో ఇప్పటికీ న్యాయం జరగలేదు. దళితులపై ఎన్నో హత్యలు, అత్యాచారాలు, వివక్ష రోజూ కొనసాగుతున్నా వాటిపై కేసులు లేవు, విచారణల్లేవు, దోషులకు శిక్ష అసలు ఊహించలేం. ఈ విజయం దళిత ఉద్యమంలో ఒక మైలురాయిగా నిలిచిపోతుంది. తమ నెత్తురు ఒలికిన నేలపైనే న్యాయాన్ని సాధించడం చరిత్రాత్మకం.

## ఇది న్యాయమేనా?

స్వాతంత్ర్య సమరయోధులకు కేంద్ర ప్రభుత్వం నెలకు పదివేల రూపాయలు పింఛన్‌గా ఇస్తోంది. రాష్ట్ర ప్రభుత్వం పింఛన్‌గా నెలకు వెయ్యి రూపాయలు మాత్రమే చెల్లిస్తోంది. 'అందరం స్వరాజ్యం కోసమే పోరాడాం, మా పోరాటంలో లేని తేడా, మా పింఛన్‌లలో ఎందుకని' స్వాతంత్ర సమరయోధులు వేమవరపు వెంకటేశ్వర్లు (88) ప్రశ్నిస్తున్నారు. ఒంగోలు పరేడ్ గ్రౌండ్‌లో స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా వచ్చిన జిల్లా ఇన్‌చార్జి మంత్రి మోపిదేవి వెంకటరమణారావు కాళ్లపై బడి పింఛన్ మొత్తాన్ని పెంచాల్సిందిగా వెంకటేశ్వర్లు కోరారు.

## వడ్డించేది మనవాడైతే

ముఖ్యమంత్రికి సన్నిహితునిగా అనుకుంటున్న గాలి జనార్ధన రెడ్డి కడప జిల్లాలో ఏర్పాటు చేయతలపెట్టిన బ్రహ్మణి ఉక్కు కర్మాగారానికి రాయితీలు, భూముల కేటాయింపులు అనుమతులు ఇచ్చే ప్రక్రియ చకచకా జరిగిపోతోంది. తొలుత 10,670 ఎకరాల భూమిని ప్రభుత్వం కేటాయించింది. జూన్ 10న కర్మాగారానికి భూమిపూజ నిర్వహించిన ముఖ్యమంత్రి విమానాశ్రయం నిర్మాణం కోసం ఆ సంస్థకు మరో నాలుగు వేల ఎకరాలు ఇవ్వనున్నట్లు ప్రకటించారు. కడప జిల్లా పరిస్థితుల దృష్ట్యా కమర్షియల్ విమానాశ్రయం నుంచి పెద్దగా లాభాలు రావన్న ఉద్దేశ్యంతో ఇక్కడ విమానాల మరమ్మతు కేంద్రం, పైలట్ల శిక్షణ కేంద్రం ఏర్పాటుకు ప్రయత్నిస్తున్నట్లు సమాచారం. ఓబుళాపురం మైనింగ్ కంపెనీ పరిశీలించడానికి పోయిన అఖిలపక్షం నాయకులలో తెలుగుదేశం పార్టీ మినహా మిగిలినవారు అంతా సజావుగానే ఉందంటూనే లోతుగా పరిశీలించాల్సి ఉందనడం గమనార్హం.

## బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో తీర్పు

జూలై 20, 1991న నిజామాబాద్ జిల్లా డిచ్‌పల్లి మండలం సుద్దులం గ్రామానికి చెందిన షేక్‌మహమ్మద్, లోలపు నర్సయ్యలు ఎన్‌కౌంటర్‌లో మరణించారు. వీరిని ఆరోజు తెల్లవారుఝామున మూడుగంటలకు నిద్రలేపి పోలీసులు తీసుకెళ్లారు. అదేరోజు సాయంత్రం నాలుగు గంటలకు కాల్చివేశారు. యధావిధిగా ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లారు. 16 సంవత్సరాల సుదీర్ఘకాలం తరువాత 4వ జిల్లా అదనపు జడ్జి అచ్యుతరెడ్డి బూటకపు ఎన్‌కౌంటరని తీర్పు ఇచ్చారు. ఈ తీర్పులో ఒక్కొక్కరికి లక్ష రూపాయల నష్టపరిహారంతోపాటు సంవత్సరానికి ఆరు రూపాయల చొప్పున వడ్డీ కూడా ప్రభుత్వం చెల్లించాలన్నారు. మానవ హక్కుల చట్టం ప్రకారం నష్టపరిహారం పొందిన కేసుల్లో దేశంలోనే ఇది మొట్టమొదటి తీర్పు అవుతుందని కేసు వాదించిన మాధవరావు పేర్కొన్నారు. ఇటీవలి మల్లేష్, మనోహర్‌ల మిస్సింగ్‌లతో కలిపి వెలికితీస్తే కనిపించని సత్యాలు ఎన్నో వెలుగులోకి వస్తాయి.

## రాష్ట్ర గవర్నర్‌గా ఎన్.డి. తివారి

'మై న నర్ హూం... న నారీ హూం... మై నారాయణ్ దత్ తివారీ హూం, సంజయ్‌గాంధీకా సవారీహూం' అని ఎమర్జెన్సీలో తన కాంగ్రెస్ విధేయతను ప్రకటించుకున్న ఎన్.డి. తివారి రాష్ట్ర 21వ గవర్నర్‌గా ఆగస్ట్ 19న నియమితులయ్యారు. గతంలో ఆయన ఉత్తరప్రదేశ్, ఉత్తరాంచల్ ముఖ్యమంత్రిగానూ, కాంగ్రెస్ పార్టీలో వివిధ పదవుల్లోనూ పనిచేశారు. ◆

ముదిగొండ సంఘటనపై ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీలు సంయుక్తంగా ప్రకటించిన నిజనిర్ధారణ నివేదిక

# ముదిగొండ - పూర్వాపరాలు

ముదిగొండ (ఖమ్మంజిల్లా)లో జూలై 28న జరిగిన పోలీసు కాల్పులపై ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ (ఒపిడిఆర్) ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (ఎపిసిఎల్‌సి), సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీ (సిఎస్ఎంసి)లు కలసి నిజనిర్ధారణ కమిటీని నియమించాయి. ఆ కమిటీ జూలై 29న మృతుల కుటుంబాలను, ఖమ్మం జిల్లా ఆసుపత్రిలో గాయపడి చికిత్స పొందుతున్న వాళ్లను, డాక్టర్లను, ముదిగొండ గ్రామంలో కాల్పులు జరిగిన ప్రాంతాన్ని, పోలీసులను, ప్రజలను కలిసి వివరాలు సేకరించింది.

గత మూడు నెలలుగా రాష్ట్రంలో వామపక్షాల నాయకత్వంలో భూ పోరాటం కొనసాగుతోంది. కొనేరు రంగారావు కమిటీ సిఫారసులను అమలు జరపాలనీ, అర్హులైన పేదలకు ఇండ్ల స్థలాలు ఇవ్వాలనీ, వ్యవసాయ భూమి ఇవ్వాలనీ వాళ్ల ప్రధాన డిమాండ్లుగా ఉన్నాయి. ముదిగొండలో సుమారు 600 ఎకరాల చెరువు శికం వ్యవసాయ భూములున్నాయి. ఆ భూములను ధనికులు ఆక్రమించుకొని అనుభవిస్తున్నారు. చెరువు శిఖం భూములను పేదలకు ఇవ్వాలని పేదలు డిమాండ్ చేస్తూ వున్నారు. ఒకేసారి వాటిని ఆక్రమించుకోవటానికి కూడా ప్రయత్నించారు. అప్పుడు పోలీసులు రంగప్రవేశం చేసి పేదలపై అక్రమ



కాల్పుల్లో చనిపోయినవారు

### చనిపోయినవారి పేర్లు

1. చిత్తూరి బాబూరావు (50), మేడిపల్లి గ్రామం, ముదిగొండ మండల్; వ్యవసాయ కూలి. (నుదుటిమీద బుల్లెట్ గాయం)
2. ఉసెకెల గోపయ్య (45), ముదిగొండ; రిక్షాకార్మికుడు (మర్మాంగం మీద బుల్లెట్ గాయం)
3. కత్తుల పెద్దలక్ష్మి (50), ముదిగొండ, సిపిఎం కార్యకర్త (ఛాతిమీద బుల్లెట్ గాయం)
4. బంకా గోపయ్య (45), వెంకటాపురం గ్రామం, అరటి పండ్ల వ్యాపారి (కడుపులో బుల్లెట్ గాయం).

వీరంతా సంఘటన స్థలంలో చనిపోయారు.

5. ఎలగందుల వీరన్న (30), ముదిగొండ (పొట్టలో బుల్లెట్ గాయం)
6. పసుపులేటి కుటుంబరావు (30), చిరుమర్రి గ్రామం, ఆటోడ్రైవర్ (తొంటిమీద బుల్లెట్ గాయం)

వీరు ఖమ్మం హాస్పిటల్‌కు తరలిస్తుండగా మార్గమధ్యంలో చనిపోయారు.

### గాయపడ్డవాళ్ల పేర్లు

1. బాలకృష్ణ – ఉస్మానియా ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నాడు. ఇతనికి కిడ్నీలో తూటా దూసుకుపోయి వుంటుందని డాక్టర్లు అంటున్నారు. పరిస్థితి ఆందోళనకరంగా ఉంది.
2. చింతల చెరువురాజు, మర్లసాని కోటేశ్వరరావు (వీళ్లిద్దరూ నిమ్స్‌లో అత్యవసర వార్డులో చికిత్స పొందు తున్నారు. ఎడమ చేతిలో బుల్లెట్ దిగటంతో పరిస్థితి విషమంగా ఉందని డాక్టర్లు అంటున్నారు)
3. తాళ్లూరి మధు (45) – ముదిగొండ. అతని ఇంటిలో నుండి మిద్దెపైకి వచ్చాడు. రెండు భుజాలకు రెండు బుల్లెట్లు తగిలాయి. ఒకటి బయటకు తీశారు. మరో బుల్లెట్ ఇంకా అతని శరీరంలో ఉంది. ఖమ్మం ఆసుపత్రిలో ఉన్నాడు.
4. శంకర్ (25), తిరుమలయ్య కుమారుడు, గొకినపల్లి. అరచేతిలో నుండి బుల్లెట్ వెళ్లింది. ఖమ్మం ఆసుపత్రిలో ఉన్నాడు.
5. నాగేశ్వరరావు (40), గురవయ్య కుమారుడు, ముదిగొండ. తలకు బుల్లెట్ గాయం. ఖమ్మం ఆసుపత్రిలో ఉన్నాడు.
6. బాణత మోతీ, చిన్ని భార్య, ముదిగొండ. ఎడమ భుజంలో నుండి బుల్లెట్ గాయం. ఖమ్మం ఆసుపత్రిలో ఉన్నాడు.
7. పాండు (35), హంసదేవర కుమారుడు, స్వీట్ దుకాణం, ముదిగొండ. మోకాలు కింద నుండి బుల్లెట్ దూసుకెళ్లింది.



కేసులను బనాయించారు. కేసులు పెండింగ్‌లో ఉన్నాయి. శిఖం భూములను ధనికులు ఆక్రమించుకుంటే చూస్తూ ఉన్న ప్రభుత్వం పేదలు ఆక్రమించుకోవటానికి ప్రయత్నం చేయటంతో అక్రమ కేసులను బనాయించింది. ఇది ప్రభుత్వ ద్వంద్వ వైఖరిని తెలియజేస్తోంది.

జూలై 22 నుండి ముదిగొండ సెంటర్‌లో టెంట్ వేసి భూ సమస్యని పరిష్కరించాలని గ్రామంలో పేదలు సిపిఎం నాయకత్వంలో ఆందోళన సాగుతోంది. జూలై 28న వామపక్షాలు రాష్ట్రవ్యాప్త బంద్‌కు పిలుపిచ్చాయి. దీక్షా శిబిరం వద్దనే సుమారు 150 మంది గుమిగూడి బంద్ చేస్తున్నారు. బంద్ చూడటానికి స్త్రీలు, పిల్లలు సెంటర్‌లో గుమిగూడారు. సుమారు మధ్యాహ్నం 12.30 ప్రాంతంలో ఎ.ఎస్.పి రమేష్‌బాబు ఆ గ్రామానికి వచ్చారు. అప్పటికే సెంటర్‌లోకి చేరుకున్న ఎస్.ఐ. వెంకటరెడ్డి, సి.ఐ. సురేందర్‌రెడ్డి, డి.ఎస్.పి. అక్కడే ఉన్నారు. వీళ్లతోపాటు కొంతమంది పి.సిలు, మఫ్టీలో ఉన్న పోలీసులు (వీళ్లు జీన్స్ ప్యాంట్లు, టీషర్టులు ధరించి, ఎస్.ఎల్.ఆర్. తుపాకులతో) వచ్చారు. బంద్ చేయవద్దని పోలీసులన్నారు. రాష్ట్రబంద్ కనుక మేం పాల్గొంటామని ఆందోళనకారులన్నారు. పాత ఇనుప సామానురేకులను రక్షణగా తీసుకొని మఫ్టీ పోలీసులు రోడ్డు మీద ఉన్న గుంపు మీదకి కాల్పులు జరిపారు. ఒకటి, రెండు రౌండ్లకే అక్కడ నుండి పారిపోతున్న ప్రజలపై పోలీసులు 80 రౌండ్లు కాల్పులు జరిపారు. స్త్రీలు, పిల్లలు అని కూడా చూడకుండా శత్రువులమీదికి దాడి చేసినట్టు కాల్పులు జరిపారు. కాల్చరాని చోట కాల్పులు జరిపారు. కావాలనే కాల్చినట్లుగా అక్కడ పరిస్థితి ఉంది. ఈ అమానుషమైన హత్యాకాండలో ఆరుగురు మృతిచెందగా 15 మంది తీవ్రగాయాలపాలైనారు.

వీళ్లను ఇప్పటివరకు పోలీసులు కాని, రెవెన్యూ అధికారులు కాని విచారించటం కాని, వాళ్ల స్టేట్‌మెంట్స్ నమోదు చేయటం కాని జరగలేదు. బాధితులపట్ల ప్రభుత్వ వైఖరికి ఇదే నిదర్శనం.

ముదిగొండ సెంటర్‌లో ఎస్.టి.డి. షట్టర్స్, గోడలకు, రేకులకు, చెట్లకు బుల్లెట్ తగిలిన గుర్తులున్నాయి. వీటిని బట్టి పోలీసులు విచ్చలవిడిగా కాల్పులు జరిపారని అర్థమవుతుంది. స్త్రీలు, పిల్లలు అని కూడా చూడలేదు. అందరూ దళితులు.

కాల్పుల సందర్భంగా పోలీసులు, పోలీసు అధికారులు తప్ప అక్కడ రెవెన్యూ అధికారులు ఎవ్వరూ లేరు. రెవెన్యూ అధికారులు అనుమతి లేకుండానే పోలీసులు కాల్పులు జరిపారు. పోలీసు స్టాండింగ్ ఆర్డర్స్ నెం. 887, 888 ప్రకారం పోలీసులకు ప్రజలపై కాల్పులు జరపాల్సిన అవసరం వస్తే ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్స్ అనుమతి తీసుకోవాలి, వాళ్లు అక్కడే వుండి పరిస్థితిని సమీక్షించాలి. పోలీసు ఇలాంటి ఆదేశాలను అమలు జరపలేదు.

నిజానికి పోలీసులు కాల్పులు జరపాల్సిన తీవ్రమైన పరిస్థితి ఏమీ లేదు. కాల్పులకు ముందు లాఠీచార్జి, బాష్పవాయువు, రబ్బరు తూటాలు, గాలిలోకి కాల్పులు, వాటర్ క్యానన్‌లను వాడాలి. ఇలాంటి నియమాలు ఇక్కడ అమలు జరపలేదు. అంతేకాదు గుంపును చెదరగొట్టాలనే ఉద్దేశ్యం కూడా పోలీసులకు వున్నట్టులేదు. నేరుగా కాల్పులు జరిపారు. నిబంధనలకు విరుద్ధంగా నడుమునుండి తల భాగాలపైనే కాల్పులు జరిపారు. అందుకే అంతమంది చనిపోయారు. అసలు పారిపోతున్న వాళ్ల మీద సందుల్లోకి కాల్పులు జరిపారు. మృతులు అక్కడే చనిపోయారు. అమానుష హత్యాకాండకు పోలీసులు పాల్పడ్డారు.

ప్రభుత్వ కార్యాలయం పైనో, దుకాణాలపైనో, ప్రభుత్వ ఉద్యోగుల పైనో ప్రజలు దాడికిదిగి శాంతిభద్రతల సమస్యను సృష్టిస్తున్నారంటే అదీలేదు. పోలీసులకు గాయాలయినట్లు ఏ ఆధారం లేదు. ప్రభుత్వ ఆసుపత్రిలో ఒక్క పోలీసు కానిస్టేబుల్ కూడా లేదు. ప్రజలు రాళ్లు విసిరారని, ప్రాణాలు రక్షించుకోడానికి కాల్పులు జరపాల్సి వచ్చిందని పోలీసులు ప్రకటించడం పూర్తిగావాస్తవ విరుద్ధం.

పాదయాత్ర సందర్భంగా రాజశేఖర రెడ్డి అధికారంలోకి వస్తే భూసమస్యలను, విద్యుత్ సమస్యలను, ఇండ్ల సమస్యలను పరిష్కరిస్తారని ప్రకటించారు. లక్షలాది మంది ఇండ్ల స్థలాల కోసం దరఖాస్తులు పెండింగ్‌లో వున్నాయని ప్రభుత్వ అధికారులే చెబుతున్నారు. ఇంటిస్థలం కోసం అర్హులైన పేదలకు ఒక సెంటు భూమి ఇవ్వలేని ప్రభుత్వం, పారిశ్రామికవేత్తలకు వేలాది ఎకరాలను ధారాదత్తం చేస్తున్నది. శాంతియుతంగా సమస్యను పరిష్కరించమని ఆందోళన చేస్తున్న ప్రజలపై అక్రమ కేసులు, అరెస్టులు, కాల్చి చంపటాన్ని సాగిస్తున్నదీ ప్రభుత్వం. ◆

## డిమాండ్స్

1. ముదిగొండ కాల్పులకు బాధ్యులైన పోలీసులందరిపై 302 ఐ.పి.సి., ఎస్.సి, ఎస్.టి. (పిఒఎ) యాక్ట్ 1989 కింద కేసులు నమోదు చేయాలి.
2. చనిపోయిన కుటుంబాలకు 10 లక్షలు, గాయపడ్డ వాళ్లకు 5 లక్షలు నష్టపరిహారం, కుటుంబంలో ఒకరికి ఉద్యోగం, 5 ఎకరాల పొలం, ఇంటిస్థలం ఇవ్వాలి.
3. ముదిగొండ ప్రజలపై పెట్టిన అక్రమ కేసులు ఎత్తివేయాలి.
4. ఇళ్ల స్థలాలు ఆక్రమించిన పేదలను తొలగించారు. వెంటనే వాళ్లకు ఇండ్ల పట్టాలు ఇవ్వాలి.
5. భూ పోరాటం సందర్భంగా ప్రజలపై పెట్టిన కేసులన్నింటినీ ఎత్తివేయాలి.

**ఏ సమాజాలలో న్యాయవ్యవస్థ ధ్వంసం అయిపోతుందో, అసమర్థంగా ఉంటుందో ఆ సమాజాలలోనే మాఫియాలు తలెత్తుతాయి, సరిగ్గా ఇవ్వాళ దేశం ఆ స్థితిలో ఉందంటున్నారు కె.జి. కన్నబిరాన్**

# ఆరు దశాబ్దాల అభివృద్ధి

అభివృద్ధి అంటే స్వాతంత్ర్యం ఇచ్చే అవకాశాలతో చరిత్రాత్మకమైన ముఖాముఖమే.

**- అమర్త్యసేన్**

అభివృద్ధి గురించి మన అవగాహన ఏదైనా దానికి మౌలిక పునాదిగా ఉండవలసినది గురజాడ అప్పారావు గారి 'దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' అనే సుప్రసిద్ధ వాక్యం. ప్రస్తుత ప్రపంచీకరణ పరిభాషలోకి దాన్ని మారిస్తే దేశమంటే భూ బకాసురులు అమ్మకాలు, కొనుగోళ్లు జరిపే రియల్ ఎస్టేట్ కాదు. దేశమంటే ఒక భూమి మీద నివసిస్తూ ఆ భూమికీ, వనరులకూ విలువ ఇచ్చే మనుషులు. మన దేశ రాజ్యాంగం ప్రకటించిన సామాజిక, ఆర్థిక తాత్విక దృక్పథం అందరికీ సమాన న్యాయం అని చెప్పింది. మానవాభివృద్ధి అంటే ఏమిటో రాజ్యాంగ ప్రకటన ప్రవేశికలో స్పష్టంగానే బయటపడింది. అభివృద్ధి గురించి మన అవగాహన ఈ పునాదులపైనే సాగాలి.

చాలా వలస దేశాలలో జరిగినట్టుగానే మనదేశంలో కూడా రాజ్యాంగం అనేది మహా ఆర్థిక సంక్షోభం తరువాత, రెండో ప్రపంచ యుద్ధం తరువాత ఉనికిలోకి వచ్చింది. మహా ఆర్థిక సంక్షోభం (1929) నుంచి రెండో ప్రపంచ యుద్ధం ముగిసిపోయిన 1945 దాకా పాశ్చాత్య అర్థ శాస్త్ర వేత్తలు పెద్ద ఎత్తున పునరాలోచన చేశారు. పెట్టుబడిదారీ విధానాన్ని ఆడమ్ స్మిత్ ప్రవచించిన అర్థ శాస్త్రం నుంచి, దానిలో స్వాభావిక అనివార్య భాగమైన సంక్షోభాల నుంచి కాపాడడం ఎట్లా అని ఆలోచించారు. ప్రజల కొనుగోలు శక్తిని విపరీతంగా పెంచడం ద్వారా, సరుకుల గిరాకీని పెంచి ఉద్యోగ కల్పనను పెంచితే పెట్టుబడిదారీ సంక్షోభం నుంచి బయటపడవచ్చునని జాన్ మేనార్డ్ కీన్స్ అభిప్రాయ పడ్డారు. ఈ సైద్ధాంతీకరణ ఫలితంగానే మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అనే భావన వచ్చింది. మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో మొత్తంగా ఆర్థిక నిర్మాణం కుప్పకూలిపోకుండా చూసే బాధ్యతను ప్రభుత్వమే తీసుకుంటుంది. సాంప్రదాయిక అర్థ శాస్త్రంలోగానీ, కీన్స్ చెప్పిన అర్థ శాస్త్రంలోగానీ పంపిణీ సమానంగా ఉండాలా లేదా అనే విషయం పై దృష్టిలేనే లేదు. ఆర్థిక వ్యవస్థను ప్రణాళికా బద్ధంగా నడపడమైనా, పెద్ద ఎత్తున ప్రభుత్వ సంస్థలు నెలకొల్పడమైనా, పెద్ద స్థాయిలో నిరుద్యోగం లేకుండా చూడడానికే తప్ప మరొకందుకు కాదు. కానీ మన రాజ్యాంగంలో దేశ ప్రజలందరి మధ్య అర్థవంతమైన సమానత్వాన్ని సాధించడం ప్రభుత్వ బాధ్యతగా గుర్తించడం జరిగింది. అప్పటి వరకూ పాలితులుగా ఉన్న భారతీయ ప్రజలు పౌరులుగా మారారు. అంటే ఈ దేశ ప్రజలు చరిత్రలో మొట్టమొదటిసారిగా తమను పాలించే ప్రభుత్వాలను తామే ఎన్నుకునే శక్తి పొందారు. ఆ ప్రభుత్వాలు రాజ్యాంగం నిర్దేశించిన కర్తవ్యాన్ని నెరవేర్చే పని తీసుకున్నాయి. అంటే మన మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో పంపిణీ, సమన్యాయం అనేవి ప్రధానమైనవి. ఎందుకంటే మన రాజ్యాంగమే ఈ దేశంలో ఒక సోషలిస్టు తరహా సమాజాన్ని రూపొందించ తలచింది. అందువల్లనే మనం స్వాతంత్ర్యం సంపాదించినప్పటి నుంచి, రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటినుంచి పంచవర్ష ప్రణాళికల రూపంలో జాతీయ పారిశ్రామిక విధాన రూపంలో అనేక ఇతర చట్టాల రూపంలో ప్రతిపాదించిన అభివృద్ధి కార్యక్రమాలన్నీ పంపిణీని, సమన్యాయాన్ని సాధించడం కోసం మాత్రమే. జమీందార్లు వగైరా, భూస్వామ్య వ్యవస్థను మనం చట్టపరంగా రద్దు చేసుకున్నాం. మొదటి రెండు పంచవర్ష ప్రణాళికలతో కూడిన రాజ్యాంగపు మొదటి దశాబ్దం చాలా ప్రోత్సాహకరంగా గడిచింది. వ్యవసాయం, నీటిపారుదల, విద్యుదుత్పత్తి, రవాణా, రైల్వేలు, రహదారులు వంటి రంగాలలో ప్రణాళికల విజయాలు సంతృప్తికరం అనే దానికన్న ఎక్కువగానే సాగాయి. మొదటి పంచవర్ష ప్రణాళికలో కేంద్రీకరణ ఆర్థిక స్థిరత్వం మీద, ఆహారపు కొరతను రద్దు చేయడం మీద, మౌలిక వనరుల సమకూర్చుకోవడం మీద ఉండింది. రెండో ప్రణాళికలో దృష్టి మన పెట్టుబడి పునాదిని బలపర్చుకోవడం కొరకు పారిశ్రామికీకరణ కార్యక్రమాన్ని విస్తరించడం మీద ఉండింది. మదుపు, వ్యవసాయ పారిశ్రామిక ఉత్పత్తి సూచికలన్నీ కూడా పెరుగదలను చూపాయి. ప్రతి అంశం సంతృప్తికరంగానే ఉన్నట్టు కనబడింది. ఆ పరిస్థితి వల్ల ఎంతో కొంత రాజకీయ సుస్థిరత కూడ సాధ్యమైంది. ఈ సమయంలో భూసంస్కరణలకు సంబంధించి న్యాయ స్థానాల ముందుకు 11 కేసులు వస్తే 1952-53లలో రెండు కేసుల మినహా మిగిలిన ఏ కేసులోనూ కోర్టులు భూసంస్కరణల చట్టంలోని ఏ నిబంధనను కొట్టివేయలేదు.

1960-70 దశకం దేశానికి సంక్షోభ కాలం. మూడో ప్రణాళిక అంతా కూడా సంక్షోభంతో నిండిపోయింది. భారత - చైనా యుద్ధం వలన, మనకు లభించే వనరులన్నింటినీ అభివృద్ధి కోసం కాక రక్షణ వ్యయానికి వెచ్చించవలసి వచ్చింది. 88 మిలియన్ టన్నులుగా ఉన్న ఆహార ధాన్యాల ఉత్పత్తి 1964-65లో 74 మిలియన్ టన్నులకు పడిపోయింది. తీవ్రమైన ముడిసరుకుల కొరత తలెత్తింది. ఒక రచయిత

అభివర్ణించినట్టుగా దేశానికి ఉన్న అతి ప్రధానమైన స్థిరాస్తి నెహ్రూ 1964లో చనిపోయాడు. పాకిస్తాన్‌తో సంబంధాలు ఏమంత మెరుగ్గా లేవు. మూడో పంచవర్ష ప్రణాళిక విఫలమై ఆర్థిక వ్యవస్థ సమతౌల్యాన్ని కోల్పోయింది. ప్రణాళికాబద్ధ ఆర్థికవిధానం దేశంలో బడా వ్యాపారవేత్తల ఆర్థిక శక్తి పెంపొందడానికే ఉపయోగపడిందని 1964లో మహలనోబిస్ కమిటీ తేల్చి చెప్పింది. ఈ కాలమంతా కూడ మన వనరులన్నింటిని సంపన్న వర్గాల ప్రయోజనాలకే మళ్లించడం జరిగింది. రాజకీయ స్థాయిలో పాలనావిధానం దిగజారిపోవడం స్పష్టంగా కనబడింది. కాంగ్రెస్ లోలోపలనే అధికారం కోసం కుమ్ములాట మొదలైంది. ఇందిరాగాంధీ నాయకత్వంలోని ప్రజాకర్షక శక్తులు గెలుపొందాయి. భారత కమ్యూనిస్టు పార్టీ నాలుగుగా చీలిపోయి నాలుగవ ముక్క మరెన్నో ముక్కలుగా చీలిపోయాయి. అయితే అన్నిటికన్న ముఖ్యమైనది ఏమంటే దేశంపై ఆధిపత్యం ఎవరిదని ఘర్షణ మొదలయి 1975లో అత్యవసర పరిస్థితి విధించబడింది. ఆమె పాలనవల్ల లాభపడ్డ వర్గమే ఆమె శత్రువుగా మారి ఆమె ప్రారంభించిన జనాకర్షక రాజకీయాల్ని ఓడించడం కోసం న్యాయస్థానాలలో పోరాడడం మొదలుపెట్టాయి. నాగిరెడ్డి తన శాసన సభ్యత్వానికి రాజీనామా చేసి విప్లవకారుడిగా మారాడు. ఆయనతోపాటు మరెందరో పోరాడడం ప్రారంభించారు. వారిలో ఎన్‌కౌంటర్లలో చంపివేయబడినవారు మినహా మిగిలినవారు అనేక కుట్రకేసులలో బందీ లయ్యారు. ప్రజలలో విస్తృతంగా ఉన్న అసంతృప్తిని నక్సలైట్లు గుర్తించారు. ఆ అసంతృప్తిని విప్లవం దిశగా మరల్చడానికి వారు ప్రయత్నించారు.

ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టు పాలిత దేశాలు కుప్పకూలిన తరువాత విప్లవ, ఇతర మార్క్సిస్ట్ ఉద్యమాలు వెనుకంజవేశాయి. ద్రవ్య పెట్టుబడి, దానికి ప్రాతినిధ్యం వహించే ద్రవ్య సంస్థలు, పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలు ఆర్థిక వ్యవస్థలను పెద్ద ఎత్తున నియంత్రించడానికి ముందుకు వచ్చాయి. దీని నేపథ్యంలోనే అభివృద్ధి చెందుతున్న దేశాలన్నిటి పైన తమ ఆర్థిక సరిహద్దులను సరళీకరించమని, ప్రపంచ ఆర్థిక శక్తుల నిరాటంకమైన ప్రవేశాన్ని అనుమతించమని ఒత్తిడి మొదలైంది. రెండో ప్రపంచ యుద్ధం తరువాత మన దగ్గరికి పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద ఆక్రమణల ద్వారా రాబోవడంలేదు. గతంలోనైతే మనను సంస్కరించే శ్వేతజాతి పవిత్ర బాధ్యత తన మీద ఉన్నదని ఈస్టిండియా కంపెనీ అనుకున్నది. కాని ఇప్పుడు పాశ్చాత్య ప్రపంచం ప్రజాస్వామిక పద్ధతిలో దేశాల పాలనను సరిదిద్దడానికి వస్తోంది. ఆ ప్రయత్నాలు యుద్ధానికి, యుద్ధంలాంటి పరిస్థితులకు దారి తీసినా సరే. ఆ ఆధిపత్యాన్ని బ్రెటన్ వుడ్స్ సంస్థలు గానీ, ఆ సూత్రాలపై రూపొందిన సంస్థలు గానీ నిర్ణయిస్తాయి. ఎటువంటి ఆటంకాలు లేని పెట్టుబడిదారీ విధానం ప్రజలను అతలాకుతలం చేస్తుందని వారికి తెలుసు. ఏడెనిమిది దశాబ్దాల పాటు యూరప్‌ను ఆవహించిన కమ్యూనిస్టు భూతాన్ని పారదోలినప్పటికీ ఆ భూతం ప్రపంచాన్నంతా ఆవహిస్తుందని వాళ్లలో కొందరికైనా తెలుసు. ఈ అభివృద్ధి చెందిన దేశాలు అధికారం చెలాయించే ద్రవ్య సంస్థల ద్వారా వాళ్లు ఇప్పుడు ప్రపంచాన్ని పాలించాలని అనుకుంటున్నారు. ఆ ద్రవ్య సంస్థలు ఒక డాలర్‌కు ఒక ఓటు అనే సూత్రం మీద పనిచేస్తాయి. ఈ సంస్థల పని విధానంలో ఏదైనా మార్పు తేవాలంటే 85 శాతం ఆధిక్యతతో తీర్మానం నెగ్గించుకోవాలి. అలా చేసినా వాటి పనితీరులో మౌలికమైన తేడా రాకపోవచ్చు. సంపన్న దేశాలు ప్రపంచాన్ని అదుపులో పెట్టుకోవడానికి ఉన్న శక్తివంతమైన సాధనాలు ఇవి. మనం మన అనుభవం నుంచి తెలుసుకున్నదేమంటే ప్రపంచ బ్యాంకుతో ఎంత వాదించినా, ఎన్ని కారణాలు చూపినా నర్మదా ఆనకట్ట ఎత్తును ఒక అంగుళం కూడ తగ్గించలేకపోయాం. 'దేశపు సరిహద్దుల దగ్గరే ఆగిపోయే, జాతీయంగా ముఖ్యమైన ఏ ఒక్క సమస్య కూడ మనకి ఇప్పుడు లేదు. ఆహార పదార్థాల మీద అతికించే చీటీలనించి రైల్వే టైంటేబుళ్లదాకా ప్రతి నిర్ణయాన్ని శాసించే శక్తిని ప్రపంచ వాణిజ్య సంస్థ సంతరించుకుంది. పేద దేశాలు తమ పాఠశాలల్లో ఏ బ్రాండ్ కంప్యూటర్లు కొనాలో ఆదేశించే దాకా ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి విస్తరించాయి. మనం శాంతియుతంగా జీవిస్తామా, లేక ఎల్లకాలానికి తీవ్రవాదానికీ, యుద్ధానికీ బలైపోతామా నిర్ణయించే అధికారం భద్రతామండలికి మాత్రమే ఉన్నది. వాతావరణ మార్పులు, ద్రవ్యలావాదేవీలు, రుణభారం, సరళీకరణ మనం ఎక్కడ నివసించినా మనని అందుకుంటాయి. ప్రజాస్వామ్యం తప్ప ప్రతి ఒక్కటీ ప్రపంచీకరణ పొందింది. ఇక ప్రపంచ పాలకులు మన గురించి ఏ ప్రస్తావనా లేకుండా తమ వ్యాపారం తాము సాగిస్తారు. అందువల్ల వాళ్లు తీసుకునే ఎన్నో నిర్ణయాలు ఆయా దేశాలలోని అత్యధిక సంఖ్యాకులకు కీడు కలిగించేవి. అత్యల్ప సంఖ్యాకులకు, పాలకవర్గాలకు మేలు చేసేవిగా ఉండడం ఆశ్చర్యం కాదు' అని జార్జ్ మాన్‌బయో రాశాడు.

ఈ కొత్త సరళీకరణ విధానాలు మార్క్స్‌తోపాటు కీన్స్‌ను కూడ కట్టగట్టి పైన పారేశాయి. సరళీకరణ రాజకీయాలకు పంపిణీతో, సమన్యాయంతో సంబంధమే లేదు. నీతి, విలువలు అనే విషయాలు దానికి తెలియనే తెలియదు. ప్రస్తుతం మన రాజకీయ నాయకులు, నిపుణులు అభివృద్ధి గురించి మాట్లాడినప్పుడు దానికి చాలా సంకుచిత అర్థం ఇస్తారు. అభివృద్ధి అంటే జాతీయోత్పత్తిలో పెరుగుదల మాత్రమే అన్నట్టు మాట్లాడుతారు. తలసరి ఆదాయంలో చిన్న పెరుగుదల కొన్ని కొత్త పరిశ్రమలు రావడం, హైటెక్ రంగంలో కొన్ని విజయాలు, పట్టణాలు అందంగా మారిపోవడం, అతివేగంగా పరుగులు పెట్టే ఆటోమొబైల్‌లకు రాష్ట్ర, జాతీయ రహదారుల మీద మరింత స్థలం దొరకడం, పర్యాటక ప్రాంతాలు, ఐదు నక్షత్రాల హోటళ్లు పెరిగిపోవడం – ఇవి మాత్రమే అభివృద్ధి అన్నట్టు మాట్లాడుతారు. కాని దీన్ని అభివృద్ధిగా అభివర్ణించడానికి వీల్లేదు. ప్రపంచీకరణ తరువాత మనం భారత రాజ్యాంగాన్ని రద్దు చేసుకోలేదు. మన ఆర్థిక విధానాలను మన రాజ్యాంగ విలువల చట్రం ప్రకారమే నిర్ణయించుకోవలసి ఉంది. ప్రపంచీకరణ మన దేశం కుదుర్చుకున్న అనేక అంతర్జాతీయ ఒప్పందాలను రద్దు చేసి మన పౌర, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక హక్కులను భగ్నం చేయజాలదు. అమర్త్యసేన్ చెప్పినట్టు ప్రజలు ఇప్పటికే అనుభవిస్తున్న వాస్తవ స్వేచ్ఛలను ఇంకా విస్తరించే క్రమం కావాలి. 'అభివృద్ధిని నిజమైన స్వేచ్ఛల విస్తరణగా చూసినప్పుడు అభివృద్ధిని ముఖ్యంగా భావించే లక్ష్యం మీద దృష్టి ఉండాలి. ఆ క్రమంలో ప్రముఖ పాత్ర వహించే సాధనాల మీద కాదు' అని అమర్త్య సేన్ అన్నారు. ఒక విశాల దృక్పథంతోపాటుగా దేశంలో కొనసాగుతున్న అసమానతలను కూడ పరిగణనలోకి తీసుకోవాలి. భారత రాజ్యాంగం వెట్టిచాకిరీని,

బాలకార్మిక శ్రమను, అస్పృశ్యతను, షెడ్యూల్డ్ కులాల, తెగల ప్రజలు అనుభవించే సాంప్రదాయిక సామాజిక అణచివేతను పరిగణనలోకి తీసుకుంది. మార్కెట్‌కు సామాజిక, ఆర్థిక అవకాశాలకు మార్గం సుగమం కావడం ఇటువంటి పరిస్థితులలో సాధ్యం కాదు. ఈ అంశాలను గుర్తించని అభివృద్ధి ఏదైనా సంపన్న అగ్రవర్ణాలకు, మతఛాందసం పెరిగిపోవడానికి, తద్వారా వెనుకబడిన కులాలపైన షెడ్యూల్డ్ కులాలపైన తెగలపైన, మైనారిటీల పైన హింసకు దారీతీస్తుంది. అసమానమైన సంస్కరణలవల్ల రూపొందే సామాజిక నిరాదరణ ఒక బహుళ సమాజంలో దళిత, మైనారిటీల వర్గాల ఆర్థిక శక్తిని అరికడ్తుంది. ఇతరులతో సమానంగా వారు ఎదగకుండా అడ్డుకుంటుంది. ఆ స్థితిలో తీవ్రవాద హింస, దళితలకు వ్యతిరేకంగా హింస పెరిగిపోతాయి. తత్ఫలితంగా రెండు మైనారిటీ వర్గాలలో తీవ్రవాదానికి ఆకర్షణ పెరిగిపోయింది. దాన్ని తీవ్రవాదంగా ముద్రవేసి పక్కన పెట్టం అంటే అటువంటి అనాదృత వర్గాలలో పెరిగిపోతున్న నిస్సహాయత స్వభావాన్ని అర్థం చేసుకోకపోవడమే అవుతుంది.

దురదృష్టవశాత్తు ప్రభుత్వం ఆ రెండు వర్గాలను తీవ్రవాదులుగా ముద్రవేసి అణచడానికి ప్రయత్నించింది. సిక్కులను తీవ్రవాద విచ్ఛిన్నకర కార్యకలాపాల (నిరోధ) చట్టం ద్వారా, ముస్లింలను పోటా ద్వారా, చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం (1967) ద్వారా అణచడానికి ప్రయత్నించింది. పోటా రద్దు చేసిన తర్వాత దానిలోని నిబంధనలను అన్నిటినీ ఒక సవరణ ద్వారా 1967 చట్టంలో భాగం చేశారు. ఈ చట్టాల కింద నిషేధానికి గురైన సంస్థలు అన్నీ కూడ ఈ రెండు మైనారిటీ మతాల సంస్థలే. సమాజంలో అవకాశాలు అసమానంగా ఉండడం వల్ల ఈ వర్గాల నుంచి ఒక సంపన్న వ్యాపార వర్గం తలెత్తలేకపోయింది. దానితోపాటు మాఫియా అభివృద్ధి చెందడం అభివృద్ధికి ఒకఆటంకం అయ్యింది. ఆ మాఫియా పాలక ముఠాలతో కలిసి పాలనలోకి, అన్ని ప్రధాన అభివృద్ధి పథకాలలోకి ప్రవేశించడం మరింత గందరగోళానికి దారితీసింది. ఏ సమాజాలలో నైతే న్యాయ వ్యవస్థ ధ్వంసం అయిపోతుందో, బలహీనంగా ఉంటుందో, అసమర్థంగా ఉంటుందో ఆ సమాజాలలోనే మాఫియాలు తలెత్తుతాయి. మొట్టమొదట రాజకీయ నాయకులకు ఓట్లు సంపాదించి పెట్టేవారిగా తయారైన మాఫియా నాయకులు చివరికి తామే ప్రజాప్రతినిధులుగా మారిపోతారు. వాళ్లే కాంట్రాక్టులు చేపడుతారు. తగాదాలు పరిష్కరిస్తారు. తక్షణ న్యాయం సమకూర్చడానికి కిరాయి హంతకులను సరఫరా చేస్తారు. ప్రజా ఉద్యమ కార్యకర్తలను, తీవ్రవాద కార్యకర్తలను, మానవ హక్కుల కార్యకర్తలను చంపివేయడానికి ఇటువంటి మాఫియాను వాడుకోవడం పాలకులకు అలవాటు అయ్యింది. ఇటువంటి తప్పుడు ధోరణులన్నిటినీ రద్దు చేసినప్పుడు మాత్రమే అభివృద్ధికి నిజమైన సార్థకత దక్కుతుంది. ఇవ్వాళ మనం అనుభవిస్తున్నది వినియోగదారీ ప్రజాస్వామ్యమే తప్ప పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కాదు.

'మనం గడుపుతున్న జీవితాలను, మనం అనుభవిస్తున్న స్వేచ్ఛలను సుసంపన్నం చేసేందుకు అభివృద్ధి ఉపయోగపడాలి. మనం విలువలు ఇస్తున్న స్వేచ్ఛలను విస్తరించడం అంటే మనం జీవితం మరింత సంపన్నం కావడమే. మరింత నిరాటంకం కావడమే. తద్వారా మనం మరింత సమగ్రమైన సామాజిక మానవులు అవుతాం. మన ఇష్టాలను నెరవేర్చుకోగలుగుతాం. ప్రపంచంతో అర్థవంతంగా జోక్యం పెట్టుకొని ప్రభావితం చేయగలుగుతాం' అన్నాడు అమర్త్యసేన్. ◆

(మిగతా వచ్చే సంచికలో)




## పదే పదే అదే మాట!

'మేం పేదరికాన్నీ, నిరుద్యోగాన్నీ, తీవ్రవాదాన్నీ నిర్మూలిస్తాం...'

– 'ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్' సౌజన్యంతో

ఈ దేశంలో కేవలం బలహీనులపై, దళిత బహుజనులపై, ముస్లిం మైనారిటీలపై, సామాన్యులపై మాత్రమే చట్టాలు, శిక్షలు అమలవుతున్నాయే తప్ప నిజమైన దోషులపట్ల కాదని అంటున్నారు **దుడ్డు ప్రభాకర్**

# దళితుల ఆత్మగౌరవాన్ని ఎలుగెత్తి చాటిన చుండూరు

దేశ చరిత్రలోనే ప్రప్రథమంగా నరమేధం జరిగిన చోటే న్యాయ విచారణ జరిగే విధంగా చుండూరు దళితులు వీరోచితంగా పోరాడి ప్రత్యేక కోర్టు సాధించుకున్నారు. అగ్రకుల భూస్వాములు, పోలీసులు, రాజకీయ నాయకులు హిందూత్వ శక్తులు ఐక్యమై అనేక ఇబ్బందులు సృష్టించినా చుండూరు దళితులు ధైర్యంగా నిలబడి, న్యాయపోరాటం చేసి దేశవ్యాప్తంగా దాడులకు గురవుతున్న దళితులకు ఆదర్శంగా నిలిచారు. చుండూరు మారణకాండ జరిగి పదహారు సంవత్సరాలైంది. సుమారు మూడు సంవత్సరాలు విచారణ జరిపిన ప్రత్యేక న్యాయస్థానం 2007 జూలై 31న తుది తీర్పు ప్రకటించింది. దళితులపై దాడులు జరిగిన అనేక సందర్భాలలో వేలాది కేసులు పోలీస్ స్టేషన్లలో నమోదు కాలేదు. అనేక అడ్డంకులను అధిగమించి కోర్టు మెట్లెక్కినా పలుకారణాలవల్ల కోర్టుల్లో వీగిపోతున్నాయి. ఈ నేపథ్యంలో వెలువడిన చుండూరు తీర్పు యావద్భారతదేశ దళితులకు ఎడారిలో ఒయాసిస్ లాంటిది. అనేక సంక్షోభాలతో చీలికలు పీలికలై అంపశయ్యమీదున్న దళిత ఉద్యమానికి చుండూరు దళితులు ఊపిరి పోశారు. దళిత, బహుజన, సామాజిక ఉద్యమ శక్తులను నిద్రలేపి, వీపు చరిచి ముందుకు నడవమని ఆజ్ఞాపించారు.

చుండూరు నరమేధం జరిగిన 1991 ఆగస్టు 6 నుండి కోర్టు తీర్పు వెలవడే వరకు జరిగిన పరిణామాలు అనేక అమానవీయ సామాజిక, రాజకీయ కోణాలను మనముందుంచాయి. దాడి జరగడానికి గల నేపథ్యం, దాడి జరిగిన రోజు పోలీసులు నిర్వహించిన పాత్ర, కొమ్మర్ల అనిల్ కుమార్‌ను కాల్చిచంపడం, హిందూత్వ శక్తులు దళితులపై చేసిన దుష్ప్రచారం, నేటికీ 7 మంది ముద్దాయిలు అరెస్ట్ కాకపోవడం, 14 ఏళ్ల కోర్టు జాప్యం, 33 మంది ముద్దాయిలు, 25 మంది సాక్షులు మరణించడం, 123 మంది ముద్దాయిలు నిర్దోషులుగా విడుదల కావడం లాంటి సంఘటనలు ఈ దేశంలో చట్టం, న్యాయం దళితులపట్ల అమలౌతున్న తీరును మరోసారి స్పష్టం చేశాయి.

### దళితుల ఎదుగుదలను సహించలేకనే హత్యాకాండ

చుండూరు మారణకాండ జరిగేనాటికి 450 మాల, 150 మాదిగ కుటుంబాల దళితులు ఆ గ్రామంలో జీవిస్తున్నారు. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల దళితుల కంటే చుండూరు దళితులు కొంత మెరుగైన ఆర్థిక జీవనం కలిగి ఉన్నారు. రైల్వే గ్యాంగ్‌మెన్‌లుగా, టీచర్లుగా, గుమస్తాలుగా అతికొద్దిమంది ఉన్నప్పటికీ దళిత ఉద్యోగుల నిష్పత్తితో పోల్చుకుంటే ఈ సంఖ్య ఎక్కువే. సంవత్సరం పొడవునా కూలి పనులు దొరకడం వల్లకూడా పస్తులు లేని జీవనం గడుపుతూ పిల్లల్ని చదివించు కుంటున్నారు. ఆనాటికి ఇంటర్మీడియట్ ఆపై చదివిన విద్యార్థులు 200 మంది ఉన్నారు. ఐదుగురు పి.జి పూర్తి చేసిన వారున్నారు. విద్యావంతులైన దళిత యువకులు అంబేద్కర్ యువజన సంఘం ఆధ్వర్యంలో రెడ్డికుల దరహంకారాన్ని ఆధిపత్యాన్ని, దౌర్జన్యాలను ప్రతిఘటించారు. ప్రతిచోటా జరుగుతున్నట్టే దళితుల ఎదుగుదలను, ప్రశ్నించే శక్తిని సహించలేని రెడ్డికుల దురహంకారం చుండూరులో కోరలు సాచింది. చుండూరు రెడ్లు, నాయుడ్లు మున్నంగివారిపాలెం, మోదుకూరు రెడ్లు, నాయుడ్లను కూడేసి దళితులపై దమనకాండకు పథక రచన చేశారు. నరమేధానికి ముందు జరిగిన సినిమా హాలులో గొడవ సాకుతో దళితులను సాంఘిక బహిష్కరణకు గురిచేశారు. సాంఘిక బహిష్కరణ విధించిన వారిపై చట్టప్రకారం చర్యలు తీసుకోవాల్సిన పోలీసులు 1991 జూలై 7న గ్రామంలో పోలీస్ పికెట్ పెట్టారు. దళితులకు రక్షణగా ఉండాల్సిన పోలీసులు అగ్రకులాలతో కుమ్మక్కై అంతకు ముందు జరిగిన గొడవకు సంబంధించిన కేసులో దళితులను అరెస్ట్ చేసే నెపంతో ఇళ్లనుండి బయటకు పంపే కుట్రలో భాగంగా ఆగస్టు 6న ఉదయం దళితవాడపై దాడి చేశారు. అదే విషయం ప్రత్యేక కోర్టులో చుండూరు దళితులు ఘంటాపథంగా చెప్పారు. పొలాలవైపు పరుగులు తీస్తున్న దళితులను మూడు గ్రామాలకు సంబంధించిన రెడ్లు, నాయుడ్లు సుమారు 250 మంది ట్రాక్టర్లలో కత్తులు, గొడ్డళ్లు, బరిసెలతో వెంటాడి వేటాడి దొరికిన వాళ్లను దొరికినట్లు నరికి చంపారు. మూటలు కట్టి తుంగభద్రలో వేశారు. జాలాది మత్తయ్య, జాలాది ఇమ్మానుయేలు, జాలాది ఇస్సాకు, మల్లెల సుబ్బారావు, మంద్రు రమేష్, దేవరపల్లి జయరాజ్, సంకురు సంసోన్, అంగలకుదురు రాజమోహన్‌లు ఈ హత్యాకాండలో బలయ్యారు.

కళ్లెదుటే తమవాళ్లను నరుకుతుంటే గుండెలు పగిలేలా ఏడుస్తూ మాగాటికయల్లో పిచ్చిగా పరుగులు తీశారు. పరుగెత్తలేక వేటగాళ్ల కత్తులకు బలై రక్తగాయాలతో దాహం... దాహం అంటుంటే నోట్లో ఉచ్చపోశారని, సిరంజితో నెత్తురులాగి పైకి నొక్కి ఆ నెత్తుటి జల్లులో తడిసి ఆనందించిన మానవ మృగాలు వికటాట్టహాసం చేశాయని ప్రత్యేక కోర్టులో చుండూరు దళితులు కన్నీటి పర్యంతమయ్యారు.

ఆనాడు మంద్రు రమేష్ శవాన్ని చూసిన తన అన్న పరిశుద్ధరావు గుండెపగిలి చనిపోయాడు. శవాలకు పోస్ట్‌మార్టమ్ చేసిన దళిత డాక్టర్ రవిచంద్ర నరికివేయబడ్డ శవాల ముద్దలు చూసి చలించి ఆత్మహత్య చేసుకున్నాడు. హంతకుల్ని అరెస్టు చేయాలని జరిగిన ఉద్యమానికి నాయకత్వం వహించిన అనిల్‌కుమార్‌ను నిరాహారదీక్ష శిబిరంలోనే పోలీసులు కాల్చిచంపారు. చలో ఢిల్లీ కార్యక్రమంలో భాగంగా ఢిల్లీలో రోడ్డు దాటుతూ యాక్సిడెంట్‌కి గురై గూడూరు లేయమ్మ అక్కడికక్కడే మరణించింది. ఈ సంఘటనలో ప్రత్యక్ష, పరోక్ష హత్యలకు మొత్తం 12 మంది దళితులు బలయ్యారు.

## దళితులను మనుషులుగా చూడనిరాకరించిన సమాజం

చుండూరు దళితులను అమానుషంగా నరికి చంపిన అగ్రకుల పెత్తందార్లు, పోలీసులు కలిసి అప్పటి గుడి పూజారి అయిన చిన జీయర్‌స్వామిని రంగంలోకి దింపి 'సర్వజనాభ్యుదయ సమితి' ఏర్పాటు చేశారు. ఈ సమితి ఆధ్వర్యంలో పోలీసుల రక్షణ మధ్య రాష్ట్రం నలుమూలలా వందలాది సభలు జరిపారు. చుండూరులో దుష్టసంహారం జరిగిందనీ, అది దైవకార్యమనీ చుండూరు అగ్రకులాల వారు అవతార పురుషులనీ ప్రచారం చేశారు. దాంతో రెచ్చిపోయిన అగ్రకుల విద్యార్థులు గుంటూరు జిల్లా పెదనందిపాడు కాలేజీలోని దళిత విద్యార్థులపై మారణాయుధాలతో దాడి చేసి తరిమికొట్టారు. గుంటూరు నడిబొడ్డున గల ఆంధ్రాక్రిస్టియన్ కాలేజీ హాస్టల్‌పై అగ్రకుల విద్యార్థులు ఎబివిపి ఆధ్వర్యంలో దాడిచేశారు. హాస్టల్‌లోని విద్యార్థులను కొట్టి బట్టలు, పుస్తకాలు ఒక చోట వేసి తగులబెట్టారు. పెట్టెలను ధ్వంసం చేశారు. చుండూరు హత్యాకాండను ఖండించకపోగా మెజారిటీ ప్రజలు ఈ ప్రచారం మాయలోపడి దళితులను ఒంటరివాళ్లను చేశారు. 'చుండూరు లో చిచ్చు పుట్టేను, అందులో అధములు చచ్చేను' అని బ్రహ్మంగారు కాలజ్ఞానంలో చెప్పినట్టు ఆడియో క్యాసెట్‌లు రికార్డు చేసి ఉచితంగా రాష్ట్రమంతా పంపిణీ చేశారు. చుండూరులో హత్యకు గురైన దళితులు దుష్టులుగా, హంతకులు అవతారపురుషులుగా కొనియాడబడ్డారు.

ఈ సందర్భంగా ఒక విషయాన్ని గుర్తు చేయాలనుకుంటున్నాను. 2003లో విజయవాడ కాలేజీలో శ్రీలక్ష్మి అనే విద్యార్థినిని మనోహర్ (దళితుడు) అనే అతను క్లాస్‌రూంలోనే నరికి చంపాడు. మనోహర్ అరెస్టై, శిక్షపడేవరకు రాష్ట్ర వ్యాపితంగా విద్యార్థి సంఘాలు, మహిళా సంఘాలు, వివిధ ప్రజాసంఘాలు అనేక పోరాట రూపాలను ఎన్నుకొని మనోహర్‌కి ఉరిశిక్ష వేయించేదాకా ఉద్యమించాయి. మనోహర్‌ని అండర్‌ట్రైల్ ఖైదీగా విజయవాడ జైల్లోనే ఉంచి ఒకటిన్నర సంవత్సర కాలంలోనే విచారణ పూర్తిచేసి జిల్లా కోర్టు ఉరిశిక్ష ఖరారు చేసింది. హంతకులెవరైనా శిక్ష పడాల్సిందే. కానీ ఈ దేశ చరిత్రలో దళితులపై, దళిత స్త్రీలపై అత్యాచార హత్యలు, సజీవదహనాలు జరిగినప్పుడు ఈ మహిళా, విద్యార్థి, ప్రజాసంఘాలూ వామపక్ష రాజకీయా పార్టీలూ, అభ్యుదయవాదులుగా తమకుతాము చెప్పుకుంటున్న అగ్రకులస్తులూ ఏనాడూ దళితుల పక్షాన నిలబడి పోరాడలేదు. పైగా చుండూరులో దళితులకు తగిన శాస్తి జరిగిందని తృప్తిపడ్డారు.

## చుండూరులో చట్టం తనపని తాను చేసిందా?

చుండూరు మారణహోమం జరగక సంవత్సరం ముందునుండి దళితులపై రెడ్లు అనేకసార్లు దాడిచేశారు. 'చండాలుడంటే మాలవాడు' అని విద్యార్థులకు చెప్పిన టీచర్‌ను వివరణ అడగడానికి ఊర్లోని స్కూలు దగ్గరకు వెళ్లిన అంబేద్కర్ యువజన సంఘం సభ్యులపై రెడ్లు దాడి చేసి కొట్టారు. దళితుల కంటే ముందు వాహనాల పై వెళ్లి పోలీస్ స్టేషన్‌లో కేసుపెట్టారు. క్రికెట్ ఆటదగ్గర విద్యార్థుల మధ్య జరిగిన గొడవలో రెడ్లు, నాయుడ్లు జోక్యం చేసుకొని దళిత విద్యార్థుల్ని స్థంభానికి కట్టేసి కొట్టారు. చింతామణి నాటకం చూడటానికి ఊర్లోని రామాలయం దగ్గరకు వెళ్లి అగ్రకులాలతో కలిసి కూర్చున్నందుకు దళితులపై కత్తులతో దాడిచేసి పల్లెవరకు తరిమికొట్టారు. ఆగస్టు 6కి ముందు మూడు నెలల నుండి దళితులు సాంఘిక బహిష్కరణ అనుభవించారు. దాడి జరిగిన రోజు కూడా గ్రామంలో సాంఘిక బహిష్కరణ అమలులో ఉంది. ఈ అన్ని సందర్భాలలో పోలీసులు అగ్రకులాల పక్షమే వహించారు. 1991 ఆగస్టు 6న ముందుగా పోలీసులు దళితవాడ మీదపడి మగవాళ్లను పొలాల్లోకి తరిమారు. హంతకులను అరెస్టు చేయాలని ఉద్యమం నడుపుతున్న అనిల్‌కుమార్‌ను కాల్చి చంపారు. దళితులపై, దళిత సభ నాయకులపై (కొరివి వినయ్‌కుమార్, మేడికొండ సుబ్బారావు, తలాకుమారి షిమ్నిబాబు, మరో పత్రికా విలేకరి) 307 కేసు పెట్టారు. చుండూరు బాధితులకు ఎవ్వరూ సహాయం చేయలేని విధంగా పోలీసులు చుండూరులో నిషేధాజ్ఞలు జారీచేశారు. మరోవైపు సర్వజనాభ్యుదయ సమితి సభలకు రక్షణ కల్పించారు. ఇప్పటికీ-

ఎ119 కొండమాదుగుల వెంకటప్పరెడ్డి, తండ్రి వెంకటరెడ్డి (మోదుకూరు)
ఎ146 కె. రామకృష్ణారెడ్డి, తండ్రి వెంకయ్య (మున్నంగివారి పాలెం)
ఎ169 గొర్రెపాటి క్రిష్టారెడ్డి, తండ్రి రామిరెడ్డి (మున్నంగివారి పాలెం)
ఎ151 ఇక్కుర్తివెంకటేశ్వర్లు, తండ్రి సుబ్బారావు (మున్నంగివారి పాలెం)
ఎ70 మోదుగుల కోటిరెడ్డి, తండ్రి సాంబిరెడ్డి (చుండూరు)
ఎ76 కొసనా వెంకయ్య, తండ్రి ఏడుకొండలు (చుండూరు)
ఎ84 గొర్రెపాటి అప్పిరెడ్డి, తండ్రి రామిరెడ్డి (చుండూరు)
ఎ188 బొంతా పాపిరెడ్డి, తండ్రి కోటిరెడ్డి (మున్నంగివారి పాలెం)

అనువారిపై నాన్ బెయిలబుల్ అరెస్ట్ వారెంట్లున్నాయి. ఇవి ఎందుకు పెండింగ్‌లో ఉన్నాయో పోలీసులు స్పష్టమైన కారణం చెప్పలేదు. వీళ్లు అరెస్టు కానందున రెండు సంవత్సరాలు కేసు వాయిదా పడింది. 1995లో 'గుంటూరులో విచారణ ప్రారంభమయిందని ఆ విచారణకు మీరు హాజరై సాక్ష్యం చెప్పాలని, లేదంటే అరెస్ట్ చేసి తీసుకెళతామని' పోలీసులు చుండూరు దళితులను బెదిరించారు. అయినా చుండూరు దళితులు సమన్లు తీసుకోలేదు. చుండూరులోనే విచారణ జరగాలని పట్టుబట్టి సాధించుకున్నారు. దళితులు కోరుకున్న పబ్లిక్ ప్రాసిక్యూటర్ల

నియామకాన్ని రద్దు చేయించడానికి పోలీసులు రెండు సంవత్సరాలపాటు విఫలయత్నం చేశారు.

చుండూరులో చట్టం తనపని తాను చేస్తే దళితులపై హత్యాకాండ జరిగేది కాదు. హత్యలు జరిగిన తర్వాతైనా నిష్పక్షపాతంగా వ్యవహరించివుంటే ముద్దాయిలందరికీ శిక్షలు పడేవి. సత్వర న్యాయ విచారణ ఒక ప్రాథమిక హక్కు, సమాన న్యాయం రాజ్యాంగ బాధ్యత. వీటన్నింటికీ దూరం చేసి దళితుల ప్రాథమిక హక్కులను రాజ్యం తుంగలో తొక్కింది.

## కోర్టుల ఉదాసీనత

చుండూరు దళితులపై దమనకాండ జరిగినప్పుడు రాష్ట్రంలో కాంగ్రెస్ అధికారంలో ఉంది. తర్వాత తెలుగుదేశం, మళ్లీ కాంగ్రెస్ అధికారం చేపట్టింది. ఈ అగ్రకులాధిపత్య శక్తుల, పోలీసుల పక్షపాత వైఖరితో పాటు కోర్టుల ఉదాసీనత కూడా 16 సంవత్సరాలుగా కోర్టు విచారణ కొనసాగడానికి కారణమయ్యింది.

8 మంది అరెస్టు కాని ముద్దాయిలను కేసు నుండి వేరుచేసి 1993లో ప్రత్యేక కోర్టు విచారణ ప్రారంభించింది. బాధితులు హిందువులు కాదని, క్రైస్తవులని కావున ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం వర్తించదని ముద్దాయిలు ప్రత్యేక న్యాయస్థానంలో వాదన లేవనెత్తారు. ప్రత్యేక న్యాయ స్థానం అందుకు అంగీకరించక పోవడంతో హైకోర్టు కెళ్లారు. హైకోర్టు ఈ కేసును మళ్లీ ప్రత్యేక కోర్టుకి పంపింది. ముద్దాయిలకు కావలసిందీ అదే. ఏదో విధంగా వాయిదాలు వేయిస్తూ కాలయాపన చేస్తే కాలం గడిచే కొద్దీ బాధితులతో మంచిగా మెదిలి శిక్షనుండి తప్పించుకోవచ్చని ముద్దాయిల ఆలోచన. చుండూరులో విచారణ జరిగితే తమకు దళితుల ద్వారా ప్రాణహాని జరిగే ప్రమాద ముందని, కావున గుంటూరులోనే విచారణ జరిపించాలని హైకోర్టు దాకా వెళ్లారు. బాధితులు కోరుకున్న ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్లను నియమించడానికి ఐదు సంవత్సరాలు పట్టింది. ఆ ఉత్తర్వులు అమలయ్యే సరికి మరో మూడు సంవత్సరాలు పట్టింది. మళ్లీ కోర్టు విచారణ ప్రారంభమయ్యే దశలో మానవహక్కుల నాయకులైన న్యాయవాదులను ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్లుగా నియమించడాన్ని సవాలు చేస్తూ ముద్దాయిలు హైకోర్టు వెళ్లి 'స్టే' తెచ్చి విచారణ ఆపేయించారు. ఎట్టకేలకు 2004 డిసెంబర్ 1న చుండూరులోని ప్రత్యేక కోర్టులో విచారణ ప్రారంభమయ్యింది. అప్పుడు కూడా వరికోతలని, నాట్లని ప్రతి సీజన్‌కీ సెలవులడిగి విచారణ కాలాన్ని సాగదీశారు.

ఈ కేసును నలుగురు న్యాయమూర్తులు విచారణ చేశారు. నాలుగవ న్యాయమూర్తి అనీస్ గారు తుదితీర్పు ప్రకటించారు. అయితే 2005లోనే తుదితీర్పు వెలువడాల్సి ఉండె. 2005 జూలైలో ప్రత్యేక న్యాయమూర్తి బసవయ్య బదిలీ అయి ఆ స్థానంలో డి. ప్రభాకరరావు నియమితులయ్యారు. ఆయన చుండూరు రాకముందే నిందితులు నిరసన తెల్పుతూ హైకోర్టుకు ఉత్తరం రాశారు. జడ్జి దళితుడైనందువల్ల ఎక్కువ మందికి శిక్షలు వేస్తాడని అందువల్ల ఆయన నియామకాన్ని రద్దు చేయాలని, పాత న్యాయమూర్తినే కొనసాగించాలని ఆ లేఖలో పేర్కొన్నారు. డి. ప్రభాకరరావు విచారణ ప్రారంభించి 22 మంది పోలీసుల్నీ, డాక్టర్లనూ విచారించారు. దాదాపు సాక్ష్యాలు పూర్తయ్యే దశలో ముద్దాయిలు 'ఈకేసు మీరు విచారించిన యెడల ఏ విధంగానూ న్యాయపరమైన తీర్పు వస్తుందని మాకు నమ్మకంలేదు. కావున అన్యథాభావించక మీ అధికారమును మాపై చూపక వేరే జడ్జి ద్వారా విచారణ జరిపించగలందులకు తగు చర్యలు తీసుకోవలసినదిగా ప్రార్థించుచున్నాము' అని రాసి ఆ నిందా పత్రాన్ని న్యాయమూర్తికి ఇవ్వడమే కాకుండా హైకోర్టుకు కూడా పంపారు. జన్మతః కులాన్నిబట్టి గుణాన్ని నిర్ణయించే మనువాదపు విషపుత్రులు చాలా నిస్సిగ్గుగా, నిర్భయంగా హైకోర్టుకి రాతపూర్వక విన్నపం చేశారు. కొద్ది కాలంలోనే న్యాయమూర్తి ప్రభాకరరావు బదిలీపై వెళ్లారు. అన్యాయమైన తీర్పు వెలువడిందని విమర్శించే వారిని సహితం కోర్టు ధిక్కారం నేరం కింద శిక్షిస్తారు. అలాంటిది అగ్రకుల మనువాదుల విపరీత ధోరణికి హైకోర్టు కనీసం స్పందించలేదు. దళితుడనే చులకన భావంతోనే న్యాయమూర్తిని అగ్రకుల ముద్దాయిలు అవమానించారు. హైకోర్టు కూడా అందుకే వాళ్లను ఉపేక్షించింది.

ముద్దాయిలు అనుకున్నట్లుగా కోర్టులు కూడా ప్రతి విషయానికి 'స్టే'లు ఇచ్చినట్లుగానే ముద్దాయిల కోరిక మేరకే న్యాయమూర్తిని హైకోర్టు బదిలీ చేసిందనుకొనే అవకాశాన్ని హైకోర్టు కల్పించింది.

చుండూరు తీర్పు పట్ల స్పందిస్తూ అనేకమంది రకరకాల అభిప్రాయాలను వ్యక్తపరిచారు. కానీ అగ్రకుల జడ్జి ఇచ్చిన తీర్పువల్ల దళితులకు న్యాయం జరిగింది అని సమాజం అనుకోవడానికి కూడా హైకోర్టు వైఖరి కారణంకాదా?

## సామాజిక దృష్టి లోపించిన కోర్టుతీర్పు

ప్రత్యేక కోర్టు ఇచ్చిన తీర్పులో ఇది అత్యంత అరుదైన కేసుల్లో అరుదైన కేసు కాదని న్యాయమూర్తి స్పష్టం చేశారు. మూడు గ్రామాలకు సంబంధించిన రెడ్లు, నాయుడ్లు ఒకచోట చేరి పథకం ప్రకారం పోలీసుల సహకారంతో ట్రాక్టర్లలో మారణాయుధాలు చేతబూని దళితులను పొలాల వెంట పరుగులు తీయించి విచక్షణారహితంగా నరికి చంపి మాగాటి కయల్లో తొక్కి, గుడ్డపీకి, గోనెసంచుల్లో కట్టి కాలువల్లో వేయడం అరుదైన కేసుగా కోర్టుకు కనపడలేదు. ఒక జాతిని మరోజాతి పకడ్బందీగా పథకం ప్రకారం దాడిచేసి చంపడం అత్యంత అరుదైన కేసుగా కోర్టు గుర్తించలేకపోయింది. మరైతే అగ్రకులాలు దళితులను చంపడం సర్వసాధారణమని కోర్టులు భావిస్తున్నాయని దళితులు అనుకోవాలా? బలవంతుడు బలహీనుడ్ని చంపడం, పులి మేకను చంపడం సాధారణ విషయమేనా. అదే బలహీనుడు బలవంతుడ్ని చంపితే, పులి మేకను చంపితే, దళితుడు అగ్రకులస్తుడ్ని చంపితే అరుదైన విషయమా? అందుకే మనోహర్‌కి క్రిష్ణా జిల్లా కోర్టు ఉరిశిక్ష వేసిందని అనుకోవాలా?

చుండూరు హంతకులు ముమ్మాటికీ ఉరిశిక్ష వేయగల అర్హత కల్గిన వ్యక్తులు. వారికి ఉరిశిక్ష వేయలేదంటే అంతకు మించి క్రూరమైన నేరం చేసిన వాళ్లు ఈ దేశంలో ఉండరేమో. కేవలం బలహీనులకు, ముస్లిం మైనారిటీలకు, దళిత బహుజనులకు, రాజకీయ పలుకుబడి లేనివాళ్లకు మాత్రమే ఉరిశిక్ష అమలు జరిపేటట్లయితే ఆ ఉరిశిక్షను భారత శిక్షాస్మృతి నుండి తప్పించవలసినదిగా డిమాండ్ చేయాల్సి ఉంది.

**చైతన్యంతో నిలబడడం, అడ్డంకుల్ని అధిగమించడం, సమాజ పరిణామ క్రమంలో జరిగేదేనని ప్రగతిశీల శక్తులు ఆ పని ముందుండి చేస్తాయని అంటున్నారు మల్లెపల్లి లక్ష్మయ్య**

# భావప్రకటనా స్వేచ్ఛ - తస్లీమా పై దాడి



సమాజ పరిణామ క్రమంలో వస్తున్న మార్పులను అడ్డుకోవాలని చేసిన ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు. అంతేకాకుండా, అడ్డంకులు మరింత మందిని ఆలోచింప జేయడమే కాకుండా, ఆ మార్పుల కోసం అంకితభావంతో పనిచేసే శక్తులను ఒక దగ్గరికి సమీకరింప జేస్తుంది. 'మనిషియైనా, ఒక సమాజమైనా మార్పులకు లోను కాకుండా ఆ దేశం పురోగతి అసాధ్యమవుతుంది'. అందుకే ప్రగతిశీల శక్తులు నిరంతరంగా మార్పుకోసం ప్రయత్నిస్తుంటాయి. ఇటీవల హైదరాబాదులో జరిగిన ఒక పుస్తక ఆవిష్కరణ కార్యక్రమానికి హాజరైన ప్రముఖ బంగ్లాదేశ్ రచయిత్రి తస్లీమా నస్రీన్ పై జరిగిన దాడి, ఆ తదనంతర పరిణామాలు ఈ పెనుగులాటలో భాగంగానే చూడాలి.

ఆ రోజు (ఆగస్ట్ 9) హైదరాబాద్ ప్రెస్‌క్లబ్ కార్యవర్గ సమావేశం ఉండడం వల్ల తస్లీమాకు ఒక మేరకు కొంత రక్షణ దొరికింది. ఈ విషయాలన్నీ ఇప్పటికే సర్వత్రా చర్చ జరిగినందున దాని గురించి ఇక్కడ మళ్లీ ప్రస్తావించి సమయం, స్థలం వృథా చేయదలచుకోలేదు. అయితే తస్లీమా పైన జరిగిన దాడిని విడిగా చూస్తే అర్థం కాదు. మతపెద్దలు, ఆ విశ్వాసాలను నమ్ముతున్న రాజకీయ నాయకులు, ఇతర సంస్థలు ఇప్పటికే ఆమెను మానసికంగా బాగా వేధించాయి. ఆమె జీవితం ఎక్కువభాగం వేదనాభరితంగానే సాగింది.

1962లో ఇప్పటి బంగ్లాదేశ్‌లోని మైమెన్‌సిగ్ అనే ఒక చిన్న పట్టణంలో జన్మించిన తస్లీమా నస్రీన్ 1984లో ఎం.బి.బి.ఎస్. పట్టా పుచ్చుకున్నది. 1980 వరకే ఆమె సాహిత్యరంగంలో గుర్తింపు కలిగిన రచయిత్రిగా ఎదిగింది. 1989 నుంచే వివిధ పత్రికల్లో వ్యాసాలు, కథలు రాయడం మొదలుపెట్టింది. ఈమె రాస్తున్న విషయాలపైన 1992 నుంచే దాడులు మొదలయ్యాయి. 1993లో ప్రచురితమైన 'లజ్జా' అనే నవలతో

---

భారత శిక్షాస్మృతి 149 ప్రకారం హత్యాకాండలో పాల్గొన్నట్లు నిరూపితమైన అక్రమ సమూహమంతా శిక్షార్హులే. ప్రత్యక్షంగా హత్యచేసిన వారేకాదు పక్కనుండి హత్యను ప్రోత్సహించిన వాళ్లు కూడా నేరస్తులే. కానీ ముద్దాయిలలో 123 మంది నిర్దోషులుగా విడుదలయ్యారు. 35 మందికి కేవలం ఒక సంవత్సరం మాత్రమే కోర్టు శిక్ష విధించింది. అనేక అడ్డంకులనధిగమించి, ఉబ్బి పురుగులు పట్టిన ఆప్తుల శవాలను గుర్తు తెచ్చుకొని కోర్టులో సాక్ష్యం చెప్పి న్యాయం కోసం 16 సంవత్సరాలుగా నిరీక్షించిన చుండూరు దళితులకు ఈ తీర్పు కొంత అసంతృప్తి మిగిల్చింది. వీటన్నిటిని పరిగణనలోకి తీసుకొని హైకోర్టులో అప్పీల్ చేయవలసినదిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాలి. అందుకు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌లు (చంద్రశేఖర్, శివనాగేశ్వరరావు) దళిత బహుజన ఉద్యమశక్తులు, ప్రజాస్వామికవాదులు చుండూరు దళితులకు అండగా నిలవాల్సిన అవసరముంది.

## చివరిగా

ఈ హత్యాకాండలో పాల్గొన్న రెడ్లు, నాయుడ్లనే ముద్దాయిలుగా సమాజం, కోర్టు గుర్తించింది. నరమేధంపై జరిగిన పథకంలో భాగంగా దళితులను ఇళ్ల నుండి తరిమేసిన పోలీసులు, అనిల్‌కుమార్‌ను కాల్చి చంపిన పోలీసులు అందుకు అనుమతి ఇచ్చిన పోలీసు అధికారి సమాజం, కోర్టు దృష్టిలో కనీసం నిందితులుగా కూడా లేరు. ప్రత్యేక కోర్టులో సాక్ష్యం చెప్పిన ప్రతి దళితుడూ పోలీసుల పాత్ర గురించి స్పష్టంగా నొక్కి చెప్పారు. అయినప్పటికీ చుండూరు కోర్టు తీర్పులో పోలీసులకు సంబంధించిన ప్రస్తావనేలేదు. ఈ ప్రజాస్వామ్య దేశంలో ఖాకీలు చేసిన ఖూనీలకు, కుట్రలకు సమాజం నుండి స్పందన కరువైంది. శాంతి భద్రతల ముసుగులో ఉద్యమకారులను కాల్చిచంపుతున్నారు. గొడ్డళ్లతో, కత్తులతో సామాన్య మానవులు నరికి చంపితేనే హత్యలుగా సమాజం చూస్తుంది. మరి పోలీసు తూటా చేసిన హత్య?

చుండూరు హత్యాకాండలో పోలీసులను కుట్రదారులుగా గుర్తించకపోవడం, హత్యానేరం కింద కేసు పెట్టకపోవడం దారుణం. చుండూరులో ముద్దాయిలు ఎంతమంది? కుట్రదారులు ఎంతమంది? అనేదైనా ప్రజలకు అర్థం కావాలి. పోలీసులపై 302 కేసు రిజిస్టర్ చేయాలనేది చుండూరు దళితుల డిమాండ్లలో ఒకటి. అది ఏమయ్యిందో ఎవ్వరికీ తెలియక పోయినా చట్టం తన పని తాను చేస్తుందని అనుకోవాల్సిన అనివార్య పరిస్థితిలో డిగ్రీ చదివిన బిడ్డను కోల్పోయిన (అనిల్ కుమార్) ముసలి తల్లిదండ్రులు కనీసం నష్టపరిహారమైనా ఇవ్వండని ఇంకా కోర్టు చుట్టూ తిరుగుతున్నారు. ◆

**'నా మీద దాడిచేసిన వారు ప్రజా అభిమతానికి ప్రాతినిధ్యం వహించరు. ఎన్ని ఆటుపోట్లు ఎదుర్కొన్నా నా పంథా మారదు. నేను నమ్మినదాన్ని నేను రాస్తూనే ఉంటాను. నా రచనల ద్వారా జాగృతిని కలిగిస్తూనే ఉంటాను' తస్లీమా నస్రీన్**

ఆమె కష్టాలు తీవ్రమయ్యాయి. ఆమె తలకు వెలకు నిర్ణయిస్తూ బంగ్లాదేశ్ ముస్లిం మతపెద్దలు 'ఫత్వా' విడుదల చేశారు. ఆ పెద్దల ఒత్తిడి మేరకు 'లజ్జా' నవలను బంగ్లాదేశ్ ప్రభుత్వం నిషేధించింది. ఆమెను చంపినవారికి 1250 అమెరికన్ డాలర్ల బహుమానం మత పెద్దలు ప్రకటించారు. 1994లో అంతర్జాతీయ మహిళా రచయితల కమిటీ (పెన్) సహకారంతో దేశంను విడిచి స్వీడన్‌లోని స్టాక్‌హోంలో ఆశ్రయంపొందింది. 1999లో తల్లిని పోగొట్టుకొని తీవ్ర మానసిక వేదనకు గురైంది. అంతకు ముందు 1998 ఢాకా హైకోర్టులో తనకు తానుగా లొంగిపోయింది. ఆమె తల్లి మరణం సమయంలో అక్కడ ఉన్నప్పటికీ, ఎంతో జాగ్రత్తగా తలదాచుకోవాల్సి వచ్చింది. తర్వాత స్వీడన్ వెళ్లిపోయింది. ఆ తర్వాత ఆమె భారతదేశంలో ఉండాలని చేసిన విజ్ఞప్తిని భారతదేశం మన్నించింది. కలకత్తాలో ప్రస్తుతం ఒక ప్రవాసీలా బతుకుతోంది. 1993 నుంచి ఇప్పటివరకు ఆమె ఎన్నో భయానకమైన అనుభవాలను చవిచూసింది. అయితే ఎక్కడా ఆమె రాయడం ఆపలేదు. నిజాలను మాట్లాడడం ఆపలేదు.



తస్లీమా నస్రీన్‌పై ఎంఐఎం ఎమ్మెల్యేలు దాడి చేస్తుండగా అడ్డుకుంటున్న ఇన్నయ్య, తదితరులు

'బెంగాల్ మహిళల గొంతులు ఒకటయ్యాయి' అనే వ్యాసం 1995లో రాసింది. ఇది బంగ్లాదేశ్ మహిళలు ముఖ్యంగా ముస్లింలలో ఒక చైతన్యాన్ని రగిలించింది. నిషేధానికి గురైన 'లజ్జా' నవల ముస్లిం మతాన్ని దూషించడానికి రాసింది కాదు. 1992లో భారతదేశంలోని అయోధ్యలో హిందూ మతోన్మాదులు కూల్చిన బాబ్రీ మసీదు సంఘటన అనంతరం బంగ్లాదేశ్‌లో అక్కడి హిందువులపై జరిగిన అమానుష దాడులకు ఈ నవల అక్షరరూపం ఇచ్చింది. ఆ విధంగా ఒక మానవతావాదిగా తస్లీమా తన గొంతును విప్పింది. అంతేకానీ ముస్లిం మతాన్ని ద్వేషించినట్టుగా అందులో లేదు.

ఆ నవలకు ఆమె ఉపోద్ఘాతం రాస్తూ "ఎంతో సుందరమైన బంగ్లాదేశ్‌లో సాటి మానవులుగా బతుకుతున్న హిందువులను వెంటాడి, వేటాడి చంపారు. ఇది చాలా అమానుషం. దీనికి మనమంతా సిగ్గుతో తలవంచుకోవాలి' అని తన ఉద్దేశ్యాన్ని స్పష్టం చేసింది. ఈ విషయానికే అంతటి ఘోరమైన శిక్షను విధించడం దారుణం. అంతేకాకుండా, ఆమెను వెంటాడి, వేటాడి చంపడానికి చేస్తున్న ప్రయత్నం కూడా అమానవీయం. చారిత్రాత్మకమైన హైదరాబాద్ నగరం దీనికి వేదిక కావడం హైదరాబాదీలందరూ తలదించుకోవాల్సిన పరిస్థితిని తెచ్చింది. మహిళలు ముస్లిం మతం ప్రకారం స్వేచ్ఛగా ఉండకూడదనీ, అన్నీ రకాల ఆంక్షలు పెడుతున్నారు. కానీ అవేవి సత్ఫలితాలను ఇవ్వడం లేదు. పైగా తస్లీమా లాంటి ఎంతోమంది ముస్లిం మహిళలు ప్రపంచ వ్యాప్తంగా, భారతదేశంలో కూడా చైతన్య పూరితమైన తిరుగుబాటు చేస్తున్నారు.

ముంబాయిలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇస్లామిక్ స్టడీస్ ఇటీవల ముస్లిం మహిళల అనుభవాలతో ఒక న్యూస్ లెటర్‌ను తీసుకొస్తున్నది. మిస్ ఖుతుబ్ జెహాన్ కిద్వాయ్, మిస్ శిరిన్ హుదాలు దీనికి సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. జూలై 29న వెలువడిన ఈ న్యూస్ లెటర్ చాలామంది ముస్లిం మహిళల చైతన్యాన్ని పొందుపరిచింది.

ఆరోగ్య పరిరక్షణ నుంచి చదువు, సంసారం, పెళ్లి లాంటి విషయాల్లో వాళ్లు చూపిన చొరవను ప్రచురించింది. మత పెద్దలు విడుదల చేసిన 'ఫత్వా'లను బేఖాతరు చేసిన ధైర్యాన్ని మనం ఇందులో చూడవచ్చు.

ఇండోర్‌లో ముస్లిం మహిళల్లో ఉన్న అనారోగ్యాలను పారదోలడానికి డజను మంది ముస్లిం యువతులు ఏకమై ఒక బృందంగా ఏర్పడి మహిళలను చైతన్యం చేశారు. అర్బన్ హెల్త్ రిసోర్స్ సెంటర్ అనే సంస్థ ఈ కార్యక్రమానికి తన అండదండను ఇస్తున్నది.

హేరా అనీస్ అనే విద్యార్థిని ఢిల్లీలో సి.బి.ఎస్.ఇ. పరీక్షల్లో టాపర్‌గా నిలిచిన స్ఫూర్తిని ఈ లెటర్ అందించింది. 23 ఏళ్ల తహిమినా అనే యువతి విడాకుల భరణంగా యాభై లక్షల రూపాయలను భర్త నుంచి పొందింది. తలాక్ అని మూడుసార్లు అంటే విచ్ఛిన్నమయ్యే సంసారానికి యాభై లక్షలు విలువ కట్టింది. ఇది కాశ్మీర్‌లో జరిగింది.

కో-ఎడ్యుకేషన్ నిషిద్ధమంటూ ఢిల్లీలోని ముల్లాలు విడుదల చేసిన ఫత్వాను అందరూ తీవ్రంగా వ్యతిరేకించారు. యాస్మిన్ అనే ముస్లిం యువతి తన మామ చేతుల్లో అత్యాచారానికి గురైన సంఘటన లక్నోలో జరిగింది. యాస్మిన్ దానిపై రాజీలేని పోరాటం చేసింది.

ఇట్లా ఎంతో మంది ముస్లిం యువతులు తమ ఎదుగుదలకు అడ్డంకిగా ఉన్న మత విషయాలను ఎదిరించి నిలబడుతున్నారు. ఈ సంఖ్య రోజురోజుకు పెరుగుతుందే తప్ప తగ్గడంలేదు.

తస్లీమానస్రీన్ లాంటి రచయితల చైతన్యం వృధాపోవడం లేదనడానికి ఇవి కొన్నిమచ్చుతునకలు మాత్రమే. ఇంకా చాలాచోట్ల ఇటువంటి తిరుగుబాట్లు జరుగుతూనే ఉన్నాయి. అయితే ప్రగతిని కాంక్షించే వ్యక్తులు,శక్తులు ఇటువంటి అనుభవాలను విస్తృతంగా ప్రచారంలోకితెచ్చి మార్పుకోసం ప్రయత్నిస్తే మరింత ప్రయోజనం ఉంటుంది. ◆

ఆదివాసుల భూములు ఆదివాసేతరులు ఆక్రమించుకున్న న్యాయం నుంచి వారినీ, వీరినీ దేశేతరులయిన బహుళజాతి కంపెనీలు ఆక్రమించుకునే దశకు మన అరవైఏళ్ల స్వాతంత్ర్యం చేరిందంటున్నారు **వరవరరావు**

# అరవై ఏళ్ల స్వాతంత్ర్యం ఒక మేడిపండు

"స్వాతంత్ర్యం ఒక చాలా సున్నితమైన పువ్వు,
చాలా వాడైన కత్తి, విలువైన వజ్రం"
- *శ్రీశ్రీ*

స్వతంత్రం తనను తాను లేదా తమను తాము నియంత్రించుకునే, నిర్వహించుకునే నడుపుకునే ఒక సమగ్రమైన వ్యవస్థ. ఒక వ్యక్తి మొదలుకొని, యూనిట్, బృందం, సమూహం, జాతి, దేశం, మానవ సమాజం వరకు ఇది వర్తిస్తుంది. విస్తరిస్తూ అన్వయించవచ్చు.

తన, తమ వర్తమాన జీవన విధానాన్ని, శైలిని నిర్వహించుకునే క్రమంలో అది భవిష్యత్తులోకి రూపొందే ఒక దార్శనికత ఉండాలి. అది మామూలు మాటల్లో చెప్పాలంటే నిన్నటి బానిసత్వాన్ని, పరాధీనత్వాన్ని రద్దుచేసి ఇవ్వాటి జీవనశైలి, విధానం స్వతంత్రంగా, స్వావలంబనగా రుజువవుతూ రేపు వికసించి పరిణతి చెందే అవగాహన పై ఆధారపడి రచింపబడాలి, ఆచరింపబడాలి.

అందులో స్వతంత్రానికి శ్రీశ్రీ చెప్పిన సున్నితమైన పువ్వు పోలికను నేను స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, వాడియైన కత్తి, విలువైన వజ్రం పోలికను ప్రజల సార్వభౌమత్వానికి ప్రతీకలుగా భావిస్తున్నాను. ఈ రెండూ అనుభవించగలిగిన వ్యక్తి అయినా, సమాజమైనా మౌలిక హక్కులైన వాక్, సభా, సంఘ, విశ్వాస స్వేచ్ఛలను, కూడు, గూడు, గుడ్డ, గౌరవ ప్రదమైన జీవితమనే అవసర స్వేచ్ఛను పొందగలుగుతారు.

ఈ వెలుగులో మన అరవయ్యేళ్ల 'స్వతంత్రా'న్ని అర్థం చేసుకుందాం.

విశాఖపట్నం జిల్లా మాడుగుల మండలం వాకపల్లి అనే ఆదివాసీ గ్రామంపై తమ గాలింపు చర్యల్లో భాగంగా గ్రేహౌండ్స్ పోలీసులు దాడిచేసి పదకొండు మంది స్త్రీలపై లైంగిక అత్యాచారం చేశారు. ఆగస్ట్ పదిహేను 'వజ్రోత్సవాలు' ఎర్రకోటపై జాతీయ జెండా ఎగరవేసి జరుపుకుంటున్న సమయంలో దక్షిణాన గహనాటవిలో ఈ గాలింపు జరుగుతోంది. మనం వజ్రసంకల్ప సంవత్సరంలో ప్రవేశిస్తూనే - స్వతంత్రం వచ్చిన అర్ధరాత్రి - ఒక వారం తిరగకుండానే ఈ అఘాయిత్యం జరిగింది. అడవి పూలపై దాడి, తమ శరీరాలపై తమకు మాత్రమే హక్కు ఉండే అడవి పూలవంటి ఆదివాసీ స్త్రీలపై లైంగిక దాడి చేసింది వ్యవస్థీకృతమైన రాజ్యహింసా వ్యక్తీకరణ - బూడిదరంగు తోడేళ్లు, మనుషులు కాదు, రక్షకభటులు కాదు. మావోయిస్టుల కోసం గాలించే చట్ట వ్యతిరేక అధికారాన్ని పొందిన హంతకముఠా. స్త్రీలపై లైంగిక అత్యాచారం చేసి ప్రత్యామ్నాయ రాజకీయాలను ధ్వంసం చేయవచ్చునని భావించిన రాజ్యస్వభావం. దీనినొక స్వతంత్ర రాజ్య స్వభావంగా అంగీకరించవచ్చునా?

ఇది ఒక సామూహిక ఉదాహరణ - ఇటువంటిదే 1985 ఆఖర్లో గోదావరి జిల్లా అడవుల్లో ఆదివాసీ స్త్రీలపైననే జరిగింది. యాంటీ నక్సలైటు దళాలు, గ్రేహౌండ్స్ ఏర్పడిన తొలిరోజుల్లో 86 మే లో చింతపల్లి అడవుల్లో నక్సలైటు సానుభూతి పరులైన గుత్తి కోయలు ఉంటున్నారనే కక్షతో ఏడువందల నలభై గుడిసెలు తగులబెట్టారు. గుత్తి కోయలు అనే ఒక తెగయే తెలుగు నేలమీద ఉండకుండా చేయాలని. పదవీ విరమణ చేసిన ఉన్నత న్యాయస్థానాల న్యాయమూర్తులచే ఒక ప్రజాస్వామికమైన బహిరంగ విచారణకు దేశవ్యాప్తమైన హక్కుల ఉద్యమం పూనుకుంటే దానిని బీభత్సం సృష్టించి భగ్నం చేసారు. ('అంకుర్' సినిమాలో ఆ సంఘటనను పోల్చుకోవచ్చు) ఇరవయ్యేళ్లు గడిచే వరకు ఇప్పుడిది జరిగింది. ఇట్లా ఎంత వెనక్కయినా వెళ్లి ఈ స్వతంత్రాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం మనం చేయవచ్చు. ఇప్పటి ఛత్తీస్‌ఘడ్ నుంచి నిన్నటి ఇంద్రవెల్లి నుంచి మొన్నటి శ్రీకాకుళం, నక్సల్బరీల దాకా ఆదివాసీలు అనుభవిస్తున్న 'స్వతంత్రం' విషయంలో కోకొల్లలు ఉదాహరణలు ఇవ్వవచ్చు. సందర్భాల కన్నా దీని స్వభావాన్ని చూద్దాం.

ఆదివాసీల ఉదాహరణ - అందులోనూ స్త్రీ ఉదాహరణే ముందుగా ఎందుకు తీసుకున్నానంటే స్వతంత్ర జీవనస్వేచ్ఛకు, సామూహిక జీవితానికి, స్వంత ఆస్తి భావనలేని దృక్పథానికి, మాతృస్వామ్యానికి ఆమె ప్రతీక గనుక. అటువంటి జీవితం అడవిలో, మాతృస్వామ్యంలో మైదాన ప్రాంతాల్లో అమలయింది గనుక. అటువంటి జీవన విధానంలో ఈస్టిండియా కంపెనీ కాలం నుంచి జోక్యం, పెట్టుబడి ప్రవేశం మొదలై, బ్రిటిషిండియా కాలానికి రాజ్యం దాడిగా, కేంద్రం దాడిగా పరిణమించి విధ్వంసం ప్రారంభించాయి గనుక. సరిగ్గా ఆదివాసీల స్వతంత్ర పోరాటం కూడ అప్పుడే ఆరంభమైంది. మనం జాతీయోద్యమంగా పిలుచుకునే

స్వతంత్ర పోరాటానికి, బ్రిటిష్ ఇండియాకు వ్యతిరేకంగా ఆదివాసీలు చేసిన పోరాటానికి స్వభావంలో ఉన్న తేడా కూడ గమనిస్తే తప్ప స్వేచ్ఛ, సార్వభౌమత్వం అనే భావనలు అర్థం కావు. ఆదివాసీలు ఒక కేంద్ర అధికారం నుంచి, రాజ్యం నుంచి, వ్యక్తిగత ఆస్తి భావన నుంచి, చట్టం జోక్యం నుంచి స్వతంత్రాన్ని, సార్వభౌమత్వాన్ని కాపాడుకోవడానికి పోరాడారు. నిన్నటి మాదుగుల సంఘటన ఆ పోరాటం పై ఒక బీభత్స దాడి. ఒక వ్యక్తి స్వేచ్ఛ ఉదాహరణ చూద్దాం. బల్మూర్ నిరంజన్ అనే ఒక చెంచు యువకుడు తన ప్రతిభతో ఏలూరులోని సెయింట్ జోసెఫ్ కాలేజిలో బిడిఎస్‌లో సీటు పొందాడు. నిజానికి గత సంవత్సరమే అతనికి ఎంబిబిఎస్‌లో ప్రతిభ ఆధారంగా ప్రవేశం లభించింది. అప్పటికే ఆయన బి.ఫార్మసీ చదువుకున్నాడు. ఫార్మసీ కాలేజి ప్రిన్సిపల్ అతని సర్టిఫికెట్లు ఇవ్వకపోవడం వల్ల అప్పుడు ఎంబిబిఎస్‌లో చేరలేకపోయాడు. ఒక ఏడాది చదువుపోగొట్టుకొని ఈ సంవత్సరమైనా ఎంబిబిఎస్‌లో కాకుండా బి.డి.ఎస్.లో చేరాడు. ఈ అరవై ఏళ్ల స్వతంత్రంలో ఈ మాత్రం ఉన్నత చదువుకయినా చేరుకున్న రెండో చెంచు వ్యక్తి నిరంజన్. ఇది కూడా ఓర్వలేని అగ్రకుల విద్యార్థులు అతన్ని కొట్టి చంపారు. ఏలూరు నుంచి హైదరాబాద్ వరకు రెండు నెలలుగా ఆదివాసీ సంఘాలు, ప్రజాస్వామ్య వాదులు చేసింది అరణ్య రోదనే అయింది. అతని శవాన్ని అచ్చంపేట అడవిలోని చెంచు గూడెంలో తల్లిదండ్రులు పూడ్చేశారు. రాజ్యం సత్యాన్ని చంపేసి పూడ్చేసింది.

ఈ సామూహిక, వైయ్యక్తిక అనుభవాలను ఇవ్వాళ దేశవ్యాప్తంగా జరుగుతున్న అభివృద్ధి పేరిట విధ్వంసంగా అర్థం చేసుకుంటే మనం పొందింది, అనుభవిస్తున్నది స్వతంత్రమేనా అని ఎవరికి వారే నిర్ణయించుకోవచ్చు. ఈ అరవై ఏళ్లలో అడవికి, ఆదివాసీలకు సంబంధించి వచ్చిన చట్టాలన్ని బ్రిటిషిండియా చట్టాల కొనసాగింపే. ఒకవైపు ఆదివాసికి అడవిపై హక్కును కాగితంపై ఇచ్చినట్లే కనిపిస్తూ ఆచరణలో హరించే చట్టాలు. రెండు కొండ గుర్తులు అనుకూల ప్రతికూల అంశాలుగా చెప్పాలంటే ఆంధ్రప్రదేశ్‌లో శ్రీకాకుళ రైతాంగ పోరాటం ఇచ్చిన వన్ ఆఫ్ సెవెంటీ నుంచి ఇవ్వాళ మనం ప్రత్యేక ఆర్థిక మండలాల కోసం విశాఖ, విజయనగరం జిల్లాల్లో అడవిని బహుళజాతి కంపెనీలకు కట్టబెట్టడం దాక ప్రయాణం చేసాం. ఆదివాసుల భూములు ఆదివాసేతరులు ఆక్రమించుకున్న న్యాయం నుంచి వారినీ, వీరినీ దేశేతరులయిన బహుళజాతి కంపెనీలు ఆక్రమించుకునే దశకు చేరుకున్నాం. విశాఖలో దుబాయి బాక్సైట్ కంపెనీ కోసం అడవి నుంచి మావోయిస్టులనే కాదు, వాళ్లకు ఆశ్రయమిస్తున్నారనే నెపంతో ఆదివాసీలను కూడ తొలగించడానికే ఈ గ్రేహౌండ్స్ గాలింపుచర్యలు. రేపు విజయనగరం ఎస్. కోటలో జిందాల్ కంపెనీ కోసం ఇదే చేస్తారు. రెండున్నరేళ్లుగా 'సాల్వాజుడుం'ను సృష్టించి ఛత్తీస్‌ఘడ్‌లో పోస్కో టాటా, ఎస్సార్ కంపెనీల కోసం అదే చేస్తున్నారు. అందుకే ఏడువందల యాభై మందిని చంపి, వందలాది మంది స్త్రీలను చెరచి, బలవంతంగా లక్ష మందిని బేస్ క్యాంపుల్లో నిర్బంధించి అడవిని ఖాళీ చేయిస్తున్నారు. కళింగనగర్‌లో టాటా ఉక్కు కంపెనీ కోసం పదకొండు మందిని అందుకే చంపారు. ఇటువంటి ఎన్నో ఉదాహరణల కన్నా మన స్వతంత్రం కన్నా మన సార్వభౌమత్వాన్ని కూడ హరిస్తున్న రెండో అంశంలోకి ప్రవేశిద్దాం.

దేశ సార్వభౌమత్వాన్ని, ప్రజల సార్వభౌమత్వాన్ని (దానినే నేను వాడియైన వజ్రంగా అర్థం చేసుకున్నాను. అది అమలు చేయడానికి ఏ ఆధిపత్య భావజాలానికి, ఆధిపత్య భావజాలానికి సారభూతమైన సామ్రాజ్య వాదానికి తలవంచని, లొంగిపోని దృఢసంకల్పం కావాలి) పణంగా పెడుతున్న రెండు ప్రమాదాలు కూడ ఈ అరవయ్యో సంవత్సరంలోనే అమలులోకి వచ్చాయి. అవి ఒకటి – దేశవ్యాప్తంగా ఐదువందల ప్రత్యేక ఆర్థిక మండలాల రూపకల్పన. ఈ ఐదువందల ప్రత్యేక ఆర్థిక మండలాలు కూడ బహుళజాతి కంపెనీల కోసం, బడా పెట్టుబడిదారుల కోసం లక్షలాది ఎకరాల భూ భాగాన్ని సేకరించి, ప్రజల పన్నుల నుంచి వీళ్లకు అన్ని మౌలిక వనర్లు ఒనగూర్చి – ఆ విశాల భూభాగంలో ప్రభుత్వం ప్రజల సార్వభౌమ అధికారాన్ని సెజ్‌లకు ధారాదత్తం చేస్తుంది.

1950లో ఇండియన్ యూనియన్‌లో ఐదువందల సంస్థానాలు విలీనమయ్యాయి. ఇప్పుడు ఐదు వందల ప్రత్యేక ఆర్థిక మండలాల సర్వతంత్ర స్వతంత్ర సంస్థానాలు ఇండియన్ యూనియన్ నుంచి విడిపోతున్నాయి. వజ్రం చెయిజారడం అట్లా పూర్తవుతుంది. అట్లా పూర్తవుతుంటే కోహినూరు వజ్రాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఎత్తుకుపోయిందని అర్థం చేసుకోవడమంత సులభం కాదు. ప్రజల సార్వభౌమత్వమనే వజ్రాన్నే కోల్పోవడం.

మరొక వంక అణు ఒప్పందం పై అమెరికాతో కుదుర్చుకున్న పొత్తు – ఈ అరవై ఏళ్ల సందర్భంలో ఆర్థిక మండలాల్లో మాత్రమే కాదు దేశవ్యాప్తంగా మనం కోల్పోయే సార్వభౌమత్వానికి చేసుకున్న సంతకం.

సైనిక సంబంధమైన, యుద్ధ సంబంధమయిన, మన వైదేశిక నీతిని నియంత్రించే ఇటువంటి అసమ ఒప్పందాలు మనం సామ్రాజ్యవాద దేశాలతో చేసుకోవడం ఇది మొదటిసారి కూడా కాదు. ఏ బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సుదీర్ఘ కాలం పోరాడామో ఆ బ్రిటిష్ నాయకత్వంలోని కామన్‌వెల్త్‌లో ప్రజాభిప్రాయంతో సంబంధం లేకుండా చేరిపోయాం.

అలీన విధానం పేరుతో సోవియట్ బ్లాక్‌లో కొనసాగుతూ మిశ్రమ ఆర్థిక విధానాన్ని అమలుచేసాం. అంటే పబ్లిక్ రంగాన్ని అంతా సోవియట్ తూర్పు యూరప్ మార్కెటుకు, ప్రైవేటురంగాన్నంతా అమెరికా, యూరపు సామ్రాజ్యవాదులకు ముడిపెట్టాం. 1971 బంగ్లాదేశ్ యుద్ధం ముగియడంతో ఇప్పటి ఈ అణు ఒప్పందాన్ని పోలిన సైనిక ఒడంబడికను రష్యాతో ఇరవయ్యేళ్ల కోసం చేసుకున్నాం. అది ముగిసే నాటికి అటు సోవియట్ రష్యా కుప్పకూలి ఇటు 1991లో నూతన ఆర్థిక విధానం సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మొదలయి – అణు ఒప్పందంతో మన అమెరికా బానిసత్వం అరవయ్యేళ్ల స్వతంత్ర ఫలంగా ప్రజల చేతికి మేడిపండు వలె అందివచ్చింది.

సామాజిక బృందాలుగా చూసినప్పుడు ఆదివాసీల 'స్వతంత్ర' స్థితి చూసాం. దళితుల విషయంలో రాజ్యాంగంలోనే ఆదివాసీలతో పాటు దళితులకు రిజర్వేషన్లు, విద్యా, ఉద్యోగ రంగాల్లో, రాజకీయ ప్రాతినిధ్యం కల్పించినప్పటికీ విద్యా, ఉద్యోగరంగాల్లో అమలుకు ఎన్నడూ నోచుకోలేదు. ఆర్థిక స్వతంత్రం, ప్రాబల్యం లేకపోవడం వల్ల, హిందూ

సమాజంలో ఉన్న అస్పృశ్యత, అగ్రవర్ణ ఆధిపత్య భావజాలం రాజ్యస్వభావంగా కూడ మారడం వల్ల రాజకీయ ప్రాతినిధ్యం సంఖ్యకే పరిమితమయింది తప్ప చూపగలిగిన ప్రభావం ఏమీలేకపోయింది. జాతీయోద్యమంలో, విమోచనోద్యమాల్లో ఒక సాంఘిక విప్లవ కారుడిగా కాలం గడిచిన కొద్దీ గాంధీ కన్నా ప్రభావం పెరుగుతున్న బాబాసాహెబ్ అంబేద్కర్ రాజ్యాంగ రచయిత అయికూడ ఆ రాజ్యాంగం కింద పని చేయడానికి ఏర్పడిన కేంద్ర ప్రభుత్వంలో న్యాయశాఖ మంత్రిగా కూడ కొనసాగలేకపోవడమే స్వతంత్ర భారతంలో సామాజిక న్యాయ వైఫల్యానికి దాఖలా. 'రాజకీయ స్వతంత్రంతోపాటు ఈ రాజ్యాంగం సామాజిక, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఇవ్వలేకపోతే ఈ రాజ్యాంగాన్ని తగులబెట్టడానికి అందరికన్న ముందునేనే ఉంటాను' అన్న అంబేద్కర్ ఆశయాలు ఎన్నిమార్లు ఈ స్వతంత్ర భారతంలో సజీవదహనానికి బలవుతున్నాయో ఊహించుకుంటే ఒళ్లు గగుర్పొడుస్తోంది. పుస్తకాలుగా మనుస్మృతులు తగులపడి పోతున్నాయేమో కాని ఆచరణలో మనుధర్మాన్ని రాజ్యం అమలు చేస్తున్నది. కోటేశు సజీవదహనం నుంచి ఖైర్లాంజీ దాకా మనం ఎన్ని బెల్చీలు, ఆర్వాల్‌లు, కారంచేడులు, చుండూరులు, వేంపెంటలు గడచివచ్చామో లెక్కవేసుకుంటే దళితుల రక్తంతో తడవని క్షణం, స్థలం ఈ స్వతంత్ర భారతంలో ఏమైనా మిగిలాయా అని అనుమానం కలుగుతుంది. ఆత్మగౌరవం కోసమే జీవన్మరణ పోరాటం చేయాల్సి వస్తున్న దళితులు ఈనాటికీ దేశంలో భూమిలేని నిరుపేదలుగా, వ్యవసాయ కూలీలుగా, వెట్టిచాకిరీ చేసే బానిసలుగానే గ్రామీణ భారతంలో జీవించవలసి వస్తోంది.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో ఎనభైఏళ్లకు పైగా దున్నే వారికి భూమి నినాదంతో పోరాటం జరిగి, తెలంగాణ రైతాంగ పోరాటకాలంలో మూడువేల గ్రామాల్లో పదిలక్షల ఎకరాల భూమిని స్వాధీనం చేసుకుని అనుభవించిన భూమిహీనులు - అరవయ్యేళ్ల స్వతంత్ర సందర్భంలో అరవై గజాల ఇళ్ల స్థలం కోసం, కోనేరు రంగారావు కమిషన్ సూచనలు అమలు కావడం కోసం రాష్ట్రమంతటా నాలుగు నెలలుగా లాఠీ దెబ్బలు తినాల్సి వస్తున్నది. ముదిగొండలోనయితే ఏడుగురు ప్రాణాలే వదలాల్సి వచ్చింది. తెభాగ పోరాటం నుంచి తెలంగాణ పోరాటం వరకు ఎన్ని ఉజ్వలమైన పోరాటాలు ఎంత విప్లవాత్మక భూ సంస్కరణల చట్టాలకు కారణమయినా ఇవ్వాళ దేశంలో భూమిహీనులెవరైనా మిగిలారంటే దళితులే. దళితులకు పరిశ్రమలు లేవు. దళితులకు భూములు లేవు. గాంధీజీ హరిజన సేవ మొదలు, ఇందిరాగాంధీ దళిత ప్రేమ వరకు మిగిలించింది మాత్రం దళితులపట్ల వివక్ష, అస్పృశ్యతలే, కన్నీళ్లే, నెత్తురే. వాళ్లు చెమటగా కార్చిన నెత్తురు మాత్రమే కాదు, రాజ్యహింసలో అమరులుగా ఏరులైపారిన నెత్తురు.

ఈ క్రమమంతా దళిత, ఆదివాసీ చైతన్యం పెరిగింది. ఆత్మగౌరవ పోరాటాలు, అస్పృశ్యతా వ్యతిరేక పోరాటాలు, స్వతంత్ర ప్రతిపత్తి, ఉనికికోసం ఆదివాసీల పోరాటాలు పెల్లుబికినవి. అయితే ఇది ప్రత్యామ్నాయ రాజకీయాల వల్ల కలిగిన చైతన్యమేగాని స్వతంత్ర భారత రాజ్యాంగం ఆదేశిక సూత్రాల ద్వారానో [illegible] సంస్కరణల ద్వారానో సమకూరింది మాత్రం కాదు.

ఇంక ముస్లిం మైనారిటీల విషయంలో మన దేశం స్పష్టంగా ఒక హిందూ రాజ్యమైపోయింది. ఇండియా పాకిస్తాన్‌ల విభజనయే [illegible]

మారణకాండలో పారిన నెత్తుర్ల నుంచి జరిగింది. లక్షలాదిమంది హిందూముస్లింలు పరస్పర మారణకాండలో మరణించారు. ముస్లింలే అత్యధికంగా మరణించారు. ఏర్పడిన నాటినుంచి ఈ రాజ్యాంగం కింద ముస్లింలు రెండోస్థాయి పౌరులుగానే అభద్రతాభావంతో జీవిస్తున్నారు. అమెరికా సామ్రాజ్యవాదానికి రెండోప్రపంచ యుద్ధకాలం నుంచీ, ఇజ్రాయల్ ఏర్పడిన నాటినుంచీ, పెట్రోల్ పై ఆధిపత్యం కోసం ఏర్పడిన ఇస్లాం వ్యతిరేకత 1991 ప్రపంచీకరణ తర్వాత ఇక్కడి హిందూ పాలకులకు కలిసి వచ్చిన ఆధిపత్య అంశం అయింది. ప్రపంచీకరణ - నూతన ఆర్థిక విధానం, పి.వి. నరసింహారావు ప్రధాని కావడం, అద్వానీ రథయాత్ర, బాబ్రీమసీదు విధ్వంసం - విడివిడిగా చూడాల్సిన అంశాలు కాదు. ఆనాటి నుంచి ప్రయాణమంతా రథయాత్ర వలెనే సాగింది గనుకనే ఇరవయ్యొకటో శతాబ్దంలోకి ప్రవేశం గుజరాత్‌లో ముస్లింలపై మారణకాండతో జరిగింది. ఇది అఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లపై అమెరికా దాడిలో భాగంగా చూడవలసిన సామ్రాజ్యవాద విధ్వంసమే.

మరొకవైపు దేశ చరిత్రలో మొగల్‌రాజులు కుతుబ్షాహీ, ఆసఫ్‌జాహీ రాజులు వంటి ముస్లిం రాజవంశాలకు చెందిన ముస్లింలు మినహా ఇస్లాం మత విశ్వాసాలను పాటించే ముస్లింలంతా మన దేశంలో దళితులే, బడుగువర్గాలే, సామాజికంగా వెనుకబడిన వర్గాలకు చెందవలసిన రాజ్యాంగ పరమయిన రిజర్వేషన్లు ఎన్నో పార్టీలు ఎన్నికల రాజకీయాల కోసం హామీ పడినా ఈ నాటికీ అమలుకావడం లేదు. రాజేంద్ర సచార్ కమిషన్ బయటపెట్టిన ముస్లింల దీనస్థితి - సముద్రంలో పైకి కనిపిస్తున్న మంచు శిఖరం మాత్రమే. విద్యా, ఉద్యోగ రంగాల్లో, రాజకీయాల్లో రోజురోజుకూ వాళ్ల స్థితి పరాధీన స్థితికి మారిపోతున్నది. బొంబాయి, సూరత్ మొదలు నిన్న మక్కామసీదు పోలీసు కాల్పుల వరకు రాజ్యం ముందు ముస్లింలు ఎంత అభద్రతాభావంతో నిలబడవలసి వస్తున్నదో - దేశంలో ఏ ముస్లిం యువకుడినైనా ఐఎస్ఐ సంబంధాలు లేని భారతీయపౌరునిగా ఈ రాజ్యం గుర్తిస్తున్నదో ఎవరికివారే గుండెల మీద చెయ్యివేసుకొని చెప్పాల్సిన జవాబే. సహజంగా ఇటువంటి రాజ్యవివక్ష, మెజారిటీ మతవివక్ష సమాజ వివక్షగా మారిన స్థితి ముస్లింలలో మతఛాందసాన్ని, మతోన్మాదాన్ని స్వార్థపర నాయకత్వం చేతికి ఆయుధంగా అందిస్తుంటే అటువంటి ఉన్మాదమే తస్లీమా నస్రీన్‌పై ఎంఐఎం చేసిన దాడిగా హైదరాబాద్‌లో చూసాం.

ఒక ప్రజాస్వామిక అత్యున్నత ప్రతీకగా అంబేద్కర్‌ను దళితుల అభ్యున్నతికి కొలమానంగా చూపలేనట్లే, ఒక అధికార కేంద్రంగా చిరకాలంగా కొనసాగిన ఇందిరాగాంధీ మహిళా సాధికార సాధనకు ప్రతీక కాజాలదు. పైగా హిందూ భావజాలం (స్వర్ణ దేవాలయంపై సైనిక చర్య, పంజాబ్‌లో రాజ్యహింస ద్వారా) రాజ్యస్వభావంగా మారి 'హిందకరేగా హిందూరాజ్' అనే నినాదంతో నాలుగువందల ఒక్క లోకసభా స్థానాలను సిక్కు ఊచకోతతో రాజీవ్‌గాంధీ సాధించుకోవడానికి మార్గం సుగమం చేసిన 'ఎమర్జెన్సీ' నియంతగా ఆమె దేశ చరిత్రలో నిలిచిపోతుంది. బంగ్లాదేశ్ యుద్ధంతో ఆమె అపరకాళికగా వాజపేయి, ఎ.కె. గోపాలన్ ప్రశంసలు పొందితే - శ్రీలంకకు 'శాంతిసైన్యాన్ని' పంపించి రాజీవ్‌గాంధీ ఆ వారసత్వాన్ని కొనసాగించాడు.

ఇందిరాగాంధీ కాంగ్రెస్ అధ్యక్షురాలయిన నాటి నుంచి ప్రతిభా [illegible] దాకా వ్యక్తులుగా కూడా వాళ్ళ జెండర్ స్పృహకు

ఉదాహరణలు కాలేకపోయారు. కనుక మహిళా సాధికారికత అనేది ఇంకా బిల్లుగానే మిగిలిపోయింది. జెండర్ వివక్ష, స్త్రీలపై అత్యాచారాలు, వరకట్నపు చావులు, గృహహింస, బలవంతపు పెళ్లిళ్లు, అధికారం, రాజ్యం పురుషస్వామ్యపు పర్యాయ భావజాలమై స్త్రీలను అణచిఉంచే సామాజిక ఆచరణ ఈ స్వతంత్ర భారతంలో ఈనాటికీ అమలవుతున్నదే, గనుకనే ఆకాశంలోనే కాదు ఈ భూమిమీద కూడా సగంకన్న ఎక్కువే ఉన్న స్త్రీలకు ముప్పై శాతం రాజకీయ ప్రాతినిధ్యం కూడ ఈనాటికీ లభించడంలేదు. లభించిన మేరకు రిజర్వేషన్లయినా ముఖ్యంగా రాజకీయాధికారం అమలయ్యే చట్టసభల్లో పురుషఛాయల్లోనే అమలవుతోంది.

అందుకే నక్సల్బరీ రైతాంగ పోరాటం ప్రారంభం కావడం ఒక కవితా న్యాయం వలె జరిగింది. నక్సల్బరీలో ఏడుగురు స్త్రీలు, నలుగురు పిల్లలు పోలీసు కాల్పుల్లో మరణించారు. ఒక ప్రత్యామ్నాయ రాజకీయ రచన మొదలుపెట్టారు. రేపటి చరిత్ర ఆధునిక స్త్రీ రచిస్తుందన్న గురజాడ భవిష్యద్వాణి రుజువయింది. వ్యవసాయ కూలీలుగా, తునికాకు ఏరుతూ బీడీలు చుడుతూ, గనికార్మికుల సహచరులుగా విప్లవోద్యమంలో పాల్గొంటున్న స్త్రీలు ఇవ్వాళ తోడుగా కాదు సమఉజ్జీగా దండకారణ్యం వంటి చోట విప్లవోద్యమానికి నాయకత్వం వహిస్తున్నారు. ఒకవైపు ఎనభయ్యవ దశాబ్దాన్ని ఐక్యరాజ్యసమితి మహిళా దశాబ్దంగా ప్రకటించినందు వల్ల వచ్చిన జెండర్ స్పృహ, మరొకవైపు సుదీర్ఘకాల విప్లవోద్యమ సమస్యలు ముందుకు తెచ్చిన జెండర్ సవాళ్ల వల్ల బహిరంగంగా, లోపల నుంచి పెరిగిన రెండున్నర దశాబ్దాల మహిళా చైతన్యం తెచ్చిన మార్పు తప్ప స్వతంత్ర భారతం అరవయ్యేళ్లుగా స్త్రీల గురించి ఆలోచించిందే లేదు. ఆలోచించిందల్లా ఈ చైతన్యాన్ని అణచడమెట్లా, చల్లార్చడమెట్లా, పక్కదారి పట్టించడమెట్లా, తనలో కలుపుకోవడమెట్లా అన్నదే. ఆధిపత్య భావజాలంతో ఈ చైతన్యాన్ని కలుపుకోవడానికి బలమైన నిదర్శనమే ఇందిరాగాంధీ పాలన. ప్రపంచీకరణ స్త్రీల పాలిట ఒక పిడుగుపాటు వంటిది. నందిగ్రామ్‌లో, కళింగనగర్‌లో, ఛత్తీస్‌ఘడ్‌లో పోరాడుతున్న వాళ్లలో స్త్రీలు అగ్రభాగాన ఉన్నట్లే, ఇవ్వాళ తెలుగు నేలమీద ఇళ్ల స్థలాల పోరాటంలో స్త్రీలు అగ్రభాగాన ఉండి మిలిటెంట్‌గా పోరాడుతున్నట్లే లాఠీచార్జీల్లో, లైంగిక హింసల్లో, పోలీసుకాల్పుల్లో, ఎన్‌కౌంటర్లలో - నిన్నటి దాకా ఉన్న గృహహింసకు, సామాజిక హింసకు తోడుగా రాజ్యహింసకు బలవుతున్నది ఎక్కువగా స్త్రీలే. మరి ఏ సామాజిక వర్గానికి స్వతంత్రం వచ్చినట్లు?

ఒక్క మాటలో చెప్పాలంటే హైదరాబాద్ రాష్ట్రంలో వాడేమాట 'దలాల్' వర్గానికి స్వాతంత్ర్యం వచ్చింది. అది గ్రామంలో ఉన్న పరాన్నభుక్కు అయిన పైరవీకార్ మొదలు కేంద్రంలో ఉన్న సామ్రాజ్యవాద దళారీ వర్గం వరకు ఎవరు మార్కెట్‌లో దలాల్‌గా వ్యవహరిస్తారో వాళ్లు స్వాతంత్ర్య ఫలాలు పొందుతున్నారు.

ఎవరు ఈ దేశం ఒక జాతుల నందనోద్యానంగా పుష్పించి ఫలించి లౌకిక ప్రజాస్వామ్య గణతంత్రంగా వికసించాలనుకుని ప్రాణత్యాగాలు చేసారో, పోరాడారో, పోరాడుతున్నారో వాళ్లకు స్వతంత్రం రాలేదు.

1947 ఆగస్ట్ 15న ఎర్రకోటపై మువ్వన్నెల జెండా ఎగిరేసిన నెహ్రూ ప్రభుత్వం 1948 సెప్టెంబర్ 13న హైదరాబాద్ రాష్ట్రంలోని పోలీసు చర్య పేరుతో సైన్యాన్ని పంపించింది. నాడు నైజాం సర్వ స్వతంత్రంగా ఉంటానన్నాడు, లేదా పాకిస్తాన్‌లో చేరుతానన్నాడు. ఆ నైజాంతోనే 47 నవంబర్‌లోనే భారత ప్రభుత్వం యథాతథ స్థితి ఒప్పందం చేసుకున్నది. కాని రజాకార్ల ఆగడాల సాకుతో కమ్యూనిస్టుల ప్రాబల్యాన్ని అణచడానికి సైనిక చర్యకు పూనుకున్నది. నాలుగు వేల మందిని విప్లవకారులను, సానుభూతిపరులను, ప్రజలను బలిగొన్నది. ఇట్లా ప్రారంభమైన సైనిక చర్యల, సైనిక పాలనలు ఈనాటికీ కాశ్మీర్‌లో, ఈశాన్య రాష్ట్రాల్లో అమలవుతున్నవి, కొనసాగుతున్నవి. కాశ్మీరులో ఇవ్వాళ ప్రతి పదిమంది పౌరులకు ఒక సైనికుడు ఉన్నాడు. సామాజిక వర్గాలకే కాదు, జాతులకు స్వతంత్రం రాలేదు.

ఇంక ప్రత్యామ్నాయ రాజకీయాలు మాట్లాడి ఆచరించే వాళ్ల విషయంలో గదర్ పార్టీ, భగత్‌సింగ్ వంటి వాళ్ల విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం ఏ రాజనీతిని అమలు చేసిందో భారత ప్రభుత్వం రెండుపాళ్లు ఎక్కువే చేస్తున్నది. అవి సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు, నిర్వాసిత విధానానికి వ్యతిరేకంగా సాగుతున్న దేశభక్తియుత ప్రజాస్వామిక పోరాటాలు కావచ్చు, స్వయంప్రతిపత్తి మొదలు విముక్తి కోసం సాగుతున్న జాతుల పోరాటాలు కావచ్చు. సమూలమార్పు కోరుతున్న విప్లవోద్యమం కావచ్చు. అన్నిటికీ అణచివేత, రాజ్యహింసలే జవాబుగా అమలవుతోంది.

సంక్షేమ రాజ్యభావన, జవాబుదారీతనం ప్రపంచబ్యాంకుకే కానీ, ప్రజలకు అవసరం లేని 'పారదర్శకత' గా విలోమక్రియను పొందింది. సిపిఎం కార్యదర్శి ప్రకాశ్‌కారత్ అమెరికాలో భారత రాయబారిని జార్జిబుష్ రాయబారి అన్నాడు గానీ, నిజానికి మనం కేంద్ర ప్రభుత్వంగా భావిస్తున్నది ఢిల్లీలోని సామ్రాజ్యవాద దళారీ ప్రభుత్వమే తప్ప ఈ అరవయ్యేళ్లలో ఏ మాత్రం 'స్వతంత్ర' పాలనగా మిగలలేదు. ◆




ఏమి మారే ఏమీ మారేరా... ఈ పేదల బతుకులు...

'ఈనాడు' సౌజన్యంతో

*రాష్ట్ర ప్రజల ముందున్న ప్రధాన సమస్యలలో ఒక దాన్ని తీసుకుని దానిపై అన్ని వర్గాల అవగాహనలకు వీలైనంత విశాల దృక్పథంతో ఇవ్వాలని, అన్ని అవగాహనలను పరిగణనలోకి తీసుకొని తమ అభిప్రాయం ఏర్పర్చుకునేందుకు పాఠకులకు అవకాశం ఇవ్వాలని వీక్షణంలో ఫోకస్ ప్రారంభించాం. గత మూడు సంవత్సరాలలో అనేక అంశాల మీద అన్ని రకాల భావజాలాలు, దృక్పథాలు, అవగాహనలు ఉన్న రచయితలు ఈ శీర్షికలో భాగం పంచుకున్నారు. ఈ సంచికలో అదే విధంగా 'ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య - పరిష్కారాలు' అనే అంశంపై విభిన్న అవగాహనలను ప్రచురిస్తున్నాం. ఈ అంశంపై విశిష్టమైన అవగాహన ఉన్న ఒక రాజకీయ పక్షాన్ని రచన ఇమ్మని కోరినప్పుడు రెండు వారాల వ్యవధిలో అనేక సార్లు అనేక విధాల అభ్యర్థించిన తరువాత కూడ వారు వీక్షణంతో సంబంధం లేని కారణాలు చెపుతూ కొత్త రచన ఇవ్వడానికి సుముఖత చూపలేదు. అందువల్ల వారి అనుమతితోనే వేరేచోట అచ్చయిన రచనను ప్రచురిస్తున్నాం. వారి దృక్పథాన్ని పాఠకులకు తెలపడంలో కలిగిన అసౌకర్యానికి మన్నించగలరు - సం.*

# కోనేరు రంగారావు కమిటీ సిఫారసులు

## 1. ప్రభుత్వ భూముల యాజమాన్యం

1.1 ప్రభుత్వ భూముల మంజూరు (ఎసైన్‌మెంటు) ప్రతిపాదనలు గ్రామసభ ఆమోదం పొందాలి.

1.2 భూమిలేని పేదవారు అంటే ఎవరో పునర్నిర్వచించాలి. భూమి అసలు లేని వారు లేక ఒక ఎకరా పల్లం (తరి, మాగాణి) లేదా రెండు ఎకరాలు మెట్ట (మెట్టు, కుష్కి) కన్న ఎక్కువ కాకుండా ఉన్న వారిని భూమిలేని పేదవారుగా నిర్వచించాలి.

1.3 ఒక వ్యక్తికి మంజూరు చేసే భూమి ఒక ఎకరా పల్లం (తరి / మాగాణి) లేదా రెండు ఎకరాలు మెట్ట (కుష్కి)కి మించకూడదు. లబ్ధిదారునికి భూమిని మంజూరు చేస్తున్నప్పటికీ వారికి ఉన్న భూమిని కలుపుకొని ఒక ఎకరా పల్లం, లేదా రెండు ఎకరాలు మెట్ట మించరాదు.

1.4 నిబంధనలకు విరుద్ధంగా లేదా అక్రమ పద్ధతులలో డి ఫారం పట్టాను పొందిన వ్యక్తి నుండి భూమిని స్వాధీనం చేసుకోవడంతో పాటు, అతను భూమిని పొందిన నాటి నుండి నేటి వరకు అతను ఆ భూమిపై సంపాదించిన ఆదాయానికి అదనంగా రెండు రెట్లు తిరిగి వసూలు చేయాలి.

1.5 అమలులో ఉన్న నిబంధనలను అనుసరించి మంజూరు చేసేందుకు అందుబాటులో ఉన్న ప్రభుత్వ భూములను దరఖాస్తు చేసుకున్న మూడు నెలల్లోగా అసైన్ చేయాలి.

1.6 రుణాలు చెల్లించకపోవడం వల్ల రుణ సంస్థలు ఎసైన్‌మెంట్ భూములను వేలం వేస్తున్నప్పుడు వాటిని పేదలకు మంజూరు చేయటానికి గాను ప్రభుత్వ సంస్థలు ఆ వేలంలో పాల్గొని భూములను కొనుగోలు చేయాలి.

1.7 మండల కేంద్రానికి రెండు కిలోమీటర్ల పరిధిలో గల అన్ని ప్రభుత్వ భూములను నిషేధ ఉత్తర్వుల పుస్తకం (ప్రొహిబిటేటివ్ ఆర్డర్ పుస్తకం) లో విధిగా నమోదు చేయాలి. జిల్లా కలెక్టర్ వారి నిర్దిష్ట ఆదేశాలతో ఇళ్ల స్థలాలకు మినహా, ఇతరులకు మంజూరు చేయడాన్ని నిషేధించాలి.

1.8 ఎసైన్‌మెంట్ కమిటీని ఏర్పాటు చేస్తున్నప్పుడు ఏ గ్రామంలో అయితే భూములను ఎసైన్ చేస్తున్నారో ఆ గ్రామ సర్పంచి, ఇందిరా క్రాంతిపథంకు చెందిన పేద మహిళలు గ్రామ సంఘం అధ్యక్ష, కార్యదర్శులను కూడా సభ్యులుగా చేర్చే విధంగా మార్పు చేయాలి.

1.9 ప్రతిపాదిత లబ్దిదారులలో అనర్హులు ఉంటే తప్ప, ఎసైన్‌మెంట్ సమీక్ష కమిటీ ప్రతిపాదనలను తిరస్కరించకూడదు.

1.10 ప్రభుత్వ భూములను పరిరక్షించటానికి గాను, అన్ని గ్రామాలలో రెవెన్యూ అధికారులు, సర్వేయర్లు, స్థానిక ప్రజలతో ఒక కమిటీనివేసి క్షుణ్ణంగా క్షేత్రపరిశీలనలు జరిపి జాబితాను రూపొందించాలి.

1.11 ఎసైన్డ్ భూముల అన్యాక్రాంతం జరిగినప్పుడు, 9/77 చట్టాన్ని అమలు పరిచి పట్టాదారుకు భూమిని కచ్చితంగా అప్పగించాలి. ఒకవేళ అది సాధ్యం కాకపోతే ఇతర పేదలకు మంజూరు చేసేందుకు ప్రభుత్వమే స్వాధీనం చేసుకోవాలి. 9/77 చట్టాన్ని ఉల్లంఘించకుండా ఉండేందుకుగాను సంవత్సరానికి ఒకసారి సబ్ రిజిస్ట్రారు కార్యాలయంలోని ఎసైన్‌మెంట్, సీలింగు మిగులు భూములు, ప్రభుత్వ భూముల వివరాలను మండల / డివిజనల్ స్థాయి కార్యాలయపు రికార్డులతో సరిపోల్చి చూడాలి.

1.12 లంక భూములకు సంబంధించి క్షేత్ర సిబ్బందైన రెవెన్యూ ఇన్‌స్పెక్టర్, పంచాయతీ కార్యదర్శులు ఎప్పటికప్పుడు ఆ భూములకు అజమాయిషీ నిర్వహించి సాగు వివరాలను నమోదు చేస్తుండాలి. విస్తీర్ణానికి, వాస్తవ అనుభవ విస్తీర్ణాలకు మధ్య వచ్చే వివాదాల పరిష్కారానికి అనుభవ సర్వే నిర్వహించాలి. ప్రభుత్వానికి బాకీపడ్డ ఎల్ఎల్ఆర్ చెల్లించమని, సొసైటీలను

రెన్యువల్ చేయించుకోవాలని చెప్పాలి. ఒకవేళ ఏదైనా సొసైటీ లీజు (కౌలు) నియమాలను గనుక ఉల్లంఘిస్తే, అటువంటి సొసైటీ రిజిస్ట్రేషన్‌ను రద్దు చేయడమే గాక చట్టపరమైన చర్యలను తీసుకోవాలి.

## 2.. హక్కుల రికార్డు

2.1 సెక్షన్ 22(2) అనుసరించి నోటిఫికేషన్ ఇచ్చిన నాటినుండి సాదా కాగితాలపై రాసుకొని రిజిస్టర్ కాని వ్యవసాయక భూముల విక్రయాల క్రమబద్ధీకరణకు ఫారం నెం X దరఖాస్తు దాఖలు చేసుకోవడానికి మూడు సంవత్సరాలు కాల పరిమితిని పొడిగించాలి. డిసెంబర్ 31, 2000కి ముందు తెల్లకాగితాలపై జరిగిన క్రయవిక్రయాలలో గ్రామీణ ప్రాంతాలకు చెందిన సన్న, చిన్న కారు రైతులకు మేలు చేస్తూనే మండల, జిల్లా, రాష్ట్ర, మున్సిపల్, కార్పొరేషన్లు, అర్బన్ ఎగ్లామిరేషన్స్ పరిధిలోకి వచ్చే వ్యవసాయక భూములను ఈ సౌకర్యం నుండి మినహాయించాలి.

2.2 చాలా సందర్భాలలో సద బాయినామా ద్వారా భూమి స్వాధీనం కలిగిన వున్న యజమానుల పేర్లు కనీసం అనుభవదార్లుగా కూడా రెవెన్యూ రికార్డులలో నమోదు కావడం లేదు. వారి స్వాధీన అనుభవాన్ని నిర్ధారించడానికి రెవెన్యూ రికార్డు గాని లేదా లింకు డాక్యుమెంట్లు గాని లేనప్పుడు చుట్టు పక్కల రైతులు, గ్రామంలోని వయోవృద్ధుల నుండి సాక్ష్యాలను సేకరించాలి.

2.3 విశ్వసనీయమైన హక్కు వున్నదని నిర్ధారించుకున్న తరువాత సన్న, చిన్నకారు రైతులకు ఇండియన్ రిజిస్ట్రేషన్, ఇండియన్ స్టాంపు చట్టాల ద్వారా కట్టవలసిన రిజిస్ట్రేషన్ ఫీజు నుండి మినహాయింపు ఇవ్వాలి.

2.4 చట్టంలోని సెక్షన్ 9 అనుసరించి పునర్విచారణ అధికారం గల ఆర్‌డిఓకు, పట్టాదారు / టైటిల్ పుస్తకాల మంజూరు జరిగిన అక్రమాలపై తనంత తానుగా గాని లేదా ఫిర్యాదు ద్వారాగాని విచారణ చేపట్టే అధికారం కూడా వుండాలి.

2.5 ఆర్‌ఓఆర్ రికార్డులలో మార్పు చేసిన తరువాత మాత్రమే పట్టాదారు (పిపిబి) / టైటిల్ / (టి.డి) పాసు పుస్తకాలు మంజూరు చేయాలి. ఆర్‌ఓఆర్ రికార్డులలో సమాచారం నమోదైన వెంటనే అడంగల్ / పహాణి వంటి గ్రామ రికార్డులలో ఆ సమాచారాన్ని పొందుపర్చాలి.

2.6 ప్రభుత్వ / ఎసైన్‌మెంటు భూముల చట్ట వ్యతిరేకమైన అన్యాక్రాంతం నుండి రక్షించడానికి గాను పిపిబి / టిడి పుస్తకాలలోని రిమార్కుల కాలమ్‌లో ఇది ఎసైన్‌మెంట్ భూమి అన్యాక్రాంతం నిషేధించబడింది అని రాయాలి.

2.7 ఎసైన్‌మెంటు లబ్ధిదారులకు పిపిబి / టిడిలు ఉచితంగా అందచేయాలి.

2.8 పిపిబి / టిడి పుస్తకాలు పోయిన వారికి నకలు (డూప్లికేట్) పుస్తకాలను మంజూరు చేయటానికి గల నిబంధనలను సరళతరం చేయాలి. చిన్న, సన్నకారు రైతులకు 1000 రూపాయలు చెల్లించాలన్న నిబంధన నుండి మినహాయించాలి.

2.9 జిల్లా స్థాయిలో ముద్రించి పిపిబి / టిడి పుస్తకాలకు ప్రత్యేకమైన సీరియల్ నెంబర్లు ఇవ్వాలి. అనధికారిక పుస్తకాలు పంపిణిని అరికట్టేందుకుగాను ఆర్‌డిఓ / ఎమ్మార్వో / గ్రామస్థాయిలో పుస్తకాల మంజూరును నమోదు చేయాలి.

## 3. కౌలు

3.1 కౌలుదార్లు తమ సాగునుండి మంచి ఫలితాలను పొందటానికి గాను సంస్థాగత రుణాలు పొందడానికి రుణఅర్హత కార్డులను మంజూరు చేయాలి. అదే సమయంలో కౌలునమోదైతే తన భూమిని కోల్పోవలసి వస్తుందనే భయాన్ని యజమానులు వదులుకోవాలి.

3.2 భూయజమాని కుటుంబం కలిగి వున్న భూ విస్తీర్ణంతో సంబంధం లేకుండా, తెలంగాణ ప్రాంతంలో రక్షిత కౌలుదార్లుగా గుర్తింపు పొంది భూమిని స్వాధీనం కలిగి వున్న వారందరికి 38-ఇ సర్టిఫికేట్స్ మంజూరు చేయాలి.

## 4. భూ సంస్కరణలు

4.1 అవినీతి, తప్పుడు సమాచారం ఇవ్వడం ద్వారా ప్రాథమిక ట్రిబ్యూనల్ స్థాయిలోని ముగిసిపోయిన కేసులను తిరిగి విచారించేందుకు చట్టపరంగా తగిన ఏర్పాట్లను చేయాలి. ఒకవేళ అప్పీలు, రివిజన్ కేసులో కోర్టులు ఇదివరకే తీర్పులు ఇచ్చివుంటే అటువంటి కేసులను మళ్లీ విచారించమని రివిజన్ పిటిషన్ దాఖలు చేయాలి.

4.2 ఎసైన్‌మెంటు భూములు అన్యాక్రాంత నిషేధ చట్టం-9/77లో ఉన్నట్టుగానే సీలింగ్ మిగులు భూములను మంజూరు చేసేటప్పుడు విధించినషరతులను ఉల్లంఘించిన సందర్భాలలో వాటిని స్వాధీనం చేసుకోవడానికి ఎమ్మార్వోకి అధికారాలు ఇవ్వాలి.

4.3 ప్రభుత్వ బంజరు భూములను అసైన్ చేస్తున్నప్పుడు పాటిస్తున్నట్లు గానే, సీలింగ్ మిగులు భూములను పేదలకు ఉచితంగా పంపిణీ చేయాలి.

4.4 సీలింగ్ మిగులు భూములను పేదలకు మంజూరు చేసే సందర్భంలో అంటే ఒక్క సెంటు కూడా భూమిలేని వారిని పేదవారిగా గుర్తించాలి. ఒకవేళ అటువంటి వ్యక్తి గ్రామంలో లేకపోతే అప్పుడు ఒక ఎకరా పల్లం (తరి / మాగాణి) లేదా 2 ఎకరాలు మెట్ట (కుష్కి) మించని వారిని భూమిలేని పేదవారిగా గుర్తించాలి.

4.5 ఒక వ్యక్తికి సీలింగ్ మిగులు భూమిని మంజూరు చేసేటప్పుడు అతనికి అప్పటికే ఉన్న భూములతో కలుపుకొని ఒక ఎకరా పల్లం, లేదా రెండు ఎకరాల మెట్టకు మించకూడదు.

4.6 రాష్ట్రస్థాయిలో సీలింగ్ కేసుల సత్వర పరిష్కారానికి, ప్రస్తుత న్యాయవాదిగా విధులు నిర్వహిస్తున్న వారితో సిసిఎల్ఏ గాని లేదా ఆయన నియమించిన ప్రత్యేక అధికారి ఎప్పటికప్పుడు కేసుల ప్రగతిని సమీక్షిస్తుండాలి.

4.7 జిల్లా స్థాయిలో జాయింట్ కలెక్టర్, జిపి (గవర్నమెంటు ప్లీడరు) లతో ప్రతి పదిహేను రోజులకు ఒకసారి ఎల్ఆర్ఏటి (ల్యాండ్ రిఫార్మ్స్ అప్పిలేట్ ట్రిబ్యునల్)లో ఉన్న సీలింగ్ కేసుల పరిష్కారమై సమీక్షలు నిర్వహించాలి.

4.8 ప్రస్తుతం ట్రిబ్యునల్ ఆఫీసరైన రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్ కేసులను నిర్దేశిత సమయంలో పరిష్కరించాలి.

4.9 పై కోర్టులు కేసులను పరిష్కరించిన వెంటనే ట్రిబ్యునల్ అధికారి డిక్లరెంట్ నుండి సీలింగ్‌భూముల స్వాధీనానికి చర్యలు చేపట్టాలి.

4.10 అధీకృత అధికారి ప్రభుత్వ ప్రతినిధిగా వ్యవహరిస్తూ, అవసరమని భావించినప్పుడు ప్రభుత్వ న్యాయవాది సహకారం తీసుకొని ట్రిబ్యునల్‌లో సీలింగ్ కేసు వాదించాలి. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ట్రిబ్యునల్‌తీర్పు ఇస్తే, దానిపై ఉన్నత న్యాయ స్థానానికి అప్పీలు చేయాలి.

4.11 సీలింగ్ కేసులలో మిగులు భూములు నిర్ధారిస్తూ ఆదేశాలు ఇచ్చిన వెంటనే లిటిగేషన్ (కోర్టు కేసుల)కు అవకాశం ఇవ్వకుండా, ఆ భూములను ఎమ్మార్వోలు స్వాధీనం చేసుకొని సత్వరమే పేదలకు పంపిణిచేసేలా ట్రిబ్యునల్ అధికారులు చూడాలి.

4.12 సీలింగ్ కేసులలో హైకోర్టు ప్రభుత్వానికి ప్రతికూలంగా తీర్పునిచ్చిన సందర్భాలలో అధీకృత అధికారి సుప్రీంకోర్టులలో స్పెషల్ లీవ్ పిటిషన్ వేయాలి. (ప్రభుత్వ ప్రయోజనాలను రక్షించటానికి)

4.13 సీలింగ్ కేసులు సత్వర పరిష్కారానికి ఒక ప్రత్యేక డివిజన్ బెంచ్‌ని ఏర్పాటు చేయమని రాష్ట్ర ప్రభుత్వం గౌరవ హైకోర్టు వారిని కోరాలి.

4.14 నోటిఫికేషన్ తేది తరువాత ఈ కింది సందర్భాలలో మళ్లీ కొత్తగా డిక్లరేషన్స్ దాఖలు చేయమని వత్తిడి చేయవచ్చు (ఎ) కొత్తగా భూములను పొందినప్పుడు లేదా (బి) పెళ్లి, దత్తత జరిగినప్పుడు (సి) భూ వర్గీకరణలో మార్పు సంభవించినప్పుడు.

4.15 నోటిఫైడ్ తేది తరువాత జరిగే భూ బదిలీలకి సంబంధించి డాక్యుమెంట్ల రిజిస్ట్రేషన్ల సమయంలోకి ఇచ్చే డిక్లరేషన్లను రెవెన్యూ డివిజనల్ అధికారి క్షుణ్ణంగా తనిఖీ చేయాలి.

## 5. నివేశ స్థలాలు

5.1 యాజమాన్యపు హక్కులు రావడానికై చెల్లించవలసిన ధరను పేద వ్యవసాయ కూలీలకు, చేతి వృత్తుల వారికి రద్దు చేయాలి.

5.2 నివేశ స్థలాల చట్టం లాభాలను గురించి పేదలలో విస్తృత ప్రచారాన్ని నిర్వహించాలి.

## 6. భూమి రికార్డులు

6.1 యాజమాన్య హక్కు (టైటిల్ (గ్రాంటీ) హామీ విధానాన్ని అమలుపరచాలి. దానివల్ల యాజమాన్య హక్కుకు రక్షణ, విలువ పెరిగి వివాదాలు తగ్గుతాయి.

6.2 భూమి రికార్డుల యాజమాన్యంలో వస్తున్న సమస్యన్నింటికి ఒకే ఒక పరిష్కారం, ఒక సమీకృత భూ సమాచార వ్యవస్థను ఏర్పాటు చేసి, దాని నిర్వహణ బాధ్యతను 'భూ పరిపాలన' అనే అంకిత భావం గల శాఖకు అప్పగించాలి.

6.3 ప్రస్తుతం వున్న లోపాలను తొలగించుకొని, పరిధిని విస్తృత పరుచుకోవడం ద్వారానే భూమి మీద గల వాస్తవాలను రికార్డులలోని సమాచారం ప్రతిఫలిస్తుంది.

## 7. దేవాలయ భూములు

7.1 ఒక ప్రత్యేకమైన కార్యక్రమం ద్వారా ప్రతి దేవాలయానికి వున్న భూములు వివరాలను సమగ్రంగా నమోదు చేయాలి. దేవాదాయ, రెవెన్యూ శాఖలు సంయుక్తంగా ఈ భూముల పరిశీలన జరపాలి. ఆక్రమణలను వెంటనే తొలగించాలి. ప్రతి ఆరు నెలలకి ఒకసారి భూములను ఆయా సంస్థల వారీగా వాస్తవ స్థితిని పరిశీలిస్తూ ఉండాలి. దేవాలయానికి మిగిలి ఉన్న భూముల నుండి గరిష్ఠ స్థాయిలో లాభం పొందడానికి కావలసిన వ్యాపార ప్రణాళికలను రూపొందించుకోవాలి.

7.2 దేవాదాయ శాఖ యాజమాన్యంలోని అన్ని సంస్థలకు సంబంధించిన వ్యవసాయ భూముల కౌలు జాబితా తయారు చేయాలి. అధిక సంఖ్యలో పేదలు లబ్దిపొందటానికి లీజు/కౌలు కాల వ్యవధిని ఆరు సంవత్సరాల నుండి 3 సంవత్సరాలకి తగ్గించవచ్చు. లీజు/కౌలుకిచ్చే ప్రక్రియ పారదర్శకంగా ఉండాలి. అంతేకాకుండా భూములను ఏదైనా ప్రభుత్వ సంస్థ ద్వారా పేదలు లీజు తీసుకునే విధంగా బహిరంగ వేలం నిర్వహించడం కానీ ముందస్తు ఒప్పందం కానీ చేసుకోవచ్చు.

7.3 పేదలు కాని వారి అధీనంలో చట్ట విరుద్ధంగా దేవాలయ భూములు ఉంటే వారిని భౌతికంగా ఆ భూముల నుండి తొలగించాలి. ఒకవేళ పేదల ఆక్రమణలో ఉంటే వాటిని కొంత మొత్తానికి ప్రభుత్వ సంస్థలకు విక్రయించాలి. అయితే ఎవరు భూమిలేని పేదలో నిర్ధారించే అధికారం దేవాలయ అసిస్టెంట్ కమీషనర్‌కు బదులుగా రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్‌కు ఉండాలి.

7.4 దేవాదాయ శాఖ సిబ్బందికి భూమి సంబంధిత విషయాల మీద విస్తృత శిక్షణ ఇచ్చి వారి పనితీరు మెరుగుపరచడం ద్వారా దేవాలయ భూముల సమర్ధ యాజమాన్యాన్ని సాధించవచ్చు.

## 8. తెలంగాణ ప్రాంతంలో పరిష్కారం కాని ఇనాం భూములు

8.1 ఇనాం రిజిస్టర్లు, భూమి రికార్డుల ఆధారంగా సెటిల్‌మెంట్ చేయని అన్ని ఇనాం భూములను పరిశీలించాలి. ముఖ్యంగా 1-11-1973 నుండి భూమి ఎవరి స్వాధీనంలో వుందో వివరాలు సేకరించాలి.

8.2 రెవెన్యూ, సర్వే సిబ్బందితో ఇనాంభూములపై ప్రత్యేక బృందాలను ఏర్పాటు చేసి గ్రామాలలో విచారణ జరపాలి. ముఖ్యంగా పాతతరం వారు కుటుంబ వంశవృక్షం, ఆ భూములపై జరిగిన లావాదేవీల సమాచారాన్ని అంద చేయగలుగుతారు.

8.3 ఒక్కొక్క ఇనాం భూమి సాగుదారుకు స్థిరపరచవలసిన (సెటిల్‌మెంట్ చేయవలసిన) విస్తీర్ణాలు చాలా చిన్నవి. వీటికి చెల్లించవలసిన ప్రీమియం మొత్తం కూడా తక్కువే. పేదలు ఈ మొత్తాలను చెల్లించగలిగే స్థితిలో ఉండకపోవచ్చు. కాబట్టి ప్రభుత్వం ఈ ప్రీమియంను రద్దుచేసి, మినహాయింపు నివ్వాలి.

8.4 ఇనాం భూముల సాగుదార్లకు స్వాధీన హక్కు సర్టిఫికెట్స్ మంజూరు చేసిన తరువాత నియమ ప్రకారం విచారణ జరిపి, రెవెన్యూ రికార్డులలో అవసరమైన మార్పులు చేసి పిపిబి / టిడి పుస్తకాలు మంజూరు చేయాలి.

## 9. ఆదివాసీ భూ సమస్యలు

9.1 1917 నుండి ఆంధ్ర ప్రాంతంలోనూ, ఫసలి 1356 నుండి తెలంగాణ ప్రాంతంలోనూ ఉన్నఅన్ని ఎల్‌టిఆర్ చట్టాలను వెనుక కాలానికి కూడా (రెట్రోస్పెక్టివ్ ఎఫెక్ట్) వర్తించే విధంగా మార్పు చేయాలి.

9.2 కోర్టులు, ప్రభుత్వం ఇచ్చిన ఆదేశాలను అమలు చేయడానికి నిరాకరించడం, ఎల్‌టిఆర్ అమలులో నిర్లక్ష్యాన్ని ప్రదర్శించే ఉద్యోగులపై సహితం క్రిమినల్ చర్యలు తీసుకునే విధంగా ఆ చట్టంలోని సెక్షన్ 6-ఎ (శిక్ష విధించే) క్లాజును విస్తృత పరచాలి.

9.3 కేసుల విచారణ సందర్భంలో గిరిజనేతరులు ఇచ్చే లిఖిత సాక్ష్యపత్రాల కంటే, గిరిజనుడు ఇచ్చే మౌఖికసాక్ష్యానికే ఎక్కువ విలువ ఇవ్వాలి.

9.4 గిరిజనులభూములు అన్యాక్రాంతం కాకుండా, అన్యాక్రాంతం అయినవాటిని తిరిగిస్వాధీనం చేసుకోవడానికి వీలుగా పిఇఎస్ఎ చట్టంలో గ్రామసభ నిర్వచన్నాన్ని మార్పుచేయాలి. గ్రామంలో గిరిజన సభ్యులందరితో ఏర్పడినదే గ్రామసభగా నిర్వచించాలి.

9.5 గౌరవ హైకోర్టులోను, ఇతర కోర్టులలో ఉన్న కేసుల పరిష్కారానికి ప్రత్యేక చర్యలు చేపట్టాలి. హైకోర్టులో అపరిష్కృతంగా ఉన్న కేసుల పరిష్కారం కోసం ప్రత్యేక ప్రభుత్వ న్యాయవాది / న్యాయవాదులను నియమించాలి. ప్రత్యేక ఖండపీఠాన్ని (బెంచ్) ఏర్పాటు చేయమని గౌరవ హైకోర్టును కోరడంతోబాటు, అవసరమైతే 5వ షెడ్యూల్ ప్రాంతానికి చెందిన జిల్లాలలో కిందికోర్టులు కేసులను స్వీకరించవద్దని, స్టేలు ఇవ్వవద్దని ఆదేశించమని కోరాలి.

9.6 గిరిజనుల ప్రయోజనాలను రక్షించడానికి భూ బదలాయింపు చట్టం (ఎల్‌టిఆర్), సెటిల్‌మెంట్ చట్టాల కింద అప్పీలు చేయటానికి కాల పరిమితిని తొలగించాలి.

9.7 గిరిజనేతరులకు అనుకూలంగా ఇచ్చిన సెటిల్‌మెంట్ కేసులన్నింటినీ పునర్విచారణ జరపాలి. అంతేగాక గిరిజనేతరులకు అనుకూలంగా ఇచ్చిన సెటిల్‌మెంట్ ఆదేశాలపై అప్పీళ్లు వేయాలి. సెటిల్‌మెంట్ చట్టాలను అనుసరించి గిరిజనేతరులకు అనుకూలంగా ఇచ్చిన అన్ని సెటిల్‌మెంట్ ఆదేశాలపై అప్పీళ్లు వేయాలి. సెటిల్‌మెంట్ పట్టా పొందిన వ్యక్తి ఆ గ్రామ నివాసి కాదని తేలినా లేదా నివాసేతర భూస్వామిగా నిర్ధారణ అయినా ఆ పట్టాను రద్దు చేయాలి. రైత్వారీ సెటిల్‌మెంట్ రెగ్యులేషన్లలో అవసరమైన మార్పులను తీసుకురావాలి.

9.8 గిరిజనేతరులు పట్టా హక్కులు పొందేందుకు చట్ట ప్రకారం కీలకమైన తేదికి ముందే, అంటే ఎల్‌టిఆర్ అమలులోకి రాకముందే జరిగిందని చెపుతూ దాఖలు చేసే సాదా బాయినామా (సాదా కాగితంపై అమ్మకాలు) అనే రిజిస్టరు కాని దస్తావేజులను సాక్షి పత్రాలుగా గుర్తించకూడదు.

9.9 1950కి ముందు ఇచ్చారని చెప్పే గిరిజనేతరుల పట్టాలన్నింటిని పరిశీలించి అవి నిజమైనవి అవునో, కాదో నిర్ధారించాలి. ఈ పట్టాలు చెల్లుబాటు అయ్యేందుకు అవసరమైన కలెక్టరు ముందుస్తు అనుమతిని పొందింది లేనిది పరిశీలించాలి.

9.10 అడిషనల్ ఏజెంట్ టు గవర్నమెంటుగా పరిగణించబడుతున్న ఐటిడిఏ ప్రాజెక్టు ఆఫీసర్లను రెగ్యులేషన్ 1/69, 2/69, 2/70, 1/89ల కింద డైరెక్టర్ ఆఫ్ సర్వే అండ్ సెటిల్‌మెంట్స్ అధికారిగా గుర్తించాలి. ఎల్‌టిఆర్ చట్టం కింద అడిషనల్ ఎజెంట్ టు గవర్నమెంటుగా పి.ఒ.కు ఇచ్చిన అప్పిలేట్ అధికారులు గత కాలానికి (రెట్రోస్పెక్టివ్) కూడా వర్తించే విధంగా చేయాలి.

9.11 స్పెషల్ డిప్యూటి కలెక్టర్లు / ఏజెన్సి డివిజన్ ఆఫీసర్లు / అడిషనల్ ఎజెంట్ / ఎజెంట్ టు గవర్నమెంట్లు ఎల్‌టిఆర్ కేసులలో గిరిజనేతరులకు అనుకూలంగా ఇచ్చిన అన్ని తీర్పుల పైనా అప్పీళ్లను దాఖలు వేయాలి.

9.12 స్పెషల్ డిప్యూటి కలెక్టర్లు, ఏజెన్సీ డివిజనల్ కోర్టులలో ఉన్న ఎల్‌టిఆర్ కేసులను నిర్దిష్ట కాల పరిమితిలోగా పరిష్కరించాలి.

9.13 మనుషులు లేని (బేచార) లేదా వదిలేసిన గ్రామాలలో సాగుకు యోగ్యమైన భూములను గిరిజనులు మాత్రమే చేసుకోవాలి. అటువంటి భూములను గిరిజనేతరులు గనుక సాగుచేస్తూ ఉంటే వారిని తొలగించి గిరిజనులకు అప్పగించాలి. ఒకవేళ వ్యవసాయానికి పనికి వచ్చినప్పటికీ, ఎవరు సాగు చేయకపోతే గిరిజనులకు వ్యక్తిగతంగా లేదా వారితో ఏర్పడిన సహకార సంఘానికి ఆ భూములను మంజూరు చేయాలి.

9.14 గిరిజన మహిళ పేరున గిరిజనేతరులు భూమిని కలగి ఉన్న సందర్భాలలో ఎల్‌టిఆర్ కింద విచారణ జరపాలి.

9.15 గిరిజనులకు అనుకూలంగా ఎల్‌టిఆర్ కేసులలో తీర్పు వచ్చినప్పుడు రెవెన్యూ అధికారులు నిర్దేశిత కాలపరిమితిలో త్వరితగతిన వాటిని అమలు పరచాలి. భూముల అప్పగింత ప్రగతిని ఒక ఉన్నతస్థాయి కమిటీ పర్యవేక్షిస్తుండాలి.

9.16 గిరిజనేతర శివాయ జమాదార్లను కాపాడేందుకు ప్రభుత్వం ఇచ్చిన జి.ఒ.లన్నింటిని రద్దు చేస్తూ గౌరవ హైకోర్టు ఇచ్చిన ఆదేశాలను విధిగా అమలు పరచాలి. ప్రభుత్వ భూములను ఆక్రమించిన గిరిజనేతర ఆక్రమణదారులను తొలగించాలి.

9.17 50 శాతం కంటే అధికంగా గిరిజన జనాభా ఉన్న గ్రామాలను షెడ్యూల్డు ప్రాంతంలో కలపాలి.

9.18 పట్టణీకరణ చెంది, గిరిజనులు స్వాధీనంలో ఉన్న భూముల హక్కులను ఎల్‌టిఆర్ చట్టం కింద క్షుణ్ణంగా పరిశీలించకుండా గ్రామ పంచాయతీలను మున్సిపాలిటీలుగా మార్చకూడదు. ఎల్‌టిఆర్ చట్టం అనుసరించి నిశితంగా పరిశీలన జరిపి అటువంటి ఆస్తులు, పారిశ్రామిక, వాణిజ్య సముదాయాల భూముల నమోదు చేయాలి.

9.19 గిరిజనులకు భూములు పంపిణీ చేయడం ప్రజా ప్రయోజనంగా భావించి షెడ్యూల్డు ప్రాంతంలో గల నిజమైన, సాధికారికమైన పట్టా హక్కులు గల గిరిజనేతరుల భూములను భూ సేకరణ చట్టాన్ని ప్రయోగించి స్వాధీనం చేసుకోవాలి.

9.20 భూ సేకరణ చట్టం కింద సేకరిస్తున్న భూములలో పట్టాదారు గిరిజనేతరులు, అనుభవదారు గిరిజనుడు ఉన్న సందర్భంలో ఎల్‌టిఆర్ చట్టం కింద క్షుణ్ణంగా విచారణ జరిపి, నష్టపరిహారం గిరిజనుడికే అందచేయాలి.

9.21 2004లో గౌరవ హైకోర్టు ఏడుగురు న్యాయమూర్తులు ఇచ్చిన తీర్పుకు అనుగుణంగా డి-ఫారం పట్టాలకు కూడా సెటిల్‌మెంట్ పట్టా భూములతో సమానంగా నష్టపరిహారం ఇవ్వాలి.

9.22 గిరిజనుల నుండి గిరిజనేతరులకు జరిగే భూ బదలాయింపులో రిజిస్టరు వీలునామాలను కూడా పరిగణలోకి తీసుకోకూడదు. బదలాయింపు నిర్వచన పరిధిలోకి గిరిజనేతరులకు రాసే వీలునామాలోను కూడా తీసుకువచ్చి అవి చెల్లకుండా చేయాలి.

9.23 గిరిజనుల సంఖ్య పూర్తిగా లేదా పూర్తిగా లేకుండా పోవడానికి దగ్గరవుతున్న మండలాలు ఉదాహరణకు వరంగల్ జిల్లా గోవిందరావు పేట, ములుగు వంటి మండలాలలో చట్ట విరుద్ధమైన గిరిజనేతరుల ఆక్రమణలను తొలగించడానికి ఎల్‌టిఆర్ ఆలంబనగా చేసుకొని సెటిల్‌మెంట్ నిర్వహించాలి.

9.24 ఎల్‌టిఆర్‌కు విరుద్ధంగా గిరిజనేతరులే అనధికారికంగా అనుభవిస్తున్న బిల్ల నెంబరు (సర్వే చేశారు కాని నెంబరు ఇవ్వని) భూములను స్వాధీనపరుచుకొని గిరిజనులకు మంజూరు చేయాలి.

9.25 భద్రాచలం చుట్టుపక్కల గ్రామాలలోని శ్రీరాముని దేవాలయ భూములను చట్టవిరుద్ధంగా అనుభవిస్తున్న గిరిజనేతరులను తొలగించాలి. గిరిజనేతరుల ఆక్రమణలో వున్న గిరిజన దేవాలయ భూములను ఎల్‌టిఆర్ ద్వారా స్వాధీనపరుచుకొని, వాటిని ఏ ప్రజా అవసరాల కోసం కేటాయించారో అదే ప్రయోజనం కోసం ఖాళీగా ఉంచాలి.

9.26 పరారి పట్టాదార్లు (జంగ్ సిపాయి, అజైబ్ సింగ్ మొదలైన) భూములను గిరిజనులకు మంజూరు చేయాలి.

9.27 గిరిజనులకు వ్యతిరేకంగా, గిరిజనేతరుల తరఫున జోక్యం చేసుకోవద్దని పోలీసులకు ఆదేశాలు ఇవ్వాలి.

9.28 గిరిజనేతరుల పేరున స్థిరాస్తులను రిజిస్ట్రేషన్ చేయవద్దని ఆ శాఖకు స్పష్టమైన ఆదేశాలు ఇవ్వాలి.

9.29 గిరిజనేతరులకు అనుకూలంగా పెద్దఎత్తున కేసులు పరిష్కారమైన చందగూడ మండలం, ఖమ్మం జిల్లా ఎల్‌టిఆర్ కేసులను పునః సమీక్షించాలి.

9.30 గిరిజనేతరులకు మంజూరు చేసిన రక్షిత కౌలుదార్ల ధృవపత్రాలను రద్దు చేయాలి. 1/70 చట్టం, సెక్షన్ 3(1) (బి) ప్రకారం నిరూపణ అయ్యేంతవరకూ ఏజెన్సీ ప్రాంతంలో గిరిజనేతరుల స్వాధీనంలో ఉన్న స్థిరాస్తి అంతా గిరిజనుడి నుండి స్వాధీనం చేసుకున్నదేనని భావించాలి.

9.31 ఖమ్మం జిల్లాలో గ్రామ అధికారులకు తప్పుగా ఇచ్చిన మక్తదార్ పట్టాలను రద్దు చేయాలి.

9.32 1980కి ముందు ఏర్పడిన గిరిజన ఆవాసాలను గుర్తించేందుకు, ప్రాంతాల వారీగా ప్రత్యేక బృందాలుగా ఏర్పడి, నిర్దిష్ట కాల వ్యవధిలోగా సర్వే నిర్వహించి కేంద్ర ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపమని అటవీ, రెవెన్యూ శాఖలకు రాష్ట్ర ప్రభుత్వం ఆదేశించాలి.

9.33 రిజర్వు ఫారెస్టు చేయటం కోసం ప్రాథమిక ప్రకటన ఇచ్చిన భూములలో గల గిరిజనుల న్యాయమైన అనుభవాన్ని నిర్ధారించ టానికి అటవీ, రెవెన్యూ, గిరిజన సంక్షేమ అధికారులతో బృందాలను ఏర్పాటు చేయాలి. చట్టాన్ని అనుసరించి గిరిజనుల అనుభవంలో వున్న భూములను డినోటిఫై చేయుటకు లేదా నోటిఫికేషన్ ఉపసంహరణకు ప్రతిపాదనలు రూపొందించాలి.

9.34 అటవీ, రెవెన్యూ సరిహద్దు వివాదాల పరిష్కారానికి సంయుక్త సర్వే చేపట్టాలి.

9.35 భూముల ప్రత్యక్ష పరిశీలన ద్వారా భూమి రికార్డులలో వాస్తవ సాగుదార్ల వివరాలను ఎప్పటికప్పుడు నమోదు చేస్తూ వుండాలి. సాగుదారు పేర్లు తప్పనిసరిగా రికార్డులలో నమోదు చేయాలి.

9.36 ఐటిడిఎ స్థాయిలో ప్రజా భూ గ్రంథాలయం ఏర్పాటు చేసి గిరిజనులకు ఇతర ఆసక్తిగల పార్టీలకు అతి తక్కువ రుసుముతో అన్ని భూమి రికార్డులు, అన్ని డాక్యుమెంట్లు, ఎల్‌టిఆర్, సెటిల్‌మెంట్ కోర్టు తీర్పులను అందచేయాలి. సమాచారం గిరిజనులకు త్వరగా, సౌలభ్యంగా అందుబాటులో వుండేందుకు గ్రామ పంచాయితీ స్థాయిలో ప్రాథమిక భూమి రికార్డు అందుబాటులో ఉంచాలి.

9.37 గిరిజన రక్షణ చట్టాల అమలును పర్యవేక్షిస్తూ పాలన యంత్రాంగానికి సమయానుకూలంగా సూచనలు ఇచ్చేందుకు ప్రభుత్వం, గిరిజన భూ వివాదాలలో నిపుణులైన పౌర సంఘాల ప్రతినిధులతో ఒక కమిటీని వేయాలి. ఐటిడిఎ స్థాయిలో కూడా ఇదే విధమైన కమిటీని వేయాలి.

9.38 ఏజెన్సీ డివిజనల్ అధికారులుగా, స్పెషల్ డిప్యూటీ కలెక్టర్లుగా నిబద్ధత గల యువ అధికారులను నియమించాలి. అందుకోసం నూతనంగా నియామకాలు జరిపినప్పుడు ఎంపికైన ఎమ్మార్వో/

ఆర్‌డిఓ / ఎస్‌డిసిలను కనీసం రెండు సంవత్సరాల పాటు గిరిజన ప్రాంతాలలో విధిగా పనిచేసేట్లు చూడాలి.

9.39 ఎల్‌టిఆర్, సంబంధిత చట్టాలపై తప్పనిసరిగా పూర్తిస్థాయి శిక్షణ ఇచ్చిన తరువాతనే అధికారులను స్పెషల్ డిప్యూటీ కలెక్టర్లుగా గిరిజన ప్రాంతంలో నియమించాలి. ఎస్‌డిసిలకు ఇతర అమలు యంత్రాంగానికి తరచుగా చైతన్య కార్యక్రమాలను నిర్వహించాలి.

9.40 ఐటిడిఎ స్థాయిలో ఉచిత న్యాయ సహాయాన్ని అందించే న్యాయ సహాయ కేంద్రాలు లేనిచోట గిరిజన అనుకూల దృక్పథం గల న్యాయవాదులతో లీగల్‌సెల్ ఏర్పాటు చేయడమే గాక, గిరిజనుల తరపున కేసులను చేపట్టే స్పెషల్ డిప్యూటి తాశీల్దారు లేదా మరే ఇతర అధికారికైనా సహకారాన్ని అందచేయాలి.

9.41 ఎల్‌టిఆర్ చట్టాన్ని ఉపయోగించుకొని ఐటిడిఎలు, దుకాణాలు/ వ్యాపారాలు, ఇళ్లు లేదా ఏదైన వాణిజ్య అవసరాలకు లైసెన్సులు ఇచ్చే శాఖలతో సమన్వయం చేసుకుంటూ గిరిజనేతరుల ప్రవేశం, చొరబాటులను నియంత్రించాలి. పిఓ, ఐటిడిఎ, జిల్లా కలెక్టరు, కమీషనరు గిరిజన సంక్షేమ శాఖతో సంప్రదిస్తూ, ఎల్‌టిఆర్ ద్వారా 5వ షెడ్యూల్ ప్రాంతంలోని రోడ్డు పక్క గ్రామాలపై దృష్టి పెట్టి వుండే ప్రత్యేక యంత్రాంగం వుండాలి.

## 10. భూ వ్యాజ్యాలు

10.1 భూ (అసైన్‌మెంట్, ఎల్‌టిఆర్, సెటిల్‌మెంట్ చట్టాలు, సీలింగ్ మిగులు భూములు, ఇనాం భూములకు సంబంధించిన) వివాదాల పరిష్కారానికి ఒక ప్రత్యేక పీఠాన్ని (బెంచ్) ఏర్పాటు చేయమని గౌరవ హైకోర్టును ప్రభుత్వం అభ్యర్థించాలి.

10.2 రెవెన్యూ కోర్టులలో ఉండే భూ వివాదాల పరిష్కారానికి రాష్ట్ర ప్రభుత్వం కాల పరిమితిని విధించాలి.

10.3 ఆర్‌డిఓ / ఎమ్మార్వోల స్థాయి మేజిస్ట్రేట్‌లు పరిష్కరించవలసిన కేసులలో కనీసం 50 నుండి 75 శాతం కేసుల పరిష్కారానికి గ్రామ కోర్టులను విధిగా నిర్వహించాలి.

10.4 ప్రతి సోమవారం ఫిర్యాదుల స్వీకారదినం అయినందున మధ్యాహ్నం లేదా సాయంత్రం కనీసం వారానికిఒకసారి రెవెన్యూ కోర్టులను నిర్వహించాలని ప్రభుత్వం గట్టిగా ఆదేశాలు ఇవ్వాలి. కనీసం ఆరునెలలకు ఒకసారి సంబంధిత అధికారులతో జిల్లాకలెక్టర్ రెవెన్యూ కోర్టుల కేసుల పరిష్కారాన్ని సమీక్షించాలి.

10.5 కేసుల స్వీకార దశలలోనే పేదలు / పేదలు కానివారు అనే విభజన చేసుకుంటే, నమోదు దశలోనే న్యాయ సహాయాన్ని వ్యవస్థ అందచేయగలుగుతుంది.

10.6 రాష్ట్ర స్థాయిలో సిసిఎల్ఎ / స్పెషల్ కమీషనర్, జిల్లాలో జాయింట్ కలెక్టర్ ఛైర్మన్‌లుగా లీగల్ సెల్స్‌ను ఏర్పాటు చేయాలి.

10.7 భూ వివాదాల పరిష్కారానికి ప్రత్యామ్నాయ వివాద పరిష్కార యంత్రాంగాలను ప్రోత్సహించాలి.

## 11. పేదల అనుకూల దృక్పథాన్ని పునరుద్ధరించడానికి రెవెన్యూ యంత్రాంగానికి శిక్షణ

11.1 పేదల అనుకూలమైన చట్టాలను అర్థం చేసుకోవడానికి, పేదల అనుకూల దృక్పథాన్ని పెంపొందించడానికి జాయింట్ కలెక్టర్ నుండి ఎమ్మార్వో, రెవెన్యూ సిబ్బంది వరకు నిరంతరం ఇచ్చే సమగ్ర శిక్షణ కార్యక్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వం రూపొందించాలి. వారి ఆసక్తిని, మనోస్థయిర్యాన్ని నిలబెట్టి ఉంచేందుకు దశలవారీగా రిఫ్రెషింగ్ కోర్సులను కూడా నిర్వహించాలి.

## 12. పేదలకు భూమిని అందుబాటులోకి తెచ్చేందుకు గల అవకాశాలు

12.1 ప్రస్తుతం ఉన్న విధాన చట్టంలోనే ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి పేదవానికి కనీసం ఒక ఎకరా భూమి ఇచ్చేందుకు ఆస్కారం ఉంది. అయితే ఈ లక్ష్యం సాధించేందుకు, రాష్ట్ర ప్రభుత్వం పలు అవకాశాలను అన్వేషించాలి. భూములు స్వాధీనం చేసుకోవడం, పేదలకు తిరిగి స్వాధీనం చేయడం, వర్గీకరణ మార్పుల ద్వారా భూములను మంజూరు చేసే ప్రస్తుత విధానాన్ని గత రెండు దశలలో జరిపిన భూపంపిణీని బలపర్చి, విస్తృత పర్చాలి. పేదలకు భూములు అందుబాటులోకి తెచ్చేందుకు అవకాశం ఉన్న వివిధ కేటగిరి భూములు. ఉదాహరణకు ప్రభుత్వ భూములు, భూదాన భూములు, సీలింగ్ మిగులు భూములు, దేవాలయ భూములు, వక్ఫ్ భూములు, ఇనాం భూములు, ప్రభుత్వ రంగ సంస్థ భూములు, ఖాళీగా ఉన్న ప్రాజెక్ట్ భూములు, గుర్తించిన భూములు (ఘాట్ నెంబర్లు) ఉమ్మడి వ్యవసాయ సహకార సంఘం భూములు, సాదా బాయినామా ద్వారా ఉన్న భూములు, గిరిజన భూములు, కాలువ గట్టు భూములు కొనేందుకు అందుబాటులో ఉన్న భూములు ఇలా పలు రకాలైన భూములు పంపిణీకి గల అవకాశాలను పరిశీలించాలి.

12.2 పేదల ప్రయోజనాలను ప్రాతినిధ్యం వహించే కమ్యూనిటీ బేస్డ్ గ్రూపులకు, రెవెన్యూ శాఖకు మధ్య అనుసంధానం కోసం విడుదల చేసిన జిఓఎంఎస్ నెం. 1148ని చురుకుగా అమలు పరచాలి.

12.3 రెవెన్యూ శాఖ, ఇందిరాక్రాంతి పథకం కింద ప్రారంభించిన సబ్ డివిజనల్ ల్యాండ్ యాక్షన్ ప్లాన్‌ను సమీక్షించి అన్ని రెవెన్యూ డివిజన్‌లలో అమలు పరచాలి.

12.4 పేదల అనుకూల చట్టాలు / ప్రభుత్వ పథకాల నుండి వారు లబ్ధిపొందేందుకు వీలుగా స్పందన గల ఒక సహాయ వ్యవస్థను ఏర్పాటు చేయాలి.

(భూమి కేంద్రం, వాసన్ ప్రచురించిన భూకమిటీ నివేదిక, 2006 తెలుగు అనువాదం సౌజన్యంతో)

◆

ఎన్నికల సందర్భంగా, తర్వాత చేసిన వాగ్దానాలను అమలుచేయాలని, కోనేరు రంగారావు కమిటీ సిఫారసులకు అనుగుణంగా చర్యలు తీసుకోవాలన్నది భూ పోరాటం ముఖ్యమైన డిమాండ్ అంటున్నారు **బి.వి. రాఘవులు**

# భూ కమిషన్‌పై ఎందుకీ దాగుడు మూతలు?

నిర్బంధం, దుష్ప్రచారం భూ ఉద్యమాన్ని దెబ్బతీయలేకపోయాయి. ఇప్పుడు భూ ఉద్యమం లేవనెత్తిన కోర్కెలపైనే గందరగోళాన్ని సృష్టించేందుకు ప్రభుత్వం, కాంగ్రెస్ నాయకులు ప్రయత్నిస్తున్నారు. డిమాండ్లు ఆచరణ సాధ్యంకానివని, చట్టాలు ఒప్పుకోవని రకరకాల తప్పుడు వాదనలు ప్రచారంలో పెడుతున్నారు. వామపక్షాలు లేవనెత్తుతున్న వాటిని మేమే అమలు జరుపుతుంటే ఇంక ఉద్యమం ఎందుకని ఒకసారి, వామపక్షాలు కోరుతున్న డిమాండ్స్ చట్టపరంగా సాధ్యం కావని మరొకసారి, వారు చెప్పినవన్నీ మేము చెయ్యాలా, అయితే ఈ ప్రభుత్వం ఉండడమెందుకని ఇంకోసారి వాదనలు తెస్తూ ప్రజల దృష్టిని మళ్లించేందుకు ప్రయత్నం చేస్తున్నారు. వాస్తవంగా కమ్యూనిస్టు పార్టీలు భూసమస్యలకు సంబంధించి అదనంగా, కొత్తగా కోరినవేమీ పెద్దగా లేవు. ఎన్నికలకు ముందు, ఎన్నికల సందర్భంగా, ఎన్నికల తర్వాత కాంగ్రెస్ చేసిన వాగ్దానాలనే అమలు చెయ్యమని కోరుతున్నాం. కోనేరు రంగారావు కమిటీ చేసిన సిఫార్సులకనుగుణంగా చర్యలు తీసుకోవాలని కోరుతున్నాం. ఇప్పుడున్న చట్టాలకు అతీతంగా చేయమని వామపక్షాలు ప్రస్తుతం కోరుతున్నదేదీలేదు.

భూ సమస్యలపై కోనేరు రంగారావు కమిటీ సమర్పించిన నివేదికను అమలు చేయాలన్నది భూ ఉద్యమం ముఖ్యమైన డిమాండ్. నివేదికకు గుండెకాయలాంటి సిఫార్సులను మినహాయించి మిగిలిన 74 సిఫార్సులను ఆమోదిస్తున్నామని ప్రభుత్వం చెబుతున్నది. ప్రభుత్వం మినహాయించిన సిఫార్సులను వదిలిపెడితే కోనేరు రంగారావు కమిటీ నివేదిక గురించి మాట్లాడుకోవడంలో అర్థమే ఉండదు. అసలు భూ సమస్య పరిష్కారాలన్నీ మినహాయించిన వాటిల్లోనే ఉన్నాయి.

అందుకే కోనేరు రంగారావు కమిటీ సిఫార్సులలోని కీలకమైన వాటిని ఆమోదించకుండా వదిలివేయడమే కాకుండా సిఫార్సులకు విరుద్ధంగా చట్టాలను సవరిస్తున్నది. కోనేరు కమిటీ నివేదికలో 1.11 నెం. సిఫార్సుకు పూర్తి వ్యతిరేకంగా, అసైన్‌మెంట్ భూముల బదలాయింపు చట్టంలోని 4వ సెక్షన్‌ను సవరిస్తూ మొదట ఆర్డినెన్స్‌ను, ఆ తర్వాత చట్టాన్ని తెచ్చింది. అన్యాక్రాంతమైన పేదల భూములను తిరిగి తిరిగి పేదలకివ్వకుండా నిరాకరించేందుకు, ఇప్పటికే పేదల దగ్గర ఉన్న భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకునేందుకు వీలుగా ఈ సవరణ చేశారు. ముఖ్యమంత్రి వద్ద చట్టవిరుద్ధంగా అసైన్‌మెంట్ భూములు కల్గివున్నందుకు చట్టప్రకారం శిక్షను అనుభవించకుండా తప్పించేందుకు కూడా చట్టసవరణ ఉద్దేశించబడింది.

అన్యాక్రాంతమైన భూములను అనుభవిస్తున్నవారిని శిక్షించేందుకే సవరణ తెస్తున్నామని ప్రచారం చేసిన ప్రభుత్వం ఇప్పుడు అక్రమంగా అనుభవిస్తున్నవారికే ఆ భూములను క్రమబద్ధీకరించడానికి ఈ ఏడాది మార్చ్ 20న ముసాయిదా నిబంధనలను రూపొందించింది. దీనితో పేదల భూములను చట్టవిరుద్ధంగా అనుభవిస్తున్న పెద్దల అక్రమ చర్యలన్నీ చట్టబద్ధమైపోతాయి. వారినుండి వసూలు చేసే నామినల్ నష్టపరిహారం ప్రభుత్వం బొక్కసంలోకి పడుతుంది. పేదల భూముల నుండి వచ్చిన ఈ ఆదాయం కూడా పేదలకు ఉపయోగపడదు.

ఈ సవరణకనుగుణంగా ఇప్పటికే హైదరాబాద్, దాని శివారు జిల్లాలు, కడప, విశాఖ జిల్లాలను ఈ సవరణ పరిధిలోకి ప్రభుత్వం తీసుకొచ్చింది. (హైదరాబాద్, రంగారెడ్డి, మెదక్, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాలలోని 65 మండలాలను జి.ఒ.ఎం.ఎస్. నెం. 1835 ద్వారా, కడప జిల్లాలోని 26 మండలాలను జి.ఒ.ఎం.ఎస్. నెం. 370 ద్వారా, విశాఖ జిల్లాలోని 19 మండలాలను, జి.ఒ.ఎం.ఎస్. నెం. 1041 ద్వారా సవరణ పరిధిలోకి తేవడం గమనార్హం). చట్ట సవరణను సవాలు చేస్తూ హైకోర్టులో వ్యాజ్యం నడుస్తున్నది. సవరణ అమలుపై కోర్టు స్టే ఉన్నా ప్రభుత్వం కోర్టును కూడా ఖాతరు చెయ్యకుండా అమలు చేస్తున్నది. చట్ట సవరణను ఉపసంహరించాలని కమ్యూనిస్టుపార్టీలు చేస్తున్న డిమాండ్‌ను ప్రభుత్వం మొండిగా తిరస్కరిస్తున్నది. భూ కమిటీ నివేదికను యధాతధంగా ఆమోదించినప్పటికీ వాటి అమలుకు సరియైన యంత్రాంగాన్ని ఏర్పాటు చేయకపోతే ప్రయోజనమేమీ ఉండదు. ఇప్పుడున్న రెవెన్యూ యంత్రాంగం భూ చట్టాలను పేదలకు అనుకూలంగా అమలు జరపడంలో ఘోరంగా విఫలమయ్యింది. భూ కమిటీ నివేదిక ఈ విషయాన్ని నొక్కిచెప్పింది. అందువల్లే సిఫార్సులను అమలు జరిపేందుకు భూ సంస్కరణల మంత్రిత్వశాఖ, స్వతంత్ర భూ సంస్కరణల కమిషన్ అవసరమని, వామపక్షాలు డిమాండ్ చేస్తున్నాయి. సిఫార్సుల

అమలుకు కాలపరిమితిని నిర్ణయించకపోతే ఇప్పటివరకు భూ సంస్కరణల చట్టాలకు పట్టినగతే కమిటీ సిఫార్సులకు కూడా పడుతుందని వామపక్షాల అభిప్రాయం. కానీ, ప్రభుత్వం అందుకు తగిన యంత్రాంగాన్ని ఏర్పాటు చేయడానికి గానీ, కాలపరిమితిని నిర్ణయించడానికి గానీ తిరస్కరిస్తున్నది. సర్వాధికారాలు కల్గిన ల్యాండ్ కమిషన్‌ను ఏర్పాటు చెయ్యడం చట్టబద్ధంగా సాధ్యం కాదని ప్రభుత్వం చెబుతున్నది. ఇది తప్పు. ఆంధ్రప్రదేశ్ (తెంగాణ ఏరియా) కౌలుదారీ చట్టం 1950, అమలును పర్యవేక్షించేందుకు ల్యాండ్ కమిషన్‌ను ఏర్పాటు చేసేందుకు సెక్షన్ 87-ఎలో అవకాశం కల్పించారు. ఈ కమిషన్‌లో ఏడుగురికి తక్కువకాకుండా సభ్యులుంటారు. ఈ సభ్యులు శాసనసభ చేత, ప్రభుత్వం చేత నియమితులవుతారు. ఇటువంటి పద్ధతిలోనే కోనేరు రంగారావు కమిటీ సిఫార్సులను అమలు జరిపేందుకు ప్రభుత్వం ఆర్డినెన్స్ లేదా చట్టం ద్వారా ల్యాండ్ కమిషన్ ఏర్పాటు చేయవచ్చు.

కోనేరు రంగారావు భూ కమిటీ భూ సమస్యలు పరిష్కారం చెయ్యడానికి ప్రత్యేక యంత్రాంగం అవసరాన్ని గట్టిగా నొక్కిచెప్పింది. భూ సమస్యల పరిష్కారాన్ని పర్యవేక్షించేందుకు ప్రభుత్వానికి సలహాలిచ్చేందుకు, అధికారులకు శిక్షణనిచ్చేందుకు, అమలును అజమాయిషీ చేసేందుకు ప్రత్యేకంగా స్టాండింగ్ కమిటీని ఏర్పాటు చెయ్యాలని పేర్కొన్నది. (Finally while the present set of recommendations of he Land Committee cover substantial ground the functioning of the Land Committee can't be short lived, the Government must constitute a standing committee on land with representatives from both Government and civil society organisations as an impartial observer and adviser to the Government assisting the Government in resolving a land issues arising from time to time and also to oversee the implementations of the land reform agenda of the Government) అంతేగాక వివిధస్థాయిలలో రెవెన్యూ శాఖలో ప్రత్యేక బాధ్యత కల్గిన అధికారులను నియమించాలని పేర్కొన్నది.

ప్రభుత్వానికి అతీతంగా స్వతంత్రంగా కమిషన్ వ్యవహరించడాన్ని ఎలా అంగీకరించగలమని ప్రభుత్వ ప్రతినిధులు తెస్తున్న అభ్యంతరం అర్థంలేనిది. పార్లమెంట్, శాసనసభ చేసిన చట్టాలకు లోబడి వాటిని అమలు జరిపేందుకు అనేక స్వతంత్ర కమిషన్లు ఏర్పడ్డాయి. ఇవన్నీ ప్రభుత్వానికి అతీతంగా ఉన్నాయని చెప్పడం సరైంది కాదు. పార్లమెంట్, శాసనసభలకు లోబడి ఉంటాయి. 1950 చట్టంలో ల్యాండ్ కమిషన్ అభిప్రాయాన్ని తిరస్కరించే అవకాశాన్ని మంత్రివర్గానికి ఇచ్చారు. అందువల్ల ప్రభుత్వానికి అతీతంగా ఉంటుందనుకోవడం కూడా పొరపాటు.

ప్రత్యేకంగా ల్యాండ్ కమిషన్‌ను ఏర్పాటు చేస్తే భూసమస్యలు పేదలకనుగుణంగా పరిష్కారమైతే ప్రభుత్వానికి అండగా నిలుస్తున్న పాతతరహా భూస్వాములకు, ఇప్పుడు కొత్తగా పెరుగుతున్న నూతన తరహా భూస్వాములకు నష్టం కలుగుతుందన్న భావంతోనే ప్రభుత్వం కమిషన్ ఏర్పాటుకు నిరాకరిస్తున్నది తప్ప చట్టపరమైన ఆటంకాలు కావు. పేదలకు ఇళ్ల స్థలాలు మంజూరు చెయ్యడానికి ప్రభుత్వం చెబుతున్న వాదనలు ప్రజా వ్యతిరేకంగానూ, అసమంజసంగానూ ఉన్నాయి. గతం నుండి ప్రభుత్వం పేదలకు ఇళ్ల స్థలాలు మంజూరు చేస్తున్నప్పటికీ ఇప్పుడు ఇళ్ల స్థలాలివ్వడం తమ విధానం కాదని చెబుతున్నది. లక్ష జనాభా కల్గిన మున్సిపాలిటీలలో వ్యక్తిగత ఇళ్ల స్థలాలు మంజూరు చేయకూడదని ప్రభుత్వం జి.ఒ.ఆర్.టి. నెం. 136ను జారీ చేసింది. దానిని సాకుగా చూపి ఇప్పుడు డిమాండ్‌ను తిరస్కరిస్తున్నది. ఇళ్ల స్థలాలివ్వడానికి సర్కార్ భూములు లేవని ప్రభుత్వం చెబుతున్నది కుంటిసాకు మాత్రమే. ఉద్యమ సందర్భంగా ప్రభుత్వ స్థలాలు ఎక్కడెక్కడున్నాయో ప్రజలు స్పష్టంగా గుర్తించారు. ఇటువంటి స్థలాల్లోనే గుడిసెలు వేశాం. కొన్ని ప్రభుత్వ స్థలాలను ల్యాండ్ మాఫియా ఆక్రమించుకొని నిర్మాణాలు చేసినా ప్రభుత్వం ప్రేక్షకపాత్ర వహించడం, వారితో కుమ్మక్కుకావడం జరుగుతున్నది. పేదలను మాత్రం తొలగిస్తున్నది.

ప్రభుత్వ భూములను పేదలకు 60 గజాలివ్వడానికి సిద్ధం కాని ప్రభుత్వం పెద్దపెద్ద సంస్థలకు పలుకుబడి కల్గిన వ్యక్తులకు వందల ఎకరాలు ఉచితంగాను, కారుచౌకగాను మంజూరు చేస్తున్నది. ముదిగొండ కాల్పులు జరిగిన తర్వాత వెంటనే ఆగస్ట్ 1న కూడా క్యాబినెట్ రెండుసంస్థలకు 115 ఎకరాలను మంజూరు చేసింది. పేదలకు లేదంటున్న ప్రభుత్వం పెద్దలకు ఎలాఇస్తున్నదని ప్రజలు అడుగుతున్నారు.

పేదలకు ఇళ్ల స్థలాలు తిరస్కరిస్తున్న ప్రభుత్వం శాసనసభ్యులకు కారుచౌకగా ఇళ్ల స్థలాలను మంజూరు చేసింది. జి.ఒ.ఎం.ఎస్. నెం. 242 (2005) ద్వారా, జి.ఒ.ఎం.ఎస్. నెం. 243, 244 (2005) ద్వారా, మధ్యతరగతిలోని కొన్ని గ్రూపులకు ఇళ్ల స్థలాలు మంజూరు చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. (ఇళ్ల స్థలాలు అందుబాటులో లేకుండా పోయిన నేటి తరుణంలో సరసమైన ధరకు మధ్యతరగతికి ఇళ్ల స్థలాలివ్వడం సమంజసమైనదే. అయితే ఈ జి.ఒ.లు కూడా అమలుకు నోచుకోలేదు). ఈ విధంగా అనేక మందికి ప్రభుత్వ భూములను, ఇళ్ల స్థలాలను మంజూరు చేస్తూ పేదలకు ఇళ్ల స్థలాలు నిరాకరించడం అన్యాయం.

ఇందిరమ్మ పథకం ద్వారా అందరికీ ఇళ్లే కట్టిస్తున్నప్పుడు ఇక ఇళ్ల స్థలాలు ఇవ్వాల్సిన అవసరమేముంది? అని ప్రభుత్వం అంటున్నది. ఈ వాదన కూడా మోసపూరితమైనదే. ఇందిరమ్మ పథకం పకడ్బందీగా అమలు జరుగుతున్నదని అనుకున్నా నిరుపేదలందరికీ గృహసౌకర్యం ఏర్పడదు. ప్రభుత్వం ప్రకటించిన యూనిట్ విలువ రు. 41,000 గృహ నిర్మాణానికి ఏమూలలకూ సరిపోదు. యూనిట్ విలువలో రు. 7,000 మాత్రమే గ్రామీణ ప్రాంతాలలో సబ్సిడీ, మిగతాది రుణం. నిరుపేదలు ఈ రుణాన్ని తీర్చగల్గిన స్థితిలో లేరు. ముందుగా పునాది వరకు సొంతడబ్బుతో నిర్మాణం చేస్తేనే మొదటి వాయిదా డబ్బు మంజూరవుతుంది. ఆ మాత్రం డబ్బు కూడా లేకపోవడంతో పేదలు ఇళ్ల నిర్మాణాన్ని ప్రారంభించలేకపోతున్నారు. ఇంటిని పూర్తి చేసుకోవటానికి డబ్బులేక అప్పుజేసిన వారు ఆ రుణం ఊబిలో కూరుకుపోయి ఇళ్లను కోల్పోతున్నారు. చాలామంది అర్హులు అనేక కారణాలతో మినహాయించబడుతున్నారు. అందువల్ల ఈ పథకం అమలు జరిగినా గృహ సమస్యను పరిష్కరించలేదు. బహుళ అంతస్తుల నిర్మాణ పద్ధతి పేద ప్రజలకు ఉపయోపడనందున పేదలలో ఆసక్తిలేదు. రాజీవ్

గృహకల్పకు స్పందన చాలా పరిమితంగా ఉండటం దీనినే విదితం చేస్తున్నది. వాస్తవంగా ఇందిరమ్మ పథకం అవకతవకలు, అక్రమాలు, అవినీతి, ఆశ్రితపక్షపాతంతో కంపుకొడుతున్నది. కాంగ్రెస్ నాయకులు తయారు చేసిన జాబితాలను లబ్ధిదారుల జాబితాలుగా నిర్ణయించడంతో వీటిలో అనర్హులే ఎక్కువమంది ఎంపికయ్యారు. అర్హులు చాలా మంది బయట ఉండిపోయారు. ఇందులో అవకతవకలు, అక్రమాల గురించి సిపిఎం, స్వచ్ఛంద సంస్థలు చేసిన సర్వేలలో వెల్లడయ్యాయి. మీడియాలో పరంపరగా కథనాలొచ్చాయి. అక్రమాలపై గగ్గోలు పెట్టిన తర్వాత విజిలెన్స్ శాఖ రూపొందించిన నివేదికలో కూడా అక్రమాలను అంగీకరించాల్సి వచ్చింది. హౌసింగ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ విడుదల చేసిన సర్క్యులర్‌లో 8 రకాల తప్పులు జరుగుతున్నట్లుగా పేర్కొనాల్సి వచ్చింది. తప్పులను వెలికితీసేందుకు స్వచ్ఛంద వెల్లడింపు పథకాన్ని ప్రకటించడం జరిగింది. అవినీతి తీవ్రతను తేలికగా కొట్టిపారేసిన పాలకులు అయిష్టంగానైనా అవకతవకల గురించి మాట్లాడాల్సి వచ్చింది. అందుకే ఇందిరమ్మ పథకంలో అవినీతిని అరికట్టి ఉన్నంతలో లబ్ధిదారులకు మేలు చేసేందుకు అంబుడ్స్‌మన్‌ను నియమించాలని కోరుతున్నది.

నిరుపేదలకుపయోగపడాల్సిన కేంద్ర ప్రభుత్వ స్కీంలను ఇందిరమ్మ పథకంలో కలిపివేసి కొన్ని తరగతులకు అన్యాయం చేస్తోంది. రీగా చట్టం కింద ఖర్చు పెట్టాల్సిన డబ్బులు ఇందిరమ్మ పథకానికి మళ్లించడం జరుగుతోంది. ఇందిరా ఆవాస్ యోజన పథకం కింద పూర్తి సబ్సిడీతో అమలు జరపాల్సిన గృహనిర్మాణాన్ని ఇందిరమ్మ పథకంలో కలపడం ద్వారా సబ్సిడీ సౌకర్యాన్ని అనేకమంది అర్హులు కోల్పోతున్నారు. పట్టణ మురికివాడల అభివృద్ధి పథకం కింద యూనిట్ విలువ రు. 80,000 ఉంటే దానిని ఇందిరమ్మ పథకానికి మళ్లించడం ద్వారా రెండు యూనిట్లకు సర్దుబాటు చేస్తున్నారు. కేంద్ర పథకాలను ఈ రకంగా మార్పులు చెయ్యడం పేదలకు నష్టం చెయ్యడమేనని అనేక సంస్థలు అభ్యంతరం పెడుతున్నాయి. పై అంశాలను దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వ భూములలో గుడిసెలు వేసుకున్న వారికి ఇళ్ల స్థలాలు మంజూరు చెయ్యడం ద్వారా నిరుపేదలకు ఆవాస సౌకర్యం కల్పించాలని డిమాండ్ చెయ్యడం జరిగింది. దీనికవసరమైతే కొత్త ఉత్తర్వును జారీ చెయ్యవచ్చు.

మధ్యతరగతికి కూడా పట్టణాలలో ఇళ్లుగాని, ప్లాట్లు గాని కొనుక్కోవడం అసాధ్యమయ్యే పద్ధతిలో భూమి విలువలు ఆకాశాన్నంటాయి. అందుకే పట్టణాలలో భూవినియోగ విధానాన్ని రూపొందించి ప్రకటించాలి. అలాగే ప్రభుత్వ భూమిని పేదల గృహావసరాలకు కొంత, మధ్యతరగతి గృహావసరాలకు కొంత కచ్చితంగా కేటాయించే పద్ధతిలో భూవినియోగ విధానాన్ని రూపొందించాలి.

పట్టణాలలో ప్రభుత్వ భూములు, పోరంబోకు భూములు, ఇనాం భూములు, దేవాదాయ భూములు, రైల్వే భూములు, కాలువగట్టు భూములు, మున్సిపల్ స్థలాలు, కొన్ని చోట్ల ప్రైవేట్ స్థలాలలో దశాబ్దాల నుండి ఇళ్లు నిర్మాణం చేసుకొని పేద, మధ్యతరగతి ప్రజలు వేల సంఖ్యలో నివసిస్తున్నారు. వీటిని రెగ్యులరైజ్ చేసి పట్టాలను మంజూరు చెయ్యాలని వీరు ప్రభుత్వాలకు చాలాకాలం నుండి మొరపెట్టుకుంటూనే ఉన్నారు. అయినా ఇప్పటివరకు ప్రభుత్వాలు సమస్యను పరిష్కరించలేదు. ఆవాసాలకు భద్రతలేక బెదిరింపులకు గురవుతూ ల్యాండ్ మాఫియా అరాచకాలకు భయపడుతూ ఈ కుటుంబాలు బిక్కుబిక్కుమంటూ బతకాల్సి వస్తోంది. ప్రభుత్వ భూముల్లోని ఆవాసాలను రెగ్యులరైజ్ చెయ్యడానికి రాష్ట్ర ప్రభుత్వం జి.ఒ.ఎం.ఎస్. నెం.లు 508 (1995), 740 (1996), 747 (1996), 313 (1997), 419 (1999), 972 (1999), 515 (2003), 631 (2004), 1601 (2005), 674 (2006) లను విడుదల చేసింది. అనేకసార్లు గడువులు పొడిగించినా సమస్య పరిష్కారం కాలేదు. రెవెన్యూ అధికారులతో కమిటీలు ఏర్పాటు చేసినా పరిష్కారానికి అవీ శ్రద్ధపెట్టలేదు. పరిష్కారాలు కనుగొనడంలో బాధితులను భాగస్వాములను చెయ్యలేదు. గాజువాక ఇనాం భూములలోని నివాసాలను రెగ్యులరైజ్ చేసే విషయంలో శాసనసభా కమిటీ నివేదిక వచ్చిన తర్వాత ప్రభుత్వ జి.ఒ.నెం. 7ను విడుదల చేసింది. అయినా ఇప్పటివరకు సమస్య పరిష్కారం కాలేదు. సింహాచలం దేవస్థానం భూములలో ఉన్న గృహాల సమస్య పరిస్థితి కూడా ఇలాగే ఉంది. ఇటువంటి సమస్యల పరిష్కారం కోసం 2005 జూలైలో సిపిఎం ఆధ్వర్యంలో నిరవధిక నిరాహారదీక్ష జరిగినప్పుడు ప్రభుత్వంతో జరిగిన ఒప్పందంలో సమస్యల పరిష్కారం కోసం ఉన్నతాధికారుల కమిటీని నియమించటానికి అంగీకరించింది. రెండు సంవత్సరాలు గడిచినా ప్రభుత్వం కమిటీని నియమించలేదు. ఒప్పందాన్నే మర్చిపోయింది. అసైన్‌మెంట్ భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నప్పుడు దానికి పూర్తి నష్టపరిహారం చెల్లించాలని పేదలు డిమాండ్ చేస్తున్నారు. ఆందోళన ఫలితంగా సగం నష్టపరిహారం ప్రభుత్వం చెల్లించడం ప్రారంభించింది. హైకోర్టులో నడిచిన వ్యాజ్యం మూలంగా అసైన్‌మెంట్ భూములకి కూడా పూర్తి నష్టపరిహారం ఇవ్వాలని కోర్టు తీర్పు ఇచ్చింది. ఇందిరమ్మ రాజ్యం గురించి నిరంతరంగా గొప్పలు చెప్పే రాష్ట్ర ప్రభుత్వం ఎ.పి.ఐ.ఐ.సి. ద్వారా హైకోర్టు తీర్పును సవాల్ చేస్తూ సుప్రీంకోర్టుకెక్కింది. సుప్రీంకోర్టులో వ్యాజ్యాన్ని ఉప సంహరించుకోమని కోరితే ప్రభుత్వం నిరాకరిస్తున్నది.

భూ ఉద్యమం లేవనెత్తిన సమస్యల గురించి తెలుసుకోవాలన్న ఆలోచన కాంగ్రెస్ నాయకత్వానికి లేదు. 100 రోజుల నుండి ఉద్యమం జరుగుతున్నది. ఈ కాలంలో పదుల సార్లు రాయబారాలు నడిపి, మహజర్లు సమర్పించి, చర్చలు జరిపి భూ సమస్యలు, పరిష్కారాల గురించి వివరించాం. ఇంత జరిగినప్పటికీ పిసిసి అధ్యక్షులు, కేంద్రం నుంచి వచ్చిన దిగ్విజయ్‌సింగ్ భూ ఉద్యమం కోరుతున్నదేమిటో తెలియనట్లు మాట్లాడడం ఆశ్చర్యకరం. తెలిసీ తెలియనట్లు నటిస్తున్నారా? వామపక్షాల కేంద్ర నాయకత్వం అల్టిమేటం ఇచ్చిన తర్వాత ఇరుకునబడి పరిష్కారం కోసం మేమూ సిద్ధమేనని నమ్మించడానికి ప్రయత్నిస్తున్నారా? ఏ సంగతీ రాబోయే రోజులలో తేలుతుంది. గురువారం ఉదయం అల్పాహార సమావేశానికి సిపిఎం నాయకత్వాన్ని పిలవకుండా సిపిఐ నాయకత్వాన్ని మాత్రమే ఆహ్వానించడం చూస్తే కాంగ్రెస్ నాయకత్వానికి చిత్తశుద్ధి ఉందా అన్న అనుమానం కల్గుతున్నది.

*('ప్రజాశక్తి' సౌజన్యంతో)* ◆

ఇళ్లు నిర్మిస్తామని వాగ్దానం చేసినా, అక్కడక్కడా కట్టడం ప్రారంభించినా, భూపోరాటాలకు ఇంత స్పందన ఎలా వస్తోందనీ, ఆచరణలో లోపాలేమిటో ప్రభుత్వం గ్రహించాలనీ అంటున్నారు **కె. నారాయణ**

# రాష్ట్ర ప్రభుత్వం మూల్యం చెల్లించక తప్పదు

పట్టణాలలో 100 గజాల నివేశన స్థలం కోసం, గ్రామీణ ప్రాంతంలో రెండెకరాల భూమి కోసం తీవ్ర ఆందోళన రాష్ట్ర అవతరణకు ముందు, ఆ తర్వాత కూడా జరుగుతూనే ఉంది.

అనేక పోరాటాలు జరిగితే కొన్ని చట్టాల్ని ప్రవేశపెట్టారు. బంజరు భూమి పేద ప్రజలకు అసైన్ చేశారు. భూ సంస్కరణల చట్టాల ద్వారా మిగులు భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని పేదలకు పంచాలన్న నిర్ణయం ఇప్పటికీ అమలు కాలేదు. పట్టణాలలో ఉన్న ప్రభుత్వ భూమి, దేవాదాయ ధర్మాదాయ భూములు సక్రమంగా వినియోగిస్తే పట్టణ పేదలకు, సామాన్య మధ్య తరగతికి నివేశన స్థలాలు, సొంతగూటికి లోటేమీ ఉండదు. ఉన్న భూమిని పేదలకు దక్కేట్టు చేయాలంటే అలాంటి దృక్పథం కలిగిన ప్రభుత్వాలుండాలి. ఆ దృక్పథం కలిగిన ప్రభుత్వాలు మన రాష్ట్రంలో లేనందునే భూ పోరాటాలు చేయాల్సి వస్తోంది. ఆ పోరాటాల ద్వారానే పట్టణాలలో నివేశన స్థలాలు పేదలు సొంతమయినా, గ్రామాలలో పేదలకు అంతో ఇంతో వ్యవసాయ భూమి దక్కింది. అదీ అందుబాటులో ఉన్న భూమిలో అతి తక్కువ మాత్రమే సాధించుకోగలిగారు. ఈ చట్టాలను సైతం స్వార్థపరులు, అవినీతి రెవెన్యూ అధికారులు దుర్వినియోగం చేసి బోగస్ లబ్ధిదారులుకు అప్పగిస్తున్నారు. పొరబాటున ఎక్కడైనా నిజాయితీగల అధికారులు చొరవ తీసుకుంటే వారు వేధింపులకు గురవుతున్నారు.




## నా అనుభవంలో కొన్ని

చిత్తూరు జిల్లా కెవిబి పురం మండలంలో దాదాపు మూడు వేల ఎకరాల బంజరు భూమి బోగస్ లబ్ధిదారులకు పట్టాలివ్వబడ్డాయి. వారంతా స్థానికేతరులే. వారికి భూమి ఎక్కడుందో కూడా తెలియదు. అయితే ఆచరణలో పేద రైతులు ఆక్రమించి అనుభవిస్తున్నారు. పట్టా పొందిన బోగస్ లబ్ధిదారులు ఆయా డాక్యుమెంట్లను బ్యాంకుల్లో పెట్టి లాంగ్‌టర్మ్, షార్ట్‌టర్మ్‌లోన్స్ వ్యవసాయం కోసం తీసుకున్నారు. ఆ లోన్ ప్రాతిపదికను ఆ భూమికి చట్టబద్ధంగా యాజమాన్యంగా మరో ఆధారం సంపాదించుకున్నారు. స్వాధీనంలో ఉన్న పేదల బతుకులు దిన దిన గండం నూరేండ్లాయుష్షుగా ఉండేది. దానిపై తీవ్రతర ఆందోళన చేశాం.

చివరికి దివంగత నాగార్జున కలెక్టర్‌గాను, వెంకటరమణ జాయింట్ కలెక్టర్‌గాను ఉన్న సమయంలో స్వాధీనంలో ఉన్న భూమిపై పేదలకు హక్కు కల్పించే ఏర్పాట్లు చేయమని ఆదేశించారు. అయితే ఆనాటి ఎమ్మార్వో పట్టాల పేర్లు మార్చినట్టు మార్చి గతంలో ఉన్న బోగస్ లబ్ధిదారుల కుటుంబ సభ్యుల పేర్లతో పట్టాలిచ్చారు. ఈ వాస్తవాన్ని ఆనాటి కలెక్టర్ దృష్టికి తీసికెళితే వారు స్పందించి ఆ ఎమ్మార్వోను సస్పెండ్ చేశారు. పనిష్‌మెంట్‌కు గురైన ఎమ్మార్వో హైదరాబాద్‌లో ఒక వారం కూర్చొని కలెక్టర్‌నే మార్పించేశారు.

'నిజాయితీ అధికారుల అక్రమ బదిలీల వ్యతిరేక పోరాట కమిటీ' ఏర్పాటు చేశాం. జిల్లా వ్యాపిత పోరాటం, చలో హైదరాబాద్ కూడా నిర్వహించాం. ఉపయోగం లేకపోయింది. ఇలాంటి అనుభవాలు ఎన్నైనా చెప్పవచ్చు.

## కోనేరు రంగారావు కమిటి

డాక్టర్ వై.ఎస్. రాజశేఖరరెడ్డి గారు ముఖ్యమంత్రి కాగానే ఉభయ కమ్యూనిస్టు పార్టీలు కలిసి భూ సమస్యపై కేంద్రీకరించమని కోరడం జరిగింది. ఆ తర్వాతే సీనియర్ మంత్రి గతంలో రాష్ట్ర ఉప ముఖ్యమంత్రిగా కూడా పనిచేసిన కోనేరు రంగారావుగారి ఆధ్వర్యాన ఒక కమిటి వేశారు. రెండు సంవత్సరాల తర్వాత నివేదిక ఇచ్చారు. అయినా ప్రభుత్వం నుండి కదలిక లేదు.

గత్యంతరం లేని స్థితిలో భూస్వాధీన ఉద్యమం ప్రారంభించాం.



ఈ ఉద్యమంలో పట్టణాలలో, గ్రామీణ ప్రాంతంలో పేద ప్రజలు కదిలారు. ముఖ్యంగా పట్టణాలలో బాగా కదిలారు.

ఒకవైపు ప్రభుత్వం మేమే ఇళ్లు నిర్మిస్తామని, మూడు సంవత్సరాలలో 50 లక్షల ఇళ్లు కట్టిస్తామని వాగ్దానం చేసినా, కొన్ని పట్టణాలలో ఇళ్లు నిర్మించే ప్రక్రియ ప్రారంభమైనా, ఎందుకు వామపక్షాల పిలుపుకు ఆదరణ వస్తున్నది? ఆచరణలో ఉన్న లోపాన్ని గ్రహించకుండా ప్రభుత్వం కళ్లుమూసుకుంది.

## భూమిపై ప్రభుత్వ విధానమే తప్పు

ప్రభుత్వం భూసమస్య సామాజిక సమస్యగా చూడడంలేదు. అది ఒక శాంతి భద్రతల సమస్యగా చూస్తోంది. అందుకే ప్రజలనాడి పట్టుకోలేకపోతోంది. ప్రభుత్వ భూమిని అమ్ముకుని ఖజానా నింపాలని నిర్ణయించింది. వేలంపాటలో భూముల ధరలు అనూహ్యంగా పెరిగాయి. భూముల ధరలు ఒక గజం రు.యాభై వేలు, ఒక్క ఎకరా రు.14 కోట్లకు చేరాయి. ఇదంతా ప్రభుత్వం, స్వార్ధపర రియల్ ఎస్టేట్ సంస్థలు కలిసి ఆడిన నాటకంలో భాగమని ఇప్పుడు బట్టబయలవుతోంది. దీని పర్యవసానం మధ్య తరగతి ప్రజలు కూడా చిన్న ఇంటికి యజమాని కావాలనే సహజమైన కోర్కె కూడా 'అందని ద్రాక్ష'గా మారిపోయింది. ఇక పేదలెలా బతకగలరు?

## చర్చలు

రాష్ట్ర వ్యాపితంగా భూ ఉద్యమం కదిలింది. చివరికి ముఖ్యమంత్రితో ఒక దఫా చర్చలు జరిగాయి. రెవెన్యూ మంత్రి గారి సమక్షంలో ఒక వర్క్‌షాపు, మరో దఫా రెవెన్యూమంత్రి ఛాంబర్‌లో ఉభయ కమ్యూనిస్టు పార్టీ నాయకులతో ఒక సమావేశం జరిగింది. దానికి పరాకాష్ఠగా అసెంబ్లీలో కూడ చర్చ పెడతామని ముఖ్యమంత్రి స్వయంగా ప్రతిపాదించారు. చివరికి చర్చల ద్వారా పరిష్కారం కాలేదు. ప్రభుత్వంపై వత్తిడి తెచ్చేందుకు రాష్ట్ర స్థాయి నుండి మండలాల వరకు దీక్షలకు పూనుకున్నాం.

## నిరవధిక నిరాహారదీక్షలు

రాష్ట్ర స్థాయిలో ఉభయ కమ్యూనిస్టు పార్టీల రాష్ట్ర స్థాయి నాయకులే నిరవధిక నిరాహార దీక్షలకు పూనుకోగా, జిల్లా మండల స్థాయిలో నాయకులు నిరవధిక, రిలే దీక్షలకు పూనుకున్నారు. రాస్తారోకో, పికెటింగ్, బంద్‌లకు కూడా పిలుపునివ్వడం జరిగింది. ఇంత జరుగుతున్నా ప్రభుత్వానికి సమాచారం ఉండదా? ప్రభుత్వ నిఘా విభాగమేమయింది? ఆ నిఘా విభాగం ప్రభుత్వానికి నివేదిక ఇచ్చినా లెక్క చేయలేదా? ఇవన్నీ శేష ప్రశ్నలు.

అసెంబ్లీలో చర్చిస్తామని ముఖ్యమంత్రి చెప్పినా జూలై 16 నుండి 26 వరకు అసెంబ్లీలో నానుతూనే ఉంది. చివరి నిమిషంలో ముగ్గురు మంత్రులకు బాధ్యతనిచ్చి చర్చించమన్నారు. అంటే అప్పటి వరకు ఆందోళనకారులు ఏమడుగుతున్నారు, ఎలాంటి యంత్రాంగాన్ని నియమించాలి తదితర అంశాలపై సాంకేతిక ఇబ్బందులేమిటి? వీటిపై తగిన లోతైన పరిశీలన జరగలేదు.

## బంద్ పిలుపును తేలిగ్గా తీసుకున్న ప్రభుత్వం

'మీరెలాగైన బంద్ చేయాలనే నిర్ణయంతో ఉన్నారు కదా, బంద్ నిర్వహణ అయిన తర్వాత మాట్లాడుతాం' అని బాధ్యాతాయుత రెవెన్యూ మంత్రి వ్యాఖ్యానించాక, ఇక ఈ ప్రభుత్వానికి ప్రజాందోళనపై ఎలాంటి అవగాహన ఉందో అర్థం చేసుకోవచ్చు. చివరి నిమిషంలో చేసిన ప్రయత్నం కనీసం మూడు రోజుల ముందు నుండి చేసి ఉంటే ఫలితాలు ఎలా ఉండేవో?

## జూలై 28, 2007 మరో బషీర్‌బాగ్

రాష్ట్రవ్యాపితంగా బంద్ ప్రశాంతంగా జరుగుతుంటే ఖమ్మం జిల్లా ముదిగొండలో కాల్పులు జరిగాయి. ఏడుగురు చనిపోగా పలువురు క్షతగాత్రులయ్యారు. చిన్న గ్రామం, పెద్ద రహదారి కాదు. అక్కడ జరిగే బంద్ విచ్చిన్నం చేయడానికి మర తుపాకులు వినియోగించారు.

అసలు మర తుపాకులు ఎక్కడ ఉపయోగించాలో కేంద్ర ప్రభుత్వం 1993లో సూచనలు కూడా చేసింది. ఆ సూచనలకు వ్యతిరేకంగా ఏకంగా ఎ.కె. 47లు ఉపయోగించారు. ఈ దారుణం జాతీయస్థాయి అంశంగా మారింది. తీవ్రమైన ఘాతుకానికి ప్రభుత్వం తగిన మూల్యం చెల్లించుకోవలసిందే.

జూలై 30న ముదిగొండ కాల్పులు ఖండిస్తూ అన్ని పార్టీల సమావేశం నిర్వహించాయి. ముఖ్యమంత్రి రాజీనామాపై చర్చించాయి. అసలు ఈ ఉద్యమం ఎక్కడ ప్రారంభమైంది? ఎటువైపు దారి తీసుకున్నది పరిశీలిస్తే భవిష్యత్ ఉద్యమాలపై ఈ ప్రభావం ఎలా ఉండబోతుందో ఆందోళన వ్యక్తమవుతుంది. ఒకవైపు పేదలు భూమి కోసం లక్షలాదిగా రంగంలోకి వచ్చారు. దాని పరిష్కారానికి ఒక మార్గం వెతకవలసి ఉంది. లేకపోతే లక్షలాది ప్రజలు ఉద్యమంపై నమ్మకం ఉంచిన వారికి నిరాశ ఎదురవుతుంది. ఇంకా భూ ఉద్యమం కొనసాగించాల్సి ఉంది.

'ఒకవైపు భూ ఉద్యమం - మరోవైపు ముఖ్యమంత్రి రాజీనామా కోసం ఆందోళన' రెండూ మిళితమైతే మొదటి ప్రాధాన్యతగా రాజకీయ అంశం సంతరించుకుంటుంది. ఉద్యమాన్ని రాజకీయ చైతన్యం వైపు తీసుకెళ్లాలనే లక్ష్యం అవసరం. అయితే ఈ సందర్భంలో భూమి తల్లిని నమ్మిన పేదలకు న్యాయం చేయాలనే ప్రాధాన్యత అనివార్యంగా ద్వితీయ స్థానానికి వెళ్లిపోతోంది. భవిష్యత్ ఉద్యమాలపై దీని ప్రభావం ఎలా ఉంటుందన్న విషయమై ఆగస్ట్ 2న వామపక్ష పార్టీల సమావేశం జరిగింది. భూ పోరాటంలో వామపక్షాల ఆధ్వర్యంలోనే జరగాలి. సహకారం ఎవరి నుంచైనా తీసుకోవచ్చు అని నిర్ణయించడం జరిగింది. ఈ ఉద్యమ ఫలితాలు వచ్చేంత వరకు ఆందోళన కొనసాగాల్సిందే. ◆

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి - నక్సలైట్లకు జరిగిన చర్చలలో భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు), భారత కమ్యూనిస్టు పార్టీ (మా-లె) జనశక్తి పార్టీలు 2004 అక్టోబర్ 15న సమర్పించిన పత్రం

# భూమి పంపిణీ - వ్యవసాయరంగ అభివృద్ధి

చారిత్రాత్మక తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో వికసించిన 'దున్నేవారికే భూమి' ఆకాంక్షను సంపూర్ణంగా నెరవేర్చడమే మా లక్ష్యం. 'దున్నేవారికే భూమి' నినాదంతో వ్యవసాయ విప్లవం ఇరుసుగా సాగే నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించడానికే ముప్పై ఏడు సంవత్సరాలుగా మేం సాయుధ పోరాట ఆచరణలో ఉన్నాం. వలసవాద వ్యతిరేక, జాతీయోద్యమమే భూసంస్కరణల అవసరాన్ని గుర్తించినప్పటికీ, గత ఆరు దశాబ్దాలలో భూసంస్కరణల కోసం ఎన్నో చట్టాలు వచ్చినప్పటికీ, దున్నేవారికే భూమి ఇచ్చే మౌలిక భూ సంబంధాల మార్పు ఇంతవరకూ జరగలేదు. ఈ దేశపాలకవర్గాలకు భూస్వామ్యం లోనే మూలాలున్నందువల్ల భూసంబంధాలలో మార్పుల దిశగా ఎటువంటి ముందడుగు సాగలేదు. అందువల్ల భూసంబంధాల మార్పు, భూముల పంపకం, విప్లవాత్మక భూసంస్కరణలు అమలు జరపడమనేది ఇవాళ కొనసాగుతున్న పాలకవర్గాల నేతృత్వంలో సాధ్యం కాదని, ఈ పాలకవర్గాలను కూలదోసే నూతన వ్యవస్థ నిర్మాణ క్రమంలోనే అది సాధ్యమని మా విశ్వాసం.

దేశ అభివృద్ధికి సంబంధించిన ఈ దీర్ఘకాలిక విశ్వాసాన్ని ఉంచుకుంటూనే, ప్రజాజీవితంలో కనీస మార్పులకు దోహదపడే ఉపశమనాలను సాధించాలని, పాలకవర్గాలను నిలదీసి, వారు వాగ్దానం చేస్తున్న అంశాలనైనా నెరవేర్చేలా ఒత్తిడి తేవాలని మా ప్రయత్నం. అందులో భాగంగానే మా పార్టీలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో సాగిస్తున్న చర్చలలో 'భూమి పంపిణీ - వ్యవసాయరంగ అభివృద్ధి' అనే అంశాన్ని ఎజెండాలో చేర్చాము.

భూమి పంపిణీ, వ్యవసాయరంగ అభివృద్ధిలకు సంబంధించి ప్రభుత్వానిది, పాలకవర్గాలది ప్రధానంగా చట్టపరమైన, సాంకేతికమైన, సంస్కరణవాదంతో, ఉదారవాదంతో కూడిన వైఖరి కాగా, మాది సామాజిక న్యాయపరమైన, ఆచరణాత్మక, ప్రజాస్వామిక, విప్లవాత్మక వైఖరి. మేం భూసంస్కరణలను, భూపంపకాన్ని ప్రజల ఆత్మవిశ్వాసం పెంచేక్రమంలో ఒక మెట్టుగా, ప్రజలకే అన్ని అధికారాలు అనే అంతిమ లక్ష్యం వైపు ఒక అడుగుగా, భూమిలేని నిరుపేదలను పీడన నుంచి విముక్తి చేసే చర్యగా, వ్యవసాయోత్పత్తి పెరుగుదలకు మార్గంగా, ఉత్పత్తి సాధనాలను ప్రజలపరం చేసే మాఆశయానికి తొలిమెట్టుగా పరిగణిస్తాం. మన సమాజం అనుభవిస్తున్న అనేక సమస్యలను పరిష్కరించడానికి, సామాజిక సంబంధాలను మార్చడానికి భూపంపకం పునాది కల్పిస్తుందని మేం విశ్వసిస్తాం. భూసంస్కరణల చట్టాలను లొసుగులతో తయారు చేయడం ద్వారా, అరకొరగా అమలు చేయడం ద్వారా నిజమైన భూదాహంతో భూమిలేని నిరుపేదలు,, చిన్న రైతులు సాగిస్తున్న ఆందోళనలను అణచివేయడం ద్వారా పాలకవర్గాలు కల్పించిన ఆటంకాలన్నిటినీ ప్రజా ఉద్యమాలు తొలగించగలవని మేము విశ్వసిస్తాం. భూసంస్కరణలకు వ్యతిరేకంగా భూస్వామ్య అనుకూల మేధావి వర్గం ముందుకు తెస్తున్న వాదనలలో ఎంత మాత్రం పసలేదని, గ్రామీణ వాస్తవిక స్థితి ఆ వాదనలను తుత్తునియలు చేయగలదని మేం భావిస్తాం. ప్రకటించిన భూసంస్కరణల అమలుకు పోరాటాలు చేపడుతూనే, ఆ కార్యక్రమం సరిపోదని, ఇంకా విప్లవాత్మకమైన భూపంపక కార్యక్రమం అవసరమని మేం భావిస్తాం.

ఈ అవగాహనల నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్‌లో భూసంబంధాల పరిస్థితిని అంచనా వేసినప్పుడు, ఆంధ్రప్రదేశ్ గ్రామీణ సమాజంలో తక్షణం పరిష్కరించవలసిన ప్రధాన సమస్య భూసంబంధాలలో అసమానత. రాష్ట్రంలో ఒక కోటీ ఆరు లక్షలకు పైగా భూకమతాలుండగా, గ్రామీణ జనాభా దాదాపు ఆరుకోట్లు ఉంది. అంటే రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో, పూర్తిగా వ్యవసాయం మీద ఆధారపడిన కుటుంబాలు కనీసం ఒక కోటీ ముప్పై లక్షల నుంచి ఒక కోటీ అరవై లక్షల వరకు ఉంటాయి. మొత్తం ఒక కోటీ ఆరు లక్షల భూకమతాలున్న కుటుంబాలలో కూడా కనీసం ఆరు లక్షల కుటుంబాలయినా వ్యవసాయం మీద ఆధారపడకుండా ఇతర వృత్తులలో, ఉద్యోగాలలో ఉన్నారనుకుంటే నికరంగా రాష్ట్రంలో యాభై లక్షల కుటుంబాలు భూమిలేని నిరుపేదలుగా ఉన్నారని తేలుతుంది. అంటే రాష్ట్ర జనాభాలో దాదాపు మూడోవంతు భూమిలేని నిరుపేదలుగా ఉన్నారన్నమాట. దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభాగా ప్రభుత్వం ప్రకటించే గణాంకాలకూ, ఈ అంచనాకూ దగ్గరి సంబంధం ఉంది.

భారతదేశ భూసంబంధాల విషయంలో మరొక ప్రత్యేకత

విషయాన్ని చెప్పడం అవసరమని భావిస్తున్నాం. నగరాలు, కేంద్రీకృత ఆర్థిక విధానాలు కేంద్రంగా కొనసాగిన ఆర్యవర్ణ వ్యవస్థ స్థానంలో క్రీ.శ. తర్వాత గుప్తరాజుల కాలం నుండి గ్రామాలు, వికేంద్రీకృత ఆర్థిక విధానాలు, స్వయం పోషకత్వం కేంద్రంగా గల కుల దేవాలయ బ్రాహ్మణీయ ఫ్యూడల్ వ్యవస్థ ఉనికిలోకి వచ్చింది. నేటికీ కొనసాగుతున్న జడత్వ కులవ్యవస్థ వేళ్లూనుకున్నది ఈ తరహా ఫ్యూడల్ వ్యవస్థలోనేనని గమనించాలి. దీనినే మార్పులేని (సాపేక్షికంగా) ఆసియా తరహా సమాజమని కారల్‌మార్క్స్ అభివర్ణించారు. ఈ తరహా సమాజంలో కేవలం అగ్రవర్ణం లేదా అగ్రకుల శూద్రులు మాత్రమే రైతులుగా పరిగణించబడతారు. చేతివృత్తులు, సేవా వృత్తులు చేసే శూద్రులందరూ అగ్రకులాల గ్రామపు శాశ్వత వారసత్వ సేవకులుగా, కూలిపనులు చేసే శాశ్వత దాసులుగా పరిగణించబడతారు. సేవకులు, దాసులకు భూమితో పాటు ఏ ఆస్తినీ కలిగివుండే హక్కు ఉండదు. విద్య, బోధనలు నిషేధం. సైన్యంలో సిపాయిగా చేరడం నిషేధం. పరిపాలన, రాజ్యం అంచుకే రారాదు. వీరి ధర్మాలు, ఆచారాలు, సంప్రదాయాలు, వాడలు, దేవుళ్లు, కర్మకాండలు అన్నీ వేరు. ఏ కులానికా కులం ఒక దడి కట్టుకొని మూసపోసిన ప్రత్యేక సమాజంగా ఉండడమే హిందూయిజం లేదా హిందూ సామాజిక వ్యవస్థ రూపం. దీని మూలంగానే హిందూయిజం ఒక మతం కాదు, ఒక సామాజిక వ్యవస్థ అని డా. బి.ఆర్. అంబేద్కర్ అభివర్ణించారు. చేతివృత్తులు స్వేచ్ఛా పరిశ్రమలుగా కాక గ్రామంలో వ్యవసాయానికి కట్టివేయబడిన సేవావృత్తులుగా పరిమితం చేయబడడం, వారసత్వ శ్రమవిభజన అనేవి రెండూ హిందూ ఫ్యూడలిజానికి మూలస్తంభాలని కారల్‌మార్క్స్ విశ్లేషించారు.

భూమిలేని నిరుపేదల స్థితిని అలా ఉంచితే, పేరుకు భూమి ఉన్న కుటుంబాల మధ్య కూడా ఎంతో అసమానత ఉంది. అరవై శాతం చిన్న కమతాల చేతిలో మొత్తం భూమిలో ఇరవైశాతం మాత్రమే ఉండగా, ఆరు శాతం పెద్దకమతాల చేతిలో ముప్పై రెండు శాతం భూమి ఉంది. మధ్య, చిన్న రైతులను కలిపి చూస్తే ఎనభై శాతం కమతాల చేతిలో నలభై రెండు శాతం భూమి ఉంది. పెద్ద కమతాలలో ఇరవైఐదు ఎకరాల పైన భూమి ఉన్న వాటిని విడిగా పరిశీలిస్తే 0.78 శాతం కమతాల చేతిలో 9 శాతం భూమిఉంది. ఈ అసమానతలే గ్రామీణ సమాజంలో దోపిడీ పీడనలకు, ఆధిపత్య సంబంధాలకు కారణమవుతున్నాయి.

భూసంబంధాల వాస్తవస్థితిలోని ఈ రెండు ప్రధానాంశాలకు తోడుగా రాష్ట్ర వ్యవసాయాభివృద్ధిని కుంటు పరిచే విధంగా భూ వినియోగం ఉంది. రాష్ట్ర విస్తీర్ణం దాదాపు ఏడు కోట్ల ఎకరాలు కాగా దాదాపు రెండున్నర కోట్ల ఎకరాలలో అడవులు, సాగుయోగ్యం కాని భూములు, వ్యవసాయేతర వినియోగంలో ఉన్న భూములు ఉన్నాయి. మిగిలిన నాలుగున్నర కోట్ల ఎకరాలలో వాస్తవంగా వ్యవసాయం జరుగుతున్న భూమి మూడుకోట్ల ఎకరాల లోపు మాత్రమే. ఆ మూడుకోట్ల ఎకరాలలో కూడ నీటి పారుదల సౌకర్యాలు ఉండి, రెండోపంటకు వీలయిన విస్తీర్ణం అరవైలక్షల ఎకరాలలోపే, ఈ కారణంవల్ల అందుబాటులో ఉన్న భూమి కూడ సరిగా వినియోగంలోకి రాక భూమిమీద ఒత్తిడి పెరగడం, భూమిలేని నిరుపేదలకు భూమి అందకపోవడం జరుగుతోంది.

భూమిలేని నిరుపేదలు, భూయాజమాన్యంలో అసమానతలు, భూ వినియోగంలో అవకతవకలు అనే ఈ మూడు ప్రధాన సమస్యలను పరష్కరించేడంలో చిత్తశుద్ధి లేని ప్రభుత్వం కేవలం ప్రజా ఉద్యమాల ఒత్తిడి వల్ల, కంటి తుడుపు చర్యగా, తూతూ మంత్రంగా భూసంస్కరణల చట్టాలను ప్రకటిస్తూ వస్తోంది. పాలకవర్గ పార్టీల జెండాలు ఏవయినా, వాటి ప్రకటిత సిద్ధాంతాలేవయినా ఇప్పటివరకు దేశంలో అధికారంలోకి వచ్చిన అన్ని పార్టీలు భూసంస్కరణల చట్టాలను లోపభూయిష్టంగా తయారు చేశాయి. ప్రవేశ పెట్టిన చట్టాలను నిజాయితీగా అమలు చేయలేదు. దేశంలోనే తొలి భూసంస్కరణల చట్టాలలో భాగమైన కౌల్దారీ రక్షణ, హక్కుల చట్టాలు ఇటు హైదరాబాద్ రాష్ట్రంలోనూ, అటు ఆంధ్ర ప్రాంతంలోనూ అమలులోకి వచ్చి ఐదు దశాబ్దాలు దాటిపోయినా కౌలుదార్ల హక్కులకు పూర్తి రక్షణ దొరకలేదు. భూగరిష్ఠ పరిమితి చట్టాలు ప్రవేశపెట్టి ముప్పైఏళ్లు దాటుతున్నా ఆ లోప భూయిష్టమైన చట్టాలనయినా అమలు చేయడం జరగలేదు. అటు కౌల్దారీ, గరిష్ఠ పరిమితి చట్టాలకు తూట్లు పొడవడం మాత్రమే కాదు, కనీసం గ్రామ ఉమ్మడి, ప్రభుత్వ భూములను దళితులకు, భూమిలేని నిరుపేదలకు పంచడం అనే అతి సులభమైన కార్యక్రమానికి కూడ ప్రభుత్వాలు పూనుకోలేదు.

ఆంధ్రప్రదేశ్‌లో గల గరిష్ఠపరిమితికి మించి భూస్వాముల అధీనంలో ఉన్న భూములు కనీసం అరవై లక్షల ఎకరాలు ఉండవచ్చునని 1950లలో అంచనా వేయగా 1980ల నాటికి దాన్ని పదహారు లక్షల ఎకరాలకు కుదించారు. అందులో భూస్వాములు చట్ట ప్రకారం మినహాయింపులు, సవరణలు చూపిన విస్తీర్ణం ఎనిమిది లక్షల ఎకరాలు. మిగిలిన ఎనిమిది లక్షల ఎకరాల్లో కూడా ప్రభుత్వం స్వాధీనం చేసుకుని పంపిణీ చేశామని ప్రకటిస్తున్నది ఐదులక్షల డెబ్బైవేల ఎకరాలు మాత్రమే. ఈ వ్యవహారమంతా గందరగోళంగా జరగడం మాత్రమే గాక, చట్టం ఇచ్చిన మినహాయింపులలో అవకతవకలు ఉండడం, కుటుంబం, కమతం, మాగాణి, మెట్ట, వ్యవసాయ భూమి, వ్యవసాయేతర భూమి, పళ్లతోటలు, పూలతోటలు వంటి మామూలు మాటలెన్నో కూడా విచిత్రమైన నిర్వచనాలకు దారితీశాయి. ప్రభుత్వం పంపిణీ చేశానని చెప్పుకుంటున్న ఐదులక్షల డెబ్బైవేల ఎకరాల్లో కూడ ఎంతో భాగం అన్యాక్రాంతమైపోయింది. గణనీయమైన భాగం ఊసర క్షేత్రాలుగా సాగుకు పనికిరానిది.

ఇక గ్రామ ఉమ్మడి భూములు, సాముదాయక భూములు, ప్రభుత్వ భూములు రాష్ట్రంలో కనీసం అరవై లక్షల ఎకరాలు ఉండవచ్చునని ఒక అంచనా. ఇందులో దాదాపు నలభై రకాల పేర్లతో భూములు ఉన్నాయి. దేవాదాయ, ధర్మాదాయ భూములు నాలుగు లక్షల ఎకరాలు, అటవీ భూములు ఏడు లక్షల ఎకరాలు, తీర ప్రాంత భూములు ఐదు లక్షల ఎకరాలు. కాక లక్షలాది ఎకరాల ప్రభుత్వ బంజర్లు, పోరంబోకు భూములు, శివాయిజమా, శ్రోత్రియం (అగ్రహారం), ఇనాం, గ్రామకంఠం, చెరువు శికం, భూదానం, పీర్లమాన్యం, వక్ఫ్‌భూములు, ఈనాం, మిరాసి, ఎట్టి, మాన్యం, ముద్ద, ప్రభుత్వగైరన్, ఖారిజ్ ఖాతా పడావు వంటి అనేక రకాల భూములు ఉన్నాయి.

నిజానికి ఇటువంటి భూములను భూమిలేని నిరుపేద రైతులకు పంపిణీ చేయడం ప్రభుత్వ బాధ్యత. ప్రభుత్వం అతి సులభంగా చేయగలిగిన పని. ప్రభుత్వం 42 లక్షల ఎకరాల బంజరు భూములను,

ఉమ్మడి భూములను లక్షలాది కుటుంబాలకు పంపిణీ చేశానని ఇప్పటికే చెప్పుకుంటోంది కూడా. కాని ఆ 42 లక్షల ఎకరాల భూమిని వాస్తవంగా పరిశీలిస్తే అందులో ఎంతభాగం అనర్హులకు – అంటే అప్పటికే భూములున్నవారికి, ఆశ్రితులకు, పారిశ్రామికవేత్తలకు, రాజకీయ ప్రయోజనాల కొరకు – ఇవ్వడం జరిగిందో బైటపడ్తుంది. కనీసం 16 లక్షల ఎకరాల భూమి ఇలా కాగితం మీద పంపిణీ జరిగినప్పటికీ లబ్ధిదార్ల అధీనంలో లేదని, అనర్హుల చేతిలో ఉందని ఒక అంచనా. ఇటీవలి ఉదాహరణ చెప్పాలంటే విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లా అటవీ ప్రాంతంలో దాదాపు మూడు లక్షల ఎకరాలను పారిశ్రామివేత్తలకు అందజేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. హైదరాబాద్ చుట్టూ రంగారెడ్డి, మెదక్, నల్లగొండ, మహబూబ్‌నగర్ జిల్లాలలో లక్షలాది ఎకరాల భూమిని పారిశ్రామిక వేత్తలకు కట్టబెట్టింది. అంతర్జాతీయ విమానాశ్రయం కోసం హైదరాబాద్ పరిసరాల్లో 80 గ్రామాల్లో వేలాది ఎకరాల భూములను ఆక్రమించడం జరిగింది.

అడవి మీద ఆదివాసులకే అధికారం ఉండాలని, ఆ అధికారాన్ని బదలాయించడానికి వీలులేదని 1959 చట్టం, 1/1970, సవరణ ఆదేశిస్తుండగా, ప్రభుత్వం ఆదివాసుల భూములను పారిశ్రామికవేత్తలకూ, మైదాన ప్రాంతం నుంచి వచ్చిన భూస్వాములకూ కట్టబెడుతోంది.

భూ పంపిణీ, భూయాజమాన్యంలో సంస్కరణల విషయంలో ప్రభుత్వవైఖరి ఇలా ఉండగా, 1992 తర్వాత నూతన ఆర్థిక విధానాల వెల్లువలో అసలు భూసంస్కరణల గురించి మాట్లాడడమే పాలకవర్గాలు మానివేశాయి. ప్రత్యేకించి మన రాష్ట్రంలో చంద్రబాబునాయుడు పాలనా కాలంలో తయారయిన విజన్ 2020, నూతన వ్యవసాయ విధానం భూసంస్కరణలను వ్యతిరేకించాయి. ఒకవైపు భూసంస్కరణలను, భూమి లేని నిరుపేదలకు భూమి అందించే విధానాలను వ్యతిరేకిస్తూ మరోవైపు కాంట్రాక్టు వ్యవసాయాన్ని, కార్పొరేట్ వ్యవసాయాన్ని ప్రోత్సహించాయి. ఆహార ధాన్యాల వ్యవసాయాన్ని నిరుత్సాహపరుస్తూ, మార్కెట్ కోసం వ్యవసాయాన్ని ప్రోత్సహించాయి. వ్యవసాయరంగంలో రుణ, పరపతి సౌకర్యాలను తగ్గించివేశాయి. చంద్రబాబు నాయుడు ప్రభుత్వం నీటి పారుదల సౌకర్యాలను నిర్లక్ష్యం చేసి వ్యవసాయరంగాన్ని దెబ్బ తీయడంతో పాటు గిట్టుబాటు ధరలు కల్పించకుండా, సబ్సిడీల మీద కోత విధిస్తూ మధ్య రైతులకు, ధనిక రైతులకు కూడ వ్యవసాయం చేయలేని స్థితి కల్పించింది. మరోవైపు విత్తనాలు, ఎరువులు, పురుగుల మందులు, మార్కెట్లు, కోల్డ్ స్టోరేజి గిడ్డంగులు, రవాణా సౌకర్యాలు వంటి రంగాలలో బహుళజాతి సంస్థలకు, దళారీలకు ప్రాధాన్యత ఇస్తూ రైతాంగాన్ని వారి దయాదాక్షిణ్యాలకు బలిచేసింది. అందువల్లనే ఆంధ్రప్రదేశ్ రైతాంగం దిక్కుతోచని స్థితిలో ఆత్మహత్యల బారిన పడింది.

ఈ పూర్వరంగంలో ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయరంగం అభివృద్ధి ముందున్న సవాళ్లు – వ్యవస్థాత్మక భూయాజమాన్య మార్పులు, భూపంపిణీ, చిన్న కమతాలు బతికి బట్టకట్టడానికి అవసరమైన సహాయం అందించడం, వ్యవసాయరంగంలో విదేశీ, బహుళజాతి సంస్థల జోక్యాన్ని తగ్గించడం, వ్యవసాయాభివృద్ధికి స్వావలంబన పునాదిగా వ్యూహాన్ని రచించి అమలు చేయడం, వ్యవసాయాధార పరిశ్రమలు ప్రోత్సహించి భూమి మీద ఒత్తిడిని తగ్గించడం ఈ అన్ని సవాళ్లను స్వీకరించి పరిష్కరించడం ప్రస్తుత పాలకవర్గాలకు అసాధ్యం. కాని ఈ పాలకవర్గాలు తమను తాము ప్రజా ప్రభుత్వాలమని పిలుచుకుంటున్నాయి గనుక, ప్రజల ఓట్లతో గద్దెనెక్కాయి గనుక, ఈ సవాళ్లన్నిటికీ ప్రజానుకూల సమాధానాలను అన్వేషించవలసి ఉంది.

## మా నిర్దిష్ట ప్రతిపాదనలు

1. భూమి సమస్య పరిష్కారాలు రెడీమేడ్‌గా, రాష్ట్రానికంతా ఒకే పద్ధతిలో ఉండవు. ఏ సమస్య పరిష్కారమయినా నిర్దిష్టంగా గ్రామంలో ప్రజల ముందు చర్చించి నిర్ణయించాలి. ఏ గ్రామంలో ఎవరికి ఎంత భూమి ఉందో దాని నాణ్యత ఏమిటో, దాని నీటి సౌకర్యాలేమిటో, అది కుటుంబానికి సరిపోతుందో లేదో చెప్పగలిగేది స్థానిక ప్రజలు మాత్రమే. అటువంటి గ్రామీణ స్థాయి చర్చ గ్రామీణ ప్రజల చైతన్యాన్ని అభివృద్ధి చేస్తుంది. గ్రామంలో లేని, ఇతర వ్యాపకాలతో, వృత్తులతో జీవనోపాధి సంపాదించే వ్యక్తులకు, కుటుంబాలకు గ్రామంలో భూమి ఉండడానికి వీలు ఉండగూడదు అనే సూత్రం అమలు చేయాలంటే చర్చ గ్రామంలో మాత్రమే జరగాలి. భూ పంపిణీ కొరకు సృష్టించే వ్యవస్థలలో గ్రామ ప్రజా సభలకు పూర్తి అధికారం ఉండాలి.
2. గరిష్ఠ భూపరిమితి చట్టం ఏమి చెప్పినప్పటికీ ప్రతి గ్రామంలోనూ ప్రతి కుటుంబానికీ కనీస భూమి ఉండాలనే ప్రాతిపదిక మీద పంపిణీ ప్రారంభం కావాలి. గరిష్ఠ పరిమితిని మాగాణి ఐదు ఎకరాలకు, మెట్ట పది ఎకరాలకు తగ్గించాలి. పెద్ద రైతుల కుటుంబ అవసరాలకు మించిన భూమి ఉన్నా, ఏ కుటుంబానికయినా ఇతర ఆదాయ వనరులున్నా ఆ భూమిని స్వాధీనం చేసుకుని భూమిలేని నిరుపేదలకు పంచాలి. ఈ పంపకం గ్రామాలలో దళిత, బుడుగు వర్గాల దగ్గర ప్రారంభం కావాలి. ప్రత్యేకంగా దేవాలయభూములను దళితులకు పంచి ఇవ్వాలి. కుటుంబాన్ని యూనిట్‌గా గుర్తించి, మహిళల పేరుమీద, యజమానురాలి పేరుమీద పట్టా ఇవ్వాలి. భూస్వాములకు నష్టపరిహారం చెల్లించరాదు.
3. గ్రామంలోని ప్రభుత్వ భూములు, ఉమ్మడి భూముల రికార్డు సంపాదించి అక్రమ ఆక్రమణదారులను బేదఖల్ చేయించి దాన్ని పంపిణీ చేయాలి.
4. రైతాంగం పోరాడి సాధించుకున్న భూములను వారికి స్వాధీనం చేయాలి.
5. 1/70 చట్టాన్ని సక్రమంగా అమలు చేయాలి. ఆదివాసులకు అడవి మీద అధికారానికి హామీ ఇవ్వాలి. ఆదివాసేతర పేదలకు, మైదాన ప్రాంతాల భూమి ఇచ్చి వారిని అడవినుంచి బైటికి పంపించాలి.
6. కార్పొరేట్, కాంట్రాక్టు వ్యవసాయాన్ని ప్రభుత్వం రద్దుచేయాలి.
7. ఆహార పంటలకు ప్రాధాన్యతనిచ్చే వ్యవసాయ విస్తరణ సేవలను నెలకొల్పాలి. ఎగుమతి ప్రాధాన్యతగల పంటలను ప్రోత్సహించటం మానుకోవాలి.
8. వ్యవసాయోత్పత్తులకు సరైన మార్కెటింగ్ సౌకర్యాలు కల్పించి, గిట్టుబాటు ధరలకు హామీ ఇవ్వాలి.
9. రైతాంగానికి ఉచిత విద్యుత్తును విస్తరించి ఆ ప్రయోజనం పేద,

చిన్న, మధ్య రైతులకు అందే జాగ్రత్తలు తీసుకోవాలి.

10. కొత్తగా భూ సంపిణీవల్ల భూమి పొందే చిన్న రైతులకు అవసరమైన వ్యవసాయ ఉత్పాదకాలన్నిటినీ – పశువులు, విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు, సస్యరక్షణ, భూసార పరీక్ష సౌకర్యాలు, రుణాలు– ప్రభుత్వం చౌకధరలకు అందించాలి. కనీసం 3 సంవత్సరాల పాటు కొత్త రైతులు వ్యవసాయంలో నిలదొక్కుకునేదాకా ప్రభుత్వ సహాయం కొనసాగాలి. భూమితోపాటు ఉపాధి సౌకర్యాలు కల్పించాలి.

11. కనీసం మండలానికి ఒకటి చొప్పున ప్రభుత్వ రంగంలో గాని, ప్రైవేట్ చిన్నతరహా పరిశ్రమల రంగంలో గాని వ్యవసాయాధార పరిశ్రమలను ఏర్పాటు చేసి స్థానిక వనరులతో, స్థానికులకు ఉపాధి కల్పిస్తూ దేశీయ యంత్రాలు వాడుతూ ఉత్పత్తి సాగించేలా చూడాలి.

12. నిర్ణీతంగా సాలీనా కొన్ని లక్షల ఎకరాలకు కొత్తగా నీటి పారుదల సౌకర్యాలు కల్పించేందుకూ, కొన్ని లక్షల ఎకరాల భూమిని కొత్తగా వ్యవసాయ యోగ్యం చేసేందుకూ పథకాలు రచించి, చిన్నతరహా ప్రాజెక్టుల నిర్మాణంపై శ్రద్ధ పెట్టాలి. చెరువులు, కుంటల మరమ్మతులు చేయించాలి. ఎత్తిపోతల పథకాలను చేపట్టాలి.

13. చిన్న కమతాల రైతులను ప్రోత్సహించి సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పరిచి అన్ని రకాల రుణ, పరపతి సౌకర్యాలు కల్పించాలి. రిజర్వ్ బ్యాంక్ క్రెడిట్ పాలసీని పేద రైతాంగానికి అమలు జరపాలి.

14. వ్యవసాయంతో సంబంధం లేని ఫార్మ్‌హౌజెస్, స్టూడియోలు, పరిశ్రమలు, పత్రికలు, విద్య, వైద్యం, వినోదం, రియల్ ఎస్టేట్ పేరు మీద కొనసాగుతున్న వ్యవసాయ భూములను స్వాధీనం చేసుకుని పేదలకు పంచాలి. పట్టణాల్లో వివిధ సంస్థలకు అవసరానికి మించి ప్రభుత్వం ఇచ్చిన భూమి, రియల్ ఎస్టేట్‌గా మారే అవకాశం ఉన్న వ్యవసాయ భూమిని కూడ వెనక్కి తీసుకుని పేదలకు పంచాలి (హైదరాబాద్ పరిసరాల్లో ఇటువంటి భూ వివరాల కోసం చూ. అనుబంధం)

15. రైతుల ఆత్మహత్యలను అరికట్టడానికి చేపట్టే చర్యలలో భాగంగా రుణభారాన్ని తగ్గించాలి. పేద, మధ్యతరగతి రైతాంగం వ్యవసాయ రుణాలను పూర్తిగా రద్దుచేయాలి.

16. కౌలుదారులను రికార్డు చేయించాలి. సంస్థాగతమైన రుణసౌకర్యం కల్పించాలి.

17. అసైన్‌మెంట్, సిజెఎఫ్ఎస్ లాంటి భూమికి పర్మినెంట్ పట్టాలు ఇవ్వాలి. ప్రభుత్వం ఇచ్చిన భూములు తిరిగి తీసుకొన్నయెడల వారికి నష్టపరిహారం ఇవ్వాలి.

**అనుబంధం :**

**హైదరాబాద్ పరిసరాల్లో అన్యాక్రాంతమైన వ్యవసాయ భూముల వివరాలు**

| | | |
|---|---|---|
| 1. | రామోజీ ఫిల్మ్ సిటీ | 2000 ఎకరాలు |
| 2. | సంఘీనగర్ | 1500 ఎకరాలు |
| 3. | సత్యం కంప్యూటర్స్, బైర్రాజు ఫౌండేషన్ తదితర సంస్థలు | 2000 ఎకరాలు |
| 4. | డాక్టర్ రెడ్డి ల్యాబ్స్ | 1000 ఎకరాలు |
| 5. | జనహర్ష | 2000 ఎకరాలు |
| 6. | నార్నే ఎస్టేట్స్ | 2000 ఎకరాలు |
| 7. | జి.పి.ఆర్ ఎస్టేట్స్ | 1000 ఎకరాలు |
| 8. | శ్రీమిత్ర రియల్ ఎస్టేట్స్ | 1000 ఎకరాలు |
| 9. | దేవేందర్‌గౌడ్ కుటుంబం | 1500 ఎకరాలు |
| 10. | శ్రీనిధి రియల్ ఎస్టేట్స్ | 1000 ఎకరాలు |
| 11. | జయభేరి ఎస్టేట్స్ (మురళీమోహన్, చంద్రబాబునాయుడు బినామి) | 2000 ఎకరాలు |
| 12. | రహేజా ఎస్టేట్స్ | 1000 ఎకరాలు |
| 13. | ఎల్ & టి (చంద్రబాబునాయుడు బినామి) | 1000 ఎకరాలు |
| 14. | జనచైతన్య రియల్ ఎస్టేట్స్ | |
| 15. | సాయి చైతన్య రియల్ ఎస్టేట్స్ | |
| 16. | వెంకట చైతన్య రియల్ ఎస్టేట్స్ | |
| 17. | రామానాయుడు స్టూడియోస్ | |
| 18. | అన్నపూర్ణ స్టూడియోస్ | |
| 19. | పద్మాలయా స్టూడియోస్ | |
| 20. | రామకృష్ణ స్టూడియోస్ | |
| 21. | సి.సి. స్టూడియోస్ | |
| 22. | గ్రీన్‌సిటీ టౌన్‌షిప్ | |
| 23. | ఇంజనీర్స్ సిండికేట్ | |
| 24. | మయూరీ రియల్ ఎస్టేట్స్ | |
| 25. | అమరావతి రియల్ ఎస్టేట్స్ | |
| 26. | సూర్యవంశి రియల్ ఎస్టేట్స్ | |
| 27. | మ్యాక్సిమా రియల్ ఎస్టేట్స్ | |
| 28. | 21స్ట్ సెంచరీ బిల్డర్స్ | |
| 29. | శిల్ప రియల్ ఎస్టేట్స్ | |
| 30. | లహరి ఎస్టేట్స్ | |
| 31. | అజయ చైతన్య రియల్ ఎస్టేట్స్ | |
| 32. | ఐ.ఐ.ఐ.టి | |
| 33. | ఐ.ఎం.జి. భారత అకాడమీ | 800 ఎకరాలు |
| 34. | ఇండియన్ బిజినెస్ స్కూల్ | 250 ఎకరాలు |
| 35. | అవేర్ | 500 ఎకరాలు |
| 36. | సిల్వన్ యూనివర్సిటీ | 200 ఎకరాలు |
| 37. | జినోమ్ వ్యాలీ (ఐసిఐసిఐ నాలెడ్జ్ పార్క్, షాపూర్‌జీ, (పల్లోంజీ బయోటెక్ పార్క్) | 3000 ఎకరాలు |
| 38. | ఐమాక్స్ | |
| 39. | స్నోవరల్డ్ | |
| 40. | ఐల్యాబ్స్ | |
| 41. | విప్రో, ఇన్ఫోసిస్, మైక్రోసాఫ్ట్, ఒరాకిల్ తదితర ఐ.టి. కంపెనీలు | 1000 ఎకరాలు |
| 42. | ఫామ్ హౌసెస్, రిసార్ట్స్, గెస్ట్ హౌస్‌స్, క్లబ్స్ పేరిట విలాస గృహాలు | |
| 43. | వ్యాపార, వాణిజ్య సంస్థలకు ప్రభుత్వం ఇచ్చిన భూములు | |

◆

**వ్యవస్థ మార్పుతో మాత్రమే నిజమైన భూసంస్కరణలు అమలౌతాయని, వ్యవస్థ మార్పు కోసం ప్రజల సంఘటిత చైతన్యయుత విశాల పోరాటం తప్ప మరొక మార్గం లేదని ప్రచారం చేయాలంటున్నారు ఎన్. వేణుగోపాల్**

# ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య - పరిష్కారాలు

ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య చర్చకు ఎనిమిది దశాబ్దాల చరిత్ర ఉంది. ఈ సమస్యను గురించి చర్చించేటప్పుడు భూ యాజమాన్యంలోని అసమానతలను గురించి, ఒకవైపు వందల, వేల ఎకరాలు ఉన్న కొన్ని వందలమంది భూస్వాములు, మరొకవైపు భూమిలేని కోట్లాది నిరుపేదలు ఉండడం గురించి, అరవై సంవత్సరాలుగా భూమికోసం పేదలు, చిన్న రైతులు, కౌలుదార్లు సాగిస్తున్న పోరాటాల గురించి, పాలకుల వైపునుంచి ఎడతెగకుండా సాగుతున్న వాగ్దానాల, చట్టాల, భూసంస్కరణల, భూదానాల, భూపంపిణీల భాగోతం గురించి ప్రస్తావించుకోవడం ఆనవాయితీ. ఆ చర్చ కూడ ప్రపంచీకరణ తర్వాత కాస్త వెనుకపట్టు పట్టి మళ్లీ గత మూడునాలుగు సంవత్సరాలుగా విస్తృతమవుతోంది.

ఈ క్రమంలో ప్రపంచీకరణ తర్వాత అసలు భూసంస్కరణలు అవసరమే లేదనే కొత్త వాదనలు కూడ పుట్టుకొచ్చాయి. నూతన ఆర్థిక విధానాల వెల్లువలో వ్యవసాయరంగం చితికిపోవడం, చిన్న, మధ్యతరగతి రైతులకు వ్యవసాయం గిట్టుబాటు కాకపోవడం రైతుల ఆత్మహత్యలు వంటి పరిణామాల వల్ల వ్యవసాయం గురించి గాని, వ్యవసాయరంగ సంస్కరణల గురించి గాని మాట్లాడడమే ఒక చాదస్తంగా చూసే పరిస్థితి కూడ తలెత్తింది. కాని ఒకవైపు ప్రపంచీకరణ శక్తులు ఈ విధంగా వ్యవసాయాన్ని, భూమి ప్రాధాన్యతను తగ్గించి మాట్లాడుతుండగానే అవే ప్రపంచీకరణ శక్తులు వందల, వేల ఎకరాలు ఆక్రమించుకుంటూ సువిశాల భూక్షేత్రాలలో ఫార్మ్‌హౌజులు, పండ్లతోటలు, పూల తోటలు పెంచడం, రిసార్టులు, గోల్ఫ్‌కోర్సులు నిర్మించడం కూడ మొదలయింది. ఆ భూ ఆక్రమణ ప్రక్రియ చివరికి ప్రత్యేక ఆర్థిక మండలాల స్థాయికి వచ్చి లక్షలఎకరాల వ్యవసాయ భూములు ప్రపంచీకరణ శక్తులకు, దేశదేశాల సంపన్నులకు హక్కు భుక్తం కావడం మొదలయింది.

అంటే భూమి ప్రాధాన్యత తగ్గలేదు సరిగదా అది నానాటికీ మరింత పెరుగుతున్నదని అర్థమవుతున్నది. సరిగ్గా వ్యవసాయభూమి మీద ఈ ఒత్తిడి పెరుగుతుండగానే, పట్టణ భూమి మీద కూడ ఒత్తిడి పెరగడం మొదలయింది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ చితికిపోతుండడంతో గ్రామ ప్రాంతాల నుంచి పట్టణాలకు విపరీతంగా వలసలు పెరగడం, విస్తరిస్తున్న సామాజిక విలువలలో పట్టణ జీవనానిది పైచేయికావడం, ఎక్కువమంది పట్టణాలకు చేరుతుండడం వంటి పరిణామాలు ఒకపక్కన, బహుళజాతి సంస్థల, సంపన్నుల అవసరాల కోసం పట్టణభూముల ఆక్రమణ మరొకపక్కన కలగలిసి, పట్టణాలలో భూమి ధరలకు రెక్కలు వచ్చాయి. గత దశాబ్దంలో దేశంలోనూ, రాష్ట్రంలోనూ మొదలయిన నూతన ఆర్థిక విధానాల ఫలితాలు గ్రామీణ, పట్టణ భూములపై ఒత్తిడిలో విస్పష్టంగా కనబడతాయి.

గ్రామీణ భూమిపై ఒత్తిడికి చారిత్రక కారణాలు ఉన్నాయి. ఇటు హైదరాబాద్ రాష్ట్రంలోనూ, అటు బ్రిటిష్ ఆంధ్రలోని సంస్థానాలలోనూ జరిగిన అనేక భూ పోరాటాలు గ్రామీణ భూయాజమాన్యంలోని అసమానతలను బయటపెట్టాయి. ఆ తర్వాత ఆరు దశాబ్దాలలో పాలకులు ఎన్ని వాగ్దానాలు చేసినా, ఎన్ని చట్టాలు చేసినా అసమానత మారలేదు. 2000-01 భూ కమతాల గణాంకాల ప్రకారం 60.91 శాతం సన్నకారు కమతాల చేతిలో 21.56 శాతం భూమి, 21.84 శాతం చిన్న రైతుల చేతిలో 24.76 శాతం భూమి ఉండగా మరొక కొసన 4.34 శాతం మధ్యరైతుల దగ్గర 19.82 శాతం భూమి, 0.54 శాతం పెద్ద రైతుల చేతిలో 7.50 శాతం భూమి ఉంది. అంటే నలభై లక్షల మంది సన్నకారుల రైతుల చేతిలో ఎంత భూమి ఉందో అంతే భూమి కేవలం అరవై వేల భూస్వాముల చేతిలో ఉంది. భూమి ఉన్నవారి మధ్య అసమానత ఇలా ఉండగా, గత దశాబ్దంలో చిన్న కమతాలు వికేంద్రీకరణకు, పెద్ద కమతాలు కేంద్రీకరణకు గురైన పరిణామం కూడ సంభవించింది. అంటే చిన్న కమతాలు మరింతగా సాగుచేసుకోవడానికి వీలులేకుండా మారిపోయి, పెద్ద రైతులకో, కార్పొరేట్ వ్యవసాయ దారులకో కౌలుకు ఇవ్వబడినాయన్నమాట.

ఇక భూమి లేని నిరుపేదల సంఖ్య గ్రామీణ ప్రాంతాలలో ఇబ్బడి ముబ్బడి. ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఒక కోటికి పైగా గ్రామీణ వ్యవసాయ కార్మికులు ఉన్నారు. వారందరూ భూమిలేని నిరుపేదలే నని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం వామపక్షాల నాయకత్వాన సాగుతున్న భూపోరాటానికి పునాదిలో ఉన్నది గ్రామీణ, పట్టణ భూములపై పెరిగిన

| | |
|---|---|
| రాష్ట్రం మొత్తం విస్తీర్ణం | 6,77,76,921 ఎకరాలు |
| వ్యవసాయ యోగ్యమైన భూమి | 4,08,76,931 ఎకరాలు |
| సాగులో ఉన్న భూమి | 2,57,66,395 ఎకరాలు |

ఈ ఒత్తిడే. అటు గ్రామీణ వ్యవసాయ భూముల విషయంలో రెండు తరాలకు పైగా భూసంస్కరణల ఆకాంక్షలు ఉన్నప్పటికీ అవి సఫలం కాకపోవడం, ఇటీవల విపరీతంగా పెరుగుతున్న పట్టణీకరణ వల్ల పట్టణ భూముల కొరత, దొరికే పట్టణ భూముల విషయంలో తీవ్రమైన అసమానతలు కలగలిసి భూమి సమస్య రాష్ట్రంలో ఎవరు ముట్టించినా అంటుకునే స్థితికి చేరింది.

జనగణన 2001 ప్రకారం రాష్ట్రంలో గ్రామీణ జనాభా 5,54,01,067 లేదా 1,26,07,167 కుటుంబాలు. కాని ప్రభుత్వ గణాంకాల ప్రకారమే రాష్ట్రంలో సాగులో ఉన్న మొత్తం భూకమతాల సంఖ్య ఒక కోటి పదిహేను లక్షలు. అంటే స్థూల దృష్టితో చూస్తే గ్రామీణ జనాభాలో భూమిలేని కుటుంబాలు కనీసం పదకొండు లక్షలు ఉన్నాయని అర్థమవుతుంది. అయితే ఈ గణాంకాన్ని మరింత సూక్ష్మంగా పరిశీలించవలసి ఉంటుంది. ఈ లెక్క ఆపరేషనల్ (సాగుచేస్తున్న) కమతాలదే గాని పట్టాదారు కమతాలది కాదు. సాగులో ఉన్న కమతాలన్నిటికీ తాము సాగు చేస్తున్న భూమి మీద హక్కు ఉన్నదో లేదో స్పష్టంగా చెప్పలేం. అట్లాగే గ్రామీణ జనాభాలో కూడ వ్యవసాయం మీద ఆధారపడని, ఇతరవృత్తులలో, సేవారంగంలో, గ్రామీణ ఎరిశ్రమలలో ఉన్న కుటుంబాలు చెప్పుకోదగిన సంఖ్యలో ఉండే ఉంటాయి. గనుక వాటినికూడ భూయాజమాన్యం నుంచి మినహాయించాలి.

ప్రభుత్వ గణాంకాలు ఇచ్చే మరొక వివరం ప్రకారం గ్రామీణ జనాభాలో శ్రామికులుగా పరిగణనలోకి వచ్చిన వారు జనాభాలో సగానికన్న తక్కువ (2,90,40,873) మాత్రమే. ఈ నిర్వచనానికి చాల పరిమితులుంటాయి. గనుక దాన్ని యధాతథంగా తీసుకోనక్కరలేదు. కాని ఈ శ్రామిక జనాభాగా గుర్తించినదానిలో మళ్లీ సాగుదార్లు, వ్యవసాయ కార్మికులు, గృహపరిశ్రమలు, ఇతర వృత్తులు అని నాలుగు విభాగాలు చేస్తారు. ఇక్కడ ఒక ఆసక్తికరమైన గణాంకం దొరుకుతుంది. దాని ప్రకారం గ్రామీణ రంగంలో వ్యవసాయదారుల జనాభా 73,97,688 (మొత్తం గ్రామీణ శ్రామికులలో 25.47 శాతం)గా, వ్యవసాయ కార్మికుల జనాభా 98,23,264 (మొత్తం గ్రామీణ శ్రామికులలో 33.83 శాతం) గా తేలుతుంది.

ఇక్కడ కుటుంబాల సంఖ్యనో, కమతాల సంఖ్యనో కాక జనాభాను ఇవ్వడం ఆశ్చర్యం గొలుపుతుంది. ఈ జనాభాను కుటుంబాలుగా విభజిస్తే దాదాపు 18 లక్షల 49 వేల కుటుంబాలు మాత్రమే సాగుదారుల కుటుంబాలుగా తేలుతాయి. మరి ఈ కుటుంబాల లెక్కకు, కమతాల లెక్కకు సరిపోదు. లేదా ఈ సాగుదార్ల చేతిలోనే ఒక్కొక్క కుటుంబం చేతిలో సగటున ఐదు కమతాలు ఉంటేనే గాని మొత్తం లెక్క సరిపోదు. మొత్తానికి గ్రామీణ భూపంపిణీ చాల అసమానంగా ఉన్నదని ఈ లెక్కలు తేటతెల్లం చేస్తాయి.

ఇంకా ఆశ్చర్యకరమైన గణాంకం దాదాపు ఒక కోటి మంది (అంటే కనీసం ఇరవై ఐదు లక్షల కుటుంబాలు) వ్యవసాయ కార్మికులుగా

| | |
|---|---|
| మొత్తం జనాభాలో ప్రధానశ్రామికులు | 2,90,40,873 |
| వ్యవసాయదారులు | 73,97,688 (25.47 శాతం) |
| వ్యవసాయ కార్మికులు | 98,23,264 (33.83 శాతం) |
| కుటీర పరిశ్రమలు | 13,52,705 (04.66 శాతం) |
| ఇతర పనులు | 1,04,67,216 (36.04 శాతం) |

నమోదు కావడం. వీరిలో కొందరికయినా ఎంతో కొంత భూమి ఉండే ఉంటుంది. కాని నీటిపారుదల, పశువులు, విత్తనాలు, ఎరువులు, పెట్టుబడి వంటి ఉత్పాదకాలు లేనందువల్ల వారు ఆ భూములను బీడు పెట్టిగాని, ఇతరులకు కౌలుకు ఇచ్చిగాని వ్యవసాయ కార్మికులుగా మారిపోయి ఉంటారు.

ఇక్కడ సామాజిక అసమానతలను కూడ పరిగణనలోకి తీసుకుంటే, దళితులలో 49,37,314 మంది ప్రధాన శ్రామికులుగా నమోదుకాగా, వారిలో 5,72,189 (11.59 శాతం) సాగుదార్లుగాను, 31,70,383 (64.21 శాతం) వ్యవసాయ కార్మికులుగాను, 91,003 (1.84 శాతం) గృహపరిశ్రమలలోను, 11,03,793 (22.36 శాతం) ఇతర వృత్తులలోను ఉన్నారని ప్రభుత్వ గణాంకాలు చెపుతున్నాయి. అంటే దళితులలో కేవలం 11శాతం మంది (లేదా ఒకలక్షా ఇరవై ఐదువేల కుటుంబాలు) వ్యవసాయదారులుగా ఉండగా, 64 శాతం మంది (దాదాపు ఎనిమిది లక్షల కుటుంబాలు) వ్యవసాయ కార్మికులుగా ఉన్నారన్నమాట.

ఈ గణాంకాల ఆధారంగా చెప్పగలదేమంటే, ఇవాళ రాష్ట్రంలో భూమి సమస్య అంటే నిజానికి భూమి సమస్య మాత్రమే కాదు. అది మిగులు శ్రామికుల సమస్యే. రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయం చేయగలిగి ఉండి, వ్యవసాయం చేయడానికి భూమి గాని, ఇతర సౌకర్యాలు గాని లేనందువల్ల శ్రామికులుగా, కూలీలుగా, పేదరికంలో బతుకుతున్న జనాభా ఇరవై నుంచి ముప్పై లక్షల కుటుంబాలు ఉన్నాయి. ఆ కుటుంబాలకు భూమి, ఇతర సౌకర్యాలు కల్పించడం ఎట్లా అన్నది ఇవాళ రాష్ట్రంలోని ప్రధాన సమస్య. అంటే ఇది మిగులు భూముల సమస్య కన్న ఎక్కువగా మిగులు శ్రామికుల సమస్య. ఆ మిగులు శ్రామికులకు అర్థవంతమైన, ప్రయోజనకరమైన, వికాసదాయకమైన జీవితాన్ని ఇవ్వడం కోసం భూవసతి, ఇతర వ్యవసాయ ఉత్పాదకాల వసతి కల్పించడం ఎట్లా అన్నది సమస్య. భూసంస్కరణలు ప్రజాస్వామ్యవికాసంలో, కుల అణచివేతను తగ్గించడంలో, వ్యవసాయం ఉత్పత్తిని పెంచడంలో, భూస్వామ్య సంకెళ్ల నుంచి గ్రామీణ ఉత్పత్తి శక్తులను విడుదలచేయడంలో ఉపకరిస్తాయని ఎన్నో పరిశోధనలు వాదించాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఈ మిగులు శ్రామికులకు, అపారమైన ఉత్పత్తి నైపుణ్యం ఉన్న వర్గాలకు భూమి మీద అధికారం ఇవ్వడం ద్వారా ఈ ఫలితాలన్నీ ఎట్లా సాధించవచ్చునో చూపవచ్చు.

భూమి దగ్గర చర్చ మొదలుపెట్టే చాలమంది నిరుపేదలందరికీ పంచడానికి తగినంత భూమి లేదు గదా అనే వాదన మొదలుపెట్టి ఆగిపోతారు. నిజానికి వాదన మొదలుపెట్టవలసింది అక్కడకాదు. ఈ సమాజంలో ఒక గణనీయమైన భాగం, సమాజానికి అవసరమైన ముఖ్యమైన నైపుణ్యం ఉండి కూడ ఆ నైపుణ్యాన్ని ఉపయోగించలేని,

| | |
|---|---|
| గ్రామీణ జనాభా | 5,54,01,067 |
| గ్రామీణ కుటుంబాల సంఖ్య | 1,26,07,167 |
| గ్రామీణ నివాస గృహాల సంఖ్య | 1,20,31,434 |
| పట్టణ జనాభా | 2,08,08,940 |
| పట్టణ కుటుంబాల సంఖ్య | 43,97,138 |
| పట్టణ నివాస గృహాల సంఖ్య | 39,67,540 |
| రాష్ట్రంలో మొత్తం కుటుంబాల సంఖ్య | 1,70,04,305 |
| రాష్ట్రంలో మొత్తం నివాస గృహాల సంఖ్య | 1,58,98,974 |

లేదా సంపూర్ణంగా ఉపయోగించలేని దుస్థితిలో ఉన్నారని గుర్తించి వారికి ఆ అవకాశాలు కలిగించే మార్గాలు అన్వేషించడం దగ్గర చర్చ ప్రారంభం కావాలి. ఆ అన్వేషణలో అనివార్యమైన పరిష్కారాలు భూయాజమాన్యంలో సమానత్వం సాధించే పంపిణీ. ఆ భూమి సాగుచేసుకోవడానికి ఉపకరించే ఉత్పాదకాలను సరఫరా చేయడం.

ఇంతకూ భూమి తగినంతలేదనేది నిజమైన వాదన కూడ కాదు. రాష్ట్రంలో భూ వినియోగం సక్రమంగా జరగడం లేదు గనుక ఆ వాదనకు ఆస్కారం ఉందిగాని గణాంకాల ఆధారంగానే ఆ వాదనను తిప్పికొట్ట వచ్చు. రాష్ట్రంలో ఉన్న మొత్తం భూమి 6,77,76,921 ఎకరాలు కాగా, అడవులు, వ్యవసాయ యోగ్యంకాని భూములు, వ్యవసాయేతర వినియోగంలో ఉన్న భూములు అన్నీ మినహాయిస్తే కనీసం 4,08,76,931 ఎకరాలు వ్యవసాయానికి వినియోగించుకోవచ్చు. కాని గత అరవై సంవత్సరాల పాలనలో సాగిన వ్యవసాయాభివృద్ధి మొత్తం 2,57,66,395 ఎకరాలను మాత్రమే సాగులోకి తెచ్చింది. అంటే మరొక కోటి యాభై లక్షల ఎకరాలు, కనీసపక్షం ఒక కోటి ఎకరాలు కొత్తగా సాగులోకి తేవడానికి అవకాశం ఉంది. నీటిపారుదల సౌకర్యాలు పెంచడం ద్వారా ప్రస్తుతం సాగవుతున్న నికర భూమిలో రెండవపంటకు అవకాశం కల్పిస్తే గరిష్ఠ వ్యవసాయ యోగ్యమైన భూమి మరొక రెండుకోట్ల ఎకరాలు సమకూరుతుంది. భూమి పంపిణీకి యోగ్యమైన కుటుంబాలు ఇరవై ముప్పై లక్షల కుటుంబాలే గనుక అందరికీ పంపిణీ చేయడానికి తగినంత భూమి తప్పనిసరిగా ఉంటుంది.

ఒకవేళ ఆ అదనపు భూమిని సంపాదించలేకపోయినా, భూగరిష్ఠ పరిమితి చట్టాలను సక్రమంగా అమలుచేసినా, భూస్వాముల అక్రమ అధీనంలో ఉన్న ప్రభుత్వ, దేవాదాయ, ఉమ్మడి భూములను స్వాధీనం చేసుకున్నా, ప్రభుత్వాలు తమ ఆశ్రితులకు అక్రమంగా అప్పగించిన లక్షలాది ఎకరాలను తిరిగి స్వాధీనం చేసుకున్నా భూ పంపిణీకి, భూమిలేని నిరుపేదలకు ఇవ్వడానికి తగిన భూములు లక్షలాది ఎకరాలు లభ్యమవుతాయి. అట్లాగే వ్యవసాయేతర వృత్తి, ఉద్యోగాలలో, ఆదాయ వనరులతో ఉన్న కుటుంబాల చేతుల్లో ఉన్న వ్యవసాయ భూములను స్వాధీనం చేసుకుని ఆ భూమిని పూర్తిగా వ్యవసాయం మీద ఆధారపడేవారికే పంపిణీ చేయడం కూడ సాధ్యమే.

ఇక పట్టణ భూముల విషయానికి వస్తే ఇక్కడ ప్రధానంగా భూమి అవసరమైనది గృహవసతి కోసం. అంటే గ్రామీణ భూములకన్న భిన్నంగా ఇక్కడ తక్కువ భూమితోనే ఎక్కువమందికి ప్రయోజనం కలిగించవచ్చు. పట్టణాలలో ఎకరాల లెక్కలు మారిపోయి గజాలకు ప్రాధాన్యం వచ్చిన తర్వాత ప్రతి కుటుంబమూ ఆశ్రయం కోసం, వంద, రెండువందల గజాల భూమినైనా కోరుకుంటోంది. పట్టణాలలో గృహవసతి విషయంలో ఇప్పుడు అమలవుతున్న అవ్యవస్థను చూస్తే అటువంటి గృహవసతిని, లేదా భూమిని కల్పించడం ప్రభుత్వ బాధ్యత. బహుళజాతి సంస్థలకు, సంపన్నులకు అవసరం లేకపోయినా వందల, వేల ఎకరాలు కట్టబెడుతున్న పాలకుల పైననే ఆ బాధ్యత ఉంది.

ప్రభుత్వరంగంలో గృహనిర్మాణం లేకపోవడం ఒకవైపు, ఉన్న అతితక్కువ సందర్భాలలో కూడ అది పాలకపార్టీల ఆశ్రితులకు, పైరవీకారులకు మాత్రమే దక్కడం మరొకవైపు జరుగుతున్నాయి. ఒకప్పటి లాగ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ అల్పాదాయ వర్గాలకోసం ఇళ్లు కట్టించి ఇవ్వకపోయినా, సొంతంగా ఇల్లు కట్టుకోదలచినా పెరుగుతున్న రియల్ ఎస్టేట్ ధరల వల్ల పేద వర్గాలకు, మధ్యతరగతి వర్గాలకు పట్టణాలలో గృహవసతి కోసం భూమి కావాలనే తపన పెరిగింది. పేద వర్గాలు ఎక్కడో ఒకచోట అతి దుర్భరమైన పరిస్థితుల్లో నైనా మురికి కాలువల పక్కనో, కొండవాలులోనో, రహదారుల పక్కనో గుడిసెలు వేసుకోగలుగుతున్నారు. పట్టణాలలో మురికివాడల జనాభా పెరుగుతున్నదని ప్రభుత్వ గణాంకాలు గూడ ఈ విషయాన్ని చూపుతున్నాయి. కాని, అల్పాదాయ మధ్యతరగతి గృహవసతి కోసం పడుతున్న తపన అరణ్య రోదనగా మిగిలిపోతోంది.

ఈ పరిస్థితుల్లో స్పెషల్ ఎకనామిక్ జోన్స్ కూడ వచ్చి హైదరాబాద్ నగరంలోనే బహుళ జాతి సంస్థల కోసం, సంపన్నుల కోసం వేలాది ఎకరాల ప్రభుత్వ భూమి కట్టబెట్టిన తర్వాత ప్రజలు తమ భూ దాహాన్ని బహిరంగంగా ప్రకటించక తప్పలేదు.

అంటే ఇవ్వాళ భారత సమాజంలో, తెలుగు సమాజంలో రైతులు మాత్రమే కాక ప్రతి ఒక్కరు అటు బహుళజాతి సంస్థల నుంచి, అధికార వర్గం నుంచి, ఎన్నారైలనుంచి మధ్యతరగతి ఉద్యోగుల దాకా, సేవా వృత్తులు చేస్తున్న పేదవారి దాకా ప్రతి ఒక్కరికీ భూదాహం ఉంది. ఈ భూదాహంలో కింది స్థాయి, భూమిలేని నిరుపేదలలో, దళితులలో, చిన్నరైతులలో, అల్పాదాయ మధ్యతరగతిలో వ్యక్తమౌతున్న భూ దాహం న్యాయమైనది, అర్థవంతమైనది. సమాజంలో తమకు రావాల్సిన వాటా అడుగుతూ సాగుతున్నది. కాని, పైస్థాయిలో పెద్దరైతులలో, భూస్వాములలో, పారిశ్రామికవేత్తలలో, అధికార వర్గంలో వ్యక్తమౌతున్న భూదాహం అక్రమమైనది, అన్యాయమైనది. సామాజికంగా విధ్వంసకరమైనది. ఇవ్వాళ కావాల్సింది కిందిస్థాయి భూదాహాన్ని తీర్చే భూసంస్కరణలు, భూ పంపిణీ. పై స్థాయికి అడ్డుకట్ట వేసే గరిష్ఠ పరిమితి చట్టాలు ఎప్పటినుంచో ఉన్నాయి. వాటిని కచ్చితంగా అమలు చేయవలసి ఉంది.

కింది స్థాయి భూదాహాన్ని తీర్చే భూసంస్కరణలను, భూ పంపిణీని అమలు చేయడం ప్రస్తుత పాలక వర్గాలు అధికారంలో ఉన్నంతవరకు సాధ్యం కాదు. ప్రదర్శన వస్తువుగా ఆ పాలక వర్గాలే రాసుకున్న చట్టాలను అమలు చేయమని డిమాండ్ చేస్తూ పోరాటాలు చేపడుతూనే దీర్ఘకాలికంగా నిజమైన పరిష్కారాలు ప్రచారం చేసే పని కూడ చేయాలి. వ్యవస్థ మార్పుతో మాత్రమే నిజమైన భూసంస్కరణలు అమలవుతాయని, వ్యవస్థ మార్పు కోసం ప్రజల సంఘటిత, చైతన్యయుత, విశాల పోరాటం తప్ప మరొక మార్గం లేదని ప్రచారం చేయాలి. ◆

**అణుయుద్ధాలు, అంటువ్యాధుల కన్నా మద్యపానమే ఒక మహమ్మారిగా మానవాళి పతనానికి కారణమవుతుందని అంటున్నారు కె. నవజ్యోతి**

# రాష్ట్రాన్ని మద్యాంధ్రప్రదేశ్‌గా మార్చే బెల్టు షాపులు

ఆంధ్రప్రదేశ్‌లో ప్రపంచబ్యాంకు నిర్దేశిత ఆర్థిక సంస్కరణలు 1990 నుంచి మొదలయ్యాయి. ప్రపంచబ్యాంకు అప్పులే కాకుండా, సామ్రాజ్యవాద సంస్కృతి కూడా దేశంలోకి దిగుమతి అయింది. ఈ పరిణామదశలో 1993లో మద్యపానానికి వ్యతిరేకంగా మన రాష్ట్రంలో మహోద్యమం జరిగింది. సోకాల్డ్ నాగరికత, విద్యలకు దూరంగా ఉండే నిరక్షరాస్యులైన గ్రామీణ స్త్రీల నాయకత్వంలో పోటెత్తిన ఈ ఉద్యమం ప్రజల మద్దతుతో ప్రభుత్వాల్ని కదిలించింది. ఫలితంగా మద్యనిషేధం అమలయింది.

1994లో ఎన్టీఆర్ అధికారానికి రాగానే మద్యనిషేధం చట్టం అమలు చేశారు. వెన్నుపోటు రాజకీయంతో రంగప్రవేశం చేసి అధికారపీఠం అధిష్టించిన జామాత చంద్రబాబు మద్యనిషేధ స్ఫూర్తికి వెన్నుపోటు పొడిచి, ఆరునెలల్లోనే మద్యం అమ్మకాలకు నడుంబిగించటం జరిగింది. ప్రపంచబ్యాంకు విధానాలు అమలు జరిపే సిఇఒ గా పేరుపడ్డ చంద్రబాబు మద్యం అమ్మకాలు పెంచేదిశగా కదిలి, కొత్త మార్గాలు అన్వేషించి అమలు జరపడమయింది. ఫలితంగా 1995లో 951 కోట్లుగా ఉన్న ఎక్సైజ్ రాబడి క్రమంగా పెరుగుతూ, 2004 లో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చే సమయానికి వార్షికాదాయం 3,200 కోట్ల రూపాయలకు పెరిగింది.

నేటి ముఖ్యమంత్రి వై.ఎస్. 2003లో జరిపిన పాదయాత్ర, వీధి మిటింగ్‌లలో 'మద్యం తాగి ఎన్నో కుటుంబాలు నాశనమౌతున్నాయని' వగపోయారు. తాము అధికారంలోకి వస్తే మద్యపానాన్ని నియంత్రించి, రాష్ట్రంలో దశల వారిగా మద్యనిషేధం అమలు చేస్తామని కాంగ్రెస్ పార్టీ 'ఎన్నికల ప్రణాళిక'లో స్పష్టంగా పేర్కొంది. అందుకు పొంగిపోయిన ప్రజానీకం, ముఖ్యంగా గ్రామీణ మహిళలు అధిక సంఖ్యలో ఉత్సాహంగా మద్దతు ప్రకటించారు. మద్యపానం పట్ల వ్యతిరేక విధానం ప్రకటించి అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్, మద్యం అమ్మకాలు నియంత్రించే మాట అటుంచి, ప్రభుత్వమే మద్యం మాఫియాను తలపించేట్లు ప్రవర్తించింది. రాష్ట్రంలో మొత్తం 6,500 లైసెన్సు షాపులున్నాయి. ఇవికాక 1,135 లైసెన్స్‌డ్ బార్ అండ్ రెస్టారెంట్లు ఉండగా, 10,000 పైగా లైసెన్స్ లేని ధాబాలు, రెస్టారెంట్లలో మద్యం అమ్మకాలు అనధికారికంగా జరుగుతున్నాయి. 1,50,000 బెల్టుషాపులు గ్రామాలలో అనధికారికంగా నిర్వహిస్తున్నందు వలన రాష్ట్ర ఎక్సైజ్ ఆదాయం విపరీతంగా పెరిగి ఏడువేల కోట్ల రూపాయలకు చేరింది.

వేల గ్రామాల్లో నాటుసారాని నియంత్రించి, చీప్‌లిక్కర్ అమ్మకాలను పెంచటమే తన విధానంగా పెట్టుకున్న ప్రభుత్వం, బ్రాందీ షాపు యజమానులతో కుమ్మకై, ప్రభుత్వ సారా అమ్మకాలను ప్రోత్సహిస్తూ, జనాలు తాగుబోతులుగా మారేందుకు దోహదపడుతోంది. ఎక్సైజ్ ఆదాయం కోట్లకు కోట్లు అవినీతి వలయాలకు కూడ కేంద్రబిందువుగా మారుతున్న నేపథ్యంలో, నిజాయితీగా, ప్రజాపరంగా దేశక్షేమం కోరే వారు కొన్ని ప్రశ్నలు వేసుకోవాలి.

మద్యపానం మనకి అవసరమా? తాగుడు సంస్కృతిని ప్రభుత్వం ఎందుకు ప్రోత్సహిస్తోంది? మద్యాన్ని ఆదాయవనరుగా భావించే దృక్పథం సరైందేనా? ప్రజల ఓట్లతో ఎన్నికైన ప్రభుత్వాలు ప్రజాసంక్షేమం మరచి మద్యపానాన్ని ప్రోత్సహించవచ్చా? ఎక్సైజ్ ఉద్యోగులకు టార్గెట్‌లు విధించి, పచ్చని పల్లెల్లో చిచ్చు పెట్టే మద్యం అమ్మకాలు ప్రోత్సహించటం నైతికంగా సరైన చర్యేనా? కూడు, గూడు, గుడ్డకు పూచీ ఇవ్వాల్సిన ప్రభుత్వం ఆ పని మాని మారుమూల పల్లెల్లో సైతం మద్యం అమ్మకాలు ప్రోత్సహించడం ఏంటి?

ఈ ప్రశ్నల్లోనే మనకు జవాబులు తడతాయి. ఎందరో ప్రముఖులు మద్యపానం వల్ల కలిగే అనర్థాల్ని గురించి చెప్పారు.

భవిష్యత్తులో అణుయుద్ధాలు, అంటువ్యాధుల వలన మానవ మరణాలు సంభవించవు. దిగజారిన నైతికవిలువల వల్లనే మరణాలు సంభవిస్తాయి. భారతదేశంలో జాతిపిత గౌరవాన్ని పొందిన గాంధీ మద్యనిషేధం కోసం ఎంతగా కృషి చేసిందీ తెల్సిన ఈ ప్రభుత్వాలు ఆయన ఆశయాల్ని పక్కకు పెడుతున్నాయి. గాంధీపేరిట బ్రాందీ షాపులు వెలుస్తున్న కాలమిది. దేశంలో అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు, పార్లమెంట్ కంటే కూడా అత్యున్నతమైన భారత రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు ప్రభుత్వాలకు శిరోధార్యాలు. రాజ్యాంగంలోని 47వ అధికరణం మద్యనిషేధాన్ని చేపట్టటం ప్రభుత్వాల బాధ్యతగా పేర్కొని ఆరు దశాబ్దాలు గడిచినా అమలుకు నోచుకోక పోవటం శోచనీయం.

రోడ్డు ప్రమాదాలు జరిగి ప్రాణాలు గాలిలో కలవటానికి మద్యపానం ప్రధాన కారణం. మద్యపానం మనిషి సంస్కారాన్ని దెబ్బతీసి,

విచ్చలవిడితనానికి, వ్యభిచారానికి ఆలంబన అవుతుంది. పేద కార్మికులు ఎందరో వారి రెక్కల కష్టాన్ని భార్యాపిల్లల కడుపు నింపేందుకు కాకుండా మద్యానికై తగలేస్తున్నారు. ఒక్కో పేదవాడూ వందరూపాయలు మద్యం కోసం తగలేస్తే అందులో డెబ్బైరూపాయలు ప్రభుత్వ ఖజానాకు చేరుతున్నాయి. అంతేకాకుండా సమాజసంక్షేమం కోసం చేసే అనేక చట్టాలు మద్యపానం వల్ల అమలుకావటం లేదనేది వాస్తవం.

గృహహింసకు వ్యతిరేకంగా మహిళలు ఉద్యమించినందువలన ప్రభుత్వం స్త్రీలకు మేలు చేయాలని గృహహింస చట్టం తెచ్చింది. తాగుడును నిషేధించకుండా ఇది అమలవుతుందా? తాగి వచ్చి భార్యలను హింసించే భర్తలు మన పల్లెల్లో కోకొల్లలు. బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన, నిరక్షరాస్యత నిర్మూలన కూడ మద్యపానం వల్ల నీరుగారుతున్నాయి. బాధ్యతలేని తండ్రులు మద్యానికి బానిసలై పిల్లల్ని నిర్లక్ష్యం చేయడమే కాక, వారి రెక్కల కష్టంపై బతికే దౌర్భాగ్య స్థితులు కూడా ఉన్నాయి. తాగుడుకు బానిసైన తండ్రులు నిర్లక్ష్యం చేయడంతో ఆడపిల్లలు వ్యభిచార కూపం పాలవుతున్న ఎన్నో సంఘటనలు సమాజంలో ఘనకు కనబడుతున్నాయి. ఇక ఎయిడ్స్ మహమ్మారిని పారదోలాలంటూ కండోమ్‌ల అమ్మకాలు పెంచేందుకు ప్రోత్సహించే ప్రభుత్వానికి మద్యపానం వల్లనే అదుపు తప్పిన మనుషులు నైతిక విలువలకు తిలోదకమిచ్చి, వ్యభిచారానికి పాల్పడుతున్నారనే విషయం తెలియదా. మద్యం మత్తులో వావివరసలు, వయసు తారతమ్యం కూడా తెలియని స్థితిలో బలత్కారాలకు పాల్పడుతున్న విషయం వార్తపత్రికలలో చూస్తూనే ఉన్నాం. పైగా వ్యభిచారానికి పాల్పడే సమయంలో మద్యం మత్తులో ఉండే వారికి కండోమ్ వాడాలనే విచక్షణ కూడా ఉండదు.

ఇక పల్లె పట్టున మద్యపానం వల్ల జరిగే అక్రమాలు అనంతంగా సాగుతుండటంతో పల్లెలు కన్నీరు కారుస్తున్నాయి. భార్యాపిల్లల్ని కొట్టడం, మద్యం పోయించిన వారి కొమ్ముగాసి దౌర్జన్యాలకు తలపడటం నిత్యకృత్యాలయ్యాయి. ఫ్యాక్షనిస్టుల ఏలుబడిలో అనేక మంది మద్య వ్యసనపరులు ఉండటం వల్లనే వారి ఫ్యాక్షన్ దౌర్జన్యాలు చెల్లుబాటు అవుతున్నాయనేది అందరికీ తెలిసిన సత్యం. మిగతా నేరాల్లో కూడ మద్యపానం సేవించిన బంధుమిత్రులే నేరగాళ్లకు బాసటగా ఉండటం చూస్తున్నాం. మొత్తం మీద నేరాలకు, మద్యపానానికి అవినాభావ సంబంధం ఉంది.

అవన్నీ ప్రభుత్వానికి, పెద్దలకు, మీడియాకూ తెలిసిన విషయాలు కావా. అన్నీ తెలిసి కూడా మద్యనిషేధం అమలు జరపకుండా కనీసం వర్తమానంలో ఉన్న ఎక్సైజ్ చట్టాల్ని కూడా అతిక్రమించి, వీధి వీధికి, హైవే హోటళ్లలో, చివరకు టీ బంకుల్లో కూడ ప్రజలకు ఇరవై నాలుగు గంటలూ మద్యాన్ని అందుబాటులోకి తెస్తూ, 'ప్రజల వద్దకు పాలన'కు బదులు 'ప్రజల వద్దకు మందు' అనేట్లుగా 'మద్యాంధ్రప్రదేశ్'గా మార్చే పద్ధతిలో పాలన సాగుతోంది. డ్వాక్రా మహిళలకు 0.25 పైసల వడ్డీని ఇస్తామని చెప్తున్నది. పల్లెలలో మహిళల పొదుపు మగవారి మద్యపానం వలన 'చిల్లికుండలో నీళ్లు' చందంగా మారింది.

ప్రపంచబ్యాంకు ప్రయోగశాలగా మారిన ఆంధ్రప్రదేశ్‌లో సంక్షేమ రంగాలన్నింటిని ప్రైవేట్ పరం చేస్తున్నారు. 'గుడ్‌గవర్నెన్స్' పేరిట ప్రభుత్వ (ఉద్యోగుల) పాత్ర తగ్గించి వేస్తూ 'డౌన్ సైజింగ్ ది గవర్నమెంట్' అన్న చంద్రబాబునాయుడి విధానాలనే కాంగ్రెస్ ప్రభుత్వం సైతం నెత్తికెత్తుకుని అదే పంథాను మరింత విస్తృతంగా అమలు చేస్తోంది. ప్రజల సొమ్ముతో నిర్మించిన విద్యుత్ రంగం మొదలు అనేక ప్రభుత్వరంగ సంస్థల్ని ప్రైవేటీకరించి, ఆర్టీసిని కూడా ముక్కలు చేసి అమ్మేందుకు సమకట్టింది. విద్యా, వైద్య రంగాలను ప్రైవేటీకరించి పేదలకు చదువు, ఆరోగ్యం అందుబాటులో లేకుండా చేస్తున్నది. ప్రజల భూమిని కార్పొరేట్, బహుళజాతి విదేశీ కంపెనీలకు ధారాదత్తం చేస్తోంది. ప్రపంచబ్యాంక్ అప్పులకు వ్యతిరేకంగా మాట్లాడిన వై.ఎస్. ఇప్పుడు మరింతగా అప్పులు చేస్తూ ఉన్నారు. ప్రపంచబ్యాంకుకు లాభాలు చేకూర్చే షరతులకు లోబడి యాభై శాతం ఖర్చుపెడుతూ, యాభై శాతం సొమ్ము కాంట్రాక్టర్లు, ప్రజా ప్రతినిధులకు దోసి పెడుతున్నారు. ఇన్నీ చేస్తూ చిన్నచిన్న ఉద్యోగులను అవినీతి పరులుగా చిత్రీకరిస్తూ ప్రచారం చేస్తూ కేసులు పెడుతున్నారు. అవినీతి రూపం అర్థం కావాలంటే హైదరాబాద్‌లోని ప్రశాసన్‌నగర్‌లోని ఐఎఎస్ అధికారుల ఇళ్లు చూస్తే తెలుస్తుంది. కోట్లు ఖరీదు చేసే ఇళ్లు వీరి జీతంలోంచి ఏర్పరచుకోవటం సాధ్యమా? సాధారణ ఉద్యోగి రిటైరయ్యే నాటికి చిన్న గూడు ఏర్పరచుకోగలిగే అవకాశం ఉందా.

ఇలాంటి పరిస్థితుల్లో ఉద్యోగులు ప్రజాపరంగా ఆలోచించాలి. తాగుడుకు బానిసలుగా మారుతూ, అన్యాయాన్ని ప్రశ్నించే చైతన్యం కోల్పోయి మొద్దుబారుతున్న విద్యార్థి, యువత మెదళ్లను తట్టిలేపే బాధ్యతను చైతన్యవంతంగా ఉపాధ్యాయులు, ఉద్యోగులు మాత్రమే నిర్వహించగలరు. ఆరోగ్య కార్యకర్తలు, గ్రామ సేవకులు, గ్రామాధికార్లు, విడిఒలు, రెవెన్యూ సిబ్బంది సోషల్ వెల్ఫేర్ శాఖ ఉద్యోగులు, కవులు, కళాకారులు, రచయితలు,.. ఇలా అందరూ గ్రామాల్లో సారా – బెల్టు షాపుల ఎత్తివేతపై అంతిమంగా మద్యనిషేధం అమలుకు వెన్నుదన్నుగా నిలిచి, అశేష ప్రజానీకం సంక్షేమానికి ఐక్యంగా కృషి చెయ్యాల్సి ఉంది. ప్రపంచంలో ఎక్కడయినా, ఏకాలంలోనయిన, చరిత్ర గతిని మార్చేది, సామాజిక మార్పు తెచ్చేది విద్యార్థి యువతదే నిర్ణాయక పాత్ర. దురలవాట్లు – దురాచారాలలేని నవసమాజాన్ని మనమే నిర్మించుకోవాలి.

**కేశానుపల్లిలో మద్యం ఖర్చు అక్షరాలా లక్షలు**

- కేవలం 3500 మంది జనాభా నివసిస్తున్న గుంటూరు జిల్లా, కేశానుపల్లిలో 60 శాతం మంది వ్యవసాయ కూలీలు.
- గ్రామ ప్రధాన జీవనాధారం వ్యవసాయం కాగా క్వారీలు కూడ కరువులో ఆదుకుంటున్నాయి.
- పంచాయితీకి పన్నులు, గ్రాంటుల రూపేణా సంవత్సరానికి రు. 5.68 లక్షలు ఆదాయం లభిస్తుంది.
- ఇంటిపన్నుల రూపేణా కేవలం రు. 13 వేలు మాత్రమే చెల్లిస్తున్న గ్రామీణులు మద్యానికి మాత్రం లక్షల రూపాయలు తగలేస్తున్నారు.
- ఇక్కడ ప్రజలు తాగటానికి రక్షిత మంచినీరు లేదు.
- కానీ వీధికొక బెల్టుషాపు మాత్రం ఏర్పాటు చేశారు.
- మొత్తం 5 బెల్టు షాపులు నడిపేవారు. కొంతమంది వ్యాపారులు ఏకంగా బెల్టుషాపుల కోసం ప్రత్యేకమైన గదులను కూడా నిర్మించారు.
- ఇక్కడ రోజుకు సుమారు ఆరువేల రూపాయల మద్యం అమ్మకాలు (సగటున) జరుగుతున్నట్లు లెక్కల ద్వారా తెలుస్తోంది.
- అంటే ఊళ్లో నెలకు 1.80 లక్షల రూపాయలు మద్యం కోసం గ్రామస్తులు ఖర్చు చేసేవారు.

◆

ఆర్థిక, సామాజిక రంగాలలో మనకు సరిపడని విదేశీ విధానాలను సమ్మిళితవృద్ధి పేరిట అరువు తెచ్చుకోవడమే అభివృద్ధిగా పాలకులు చెబుతున్నారని అంటున్నారు **వి. చలపతిరావు**

# సమ్మిళితవృద్ధి అంటే ఏమిటి?

సమ్మిళిత వృద్ధి లేదా సమ్మిళిత ఆర్థికాభివృద్ధి కోసం కృషి చేస్తాం. ఆ విధంగానే వార్షిక బడ్జెట్లను తయారు చేస్తాం, పదకొండవ పంచ వర్ష ప్రణాళికను ఆ దిశలో తయారు చేస్తున్నాం' అని మన పాలకులు ముఖ్యంగా ఆర్థిక మంత్రి చిదంబరం, ప్రణాళికాకర్తలు చెప్పుతున్నారు. అసలు ఈ సమ్మిళితవృద్ధి (ఇన్‌క్లూజివ్ గ్రోత్) అంటే ఏమిటి? ఇది గతంలో మన దేశంలో అయిదు దశాబ్దాల నుండి జరుగుతున్న ప్రణాళిక బద్ధమయిన ఆర్థికాభివృద్ధి విధానంకన్న భిన్నమైనదా? 1991లో మన దేశంలో ప్రవేశపెట్టి నడుస్తున్న ఆర్థిక సంస్కరణలకు ఈ సమ్మిళితవృద్ధి విధానాన్ని జోడించి అమలు చేస్తారా?

మన దేశంలో నెహ్రూ హయాంలో మొదటి మూడు నాలుగు పంచవర్ష ప్రణాళికల కాలంలో అమలుపరిచిన కమ్యూనిటి డెవలప్‌మెంట్ ప్రోగ్రాంను అమెరికానుండి అరువు తెచ్చుకున్నాం. పంచవర్ష ప్రణాళికల విధానాన్ని రష్యా నుండి అరువు తెచ్చుకున్నాం, ప్రపంచ బ్యాంకు, డబ్ల్యూ.టి.ఒ. ప్రతిపాదిత ఆర్థిక సంస్కరణల ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ విధానాలను అమెరికా యూరప్ దేశాల కూటముల నుండి అరువు తెచ్చుకొని అమలు చేస్తున్నాం. ఇంకా కొద్దిగా ముందుకుపోయి వేలాది హెక్టార్ల సారవంతమయిన వ్యవసాయ భూములను ప్రభుత్వం సేకరించి బంగారు పళ్లెంలో పెట్టి టాటా బిర్లాలలాంటి బడా వ్యాపరస్తులకు సెజ్‌ల రూపంలో అందజేసే కార్యక్రమాన్ని పక్కనున్న చైనా నుండి నేర్చుకుంటున్నాం. ఈ ఇంక్లూజివ్ గ్రోత్ విధానాన్ని ఎక్కడ చూసాం, దీని పునాదులెక్కడ?

మనం రాజకీయ స్వాతంత్ర్యాన్ని స్వదేశీ విధానాల ద్వారా పోరాటం జరిపి జాతిపిత నాయకత్వాన సంపాదించుకున్నాం, కాని మన ఆర్థిక స్వాతంత్ర్యం కోసం మాత్రం పైన పేర్కొన్నట్లు విదేశీ విధానాలకై వెంపర్లాడటం జరుగుతోంది. విదేశీ పెట్టుబడుల కోసం, విదేశీ టెక్నాలజి కోసం ఎదురుచూడటం అలవాటయింది. ఇలాంటి ధోరణి 1990 తర్వాత ఆర్థిక సంస్కరణలు మొదలయిన తర్వాత ఎక్కువ అయింది. అంతకు పూర్వం స్థానిక పరిశ్రమలను ఆధునీకరించటానికి కావలసిన కొత్త యంత్రాలనూ, ఆటోమేషన్ యంత్రాలనూ దిగుమతి చేసుకోవటం ప్రారంభించారు. ముఖ్యంగా ప్రైవేట్ సెక్టార్‌లోని పరిశ్రమలు తమ ఉత్పత్తి పెంచుకోడానికి సదరు నవీన యంత్రసామాగ్రిని ఎక్కువగా దిగుమతి చేసికొన్నాయి. ప్రభుత్వం అప్పటివరకు ఉన్న కొద్దిపాటి విదేశిమారక ద్రవ్యనిల్వలను సదరు యంత్రాలను దిగుమతి చేసుకోవటానికి కేటాయించి ఖర్చు చేసింది. సదరు విదేశిమారక ద్రవ్య నిల్వలు ఎక్కువగా వ్యవసాయ రంగం ప్రోదిచేసినవే. ఎందుకంటే అప్పటి వరకే హరిత విప్లవం సాధించి, గోధుమలు, వరి, పత్తి వగైరా వ్యవసాయోత్పత్తులు ద్విగుణీకృతమయి, కొన్ని ఉత్పత్తులను ఎగుమతి చేయటం జరిగింది. అలా ఏర్పడ్డ విదేశి మారక ద్రవ్యనిల్వలు ఇటు ఆధునిక యంత్రాలను దిగుమతి చేసుకోవటానికి అటు అత్యవసరమైన ముడి సరుకును దిగుమతి చేసుకోవటానికి పూర్తిగా వినియోగమై 1990 ప్రాంతంలో విదేశి మారక ద్రవ్య ఉపద్రవం ఏర్పడింది. పెట్రోల్, డీజిల్ లాంటి సరకుల దిగుమతి చేసుకోవటానికి అప్పటి ప్రభుత్వం బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండ్‌లోని మన దేశపు బంగారు నిల్వలను అంతర్జాతీయ విపణిలో అమ్మవలసి వచ్చిన సంగతి అందరూ ఎరిగినదే. ఈ విషయం ప్రసక్తి ఎందుకు చేయవలసి వచ్చిందంటే దేశంలోని పారిశ్రామిక రంగం ఆనాడైనా ఈనాడైనా తమ దిగుమతులకు దామాషాలో ఎగుమతులు చేసి విదేశీ మారకద్రవ్య నిల్వలను పెంచలేకపోతున్నాం. కాని గోధుమలు, బాసుమతి బియ్యం, పత్తి, మిర్చి, మేలుజాతి పప్పు ధాన్యాలను ఎగుమతి చేయగలిగే వ్యవసాయరంగాన్ని ఆర్థిక సంస్కరణల హవాలో పూర్తిగా ఉపేక్షిస్తున్నారు. పైగా తగ్గిన వ్యవసాయోత్పత్తులకు గిట్టుబాటు ధరలు ఇప్పించే ధ్యాస కూడ ప్రభుత్వానికి లేకుండా పోయింది.

కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రోగ్రాంలో ప్రారంభమయి విజయవంతంగా నడిచి రైతులను అధిక దిగుబడులు సాధించే వైపు జాగృతపరచిన వ్యవసాయ విస్తణాధికార్ల వ్యవస్థను పూర్తిగా రద్దుచేశారు. పైగా వ్యాపారస్తులు రైతులకు నాశిరకం విత్తనాలు, పురుగు మందులు, రసాయన ఎరువులు అమ్మినా ప్రభుత్వం పట్టించుకోదు. ఇన్ని మోసాలకు లోనయిన తర్వాత పండినపంటకు కనీస మద్దతుధర ఇవ్వక వ్యాపారస్తులు రైతులను దోపిడీ చేసినా మార్కెట్ అధికార్లు పట్టించుకోరు. దీనివలననె ఒకవైపు వ్యాపారస్తులు చేసే మోసాలకు పంట దిగుబడులు పడిపోయి, ఇంకొకవైపు పండిన పంటకు గిట్టుబాటు ధరలు రాక రైతులు అప్పుల పాలయి ఆత్మహత్యలకు నిత్యం గురవుతున్నారు. ఆత్మహత్యలు గత ఆరు ఏడు ఏళ్ల నుంచి ఆగిన దాఖలాలు లేవు.

### ధరలు ఎందుకు పెరిగాయి?

గత దశాబ్దం నుండి క్రమంగా వ్యవసాయరంగంలో ప్రభుత్వ పెట్టుబడులు తగ్గిపోయాయి. వ్యవస్థీకృత రుణ సదుపాయాలు కనీసం ఇరవై శాతం కూడ రైతులకు లభించటంలేదు. అదే సమయంలో పబ్లిక్ రంగ బ్యాంకులు, ప్రైవేట్ రంగ బ్యాంకులు ఉత్సాహంగా పరిశ్రమల

అధిపతులకు పెద్ద వ్యాపారస్తులకు, ముఖ్యంగా రియల్ ఎస్టేట్ వ్యాపారులకు పెద్ద ఎత్తున రుణ సదుపాయం కలిగించాయి. ఒకవైపు వ్యవసాయోత్పత్తులు తగ్గిపోయి ఆహారభద్రత తగ్గిన పరిస్థితులలో, రియల్ ఎస్టేట్‌లాంటి రంగాలలో అనుత్పాదక పెట్టుబడుల రూపంలో వేలాదికోట్ల రూపాయిల ద్రవ్య చలామణి జరిగింది. మార్కెట్‌లో ఎక్కువ మొత్తంలో చలామణిలో ఉన్న డబ్బు తక్కువ మొత్తంలో ఉన్న వినియోగ వస్తువులను వెంబడించటంలో ధరలు పెరిగి బీద మధ్యతరగతి ప్రజలను బాధిస్తున్నాయి. ఈ పరిస్థితిలో ప్రజలు తిరగబడి ముంబాయి మున్సిపల్ ఎన్నికలలో, పంజాబ్, ఉత్తరాంచల్ లాంటి రాష్ట్రాలలో జరిగిన జనరల్ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులను ఓడించారు. అప్పుడు కేంద్రంలో, రాష్ట్రాలలో ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వాల దిమ్మతిరిగి, ఆర్థిక రంగంలో వృద్ధిరేటు లేదా జి.డి.పి. ప్రధానమైన అభివృద్ధియే కాక 'సమ్మిళితవృద్ధి' కోసం కృషి చేస్తాం అని అభివృద్ధిపాటలో కొత్తబాణిని అందుకున్నారు. అభివృద్ధి బాటలో కొత్త పుంతను దొక్కటానికి ఉద్యుక్తులయ్యారు. దానికి ఈ ఘనమైన పాలకులు 'సమ్మిళితవృద్ధి' అని నామకరణం చేశారు. సమ్మిళితవృద్ధి అంటే ఈ పాలకుల ఉద్దేశ్యంలో బడ్జెట్లలో పదకొండవ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ రంగం, సాంఘిక సంక్షేమ రంగం, విద్య వైద్య రంగాలకు, బాలల సంక్షేమ రంగాలవంటి రంగాలకు ఎక్కువ కేటాయింపులు చేశామని ఆర్థిక మంత్రి ప్రకటించారు. సదరు రంగాలకు 15 నుండి 20 శాతం నిధులకే కేంద్ర బడ్జెట్‌లో కేటాయించినమాట వాస్తవం. విద్య, వైద్యగంగాలకు అదనపు నిధుల కోసం 2 నుండి 3 శాతం సెస్స్ విధింపు కూడ ప్రకటించారు. ఈ అదనపు నిధుల కేటాయింపుతోనే కేంద్ర ప్రభుత్వం ఆశిస్తున్న సమ్మిళితవృద్ధి సాధించగలుగుతుందా అన్నది ప్రశ్న.

## ద్రవ్యోల్బణం నియంత్రించగలిగారా?

ప్రజల ఆందోళనవలన, పార్లమెంట్‌లో ప్రజాప్రతినిధుల వత్తిడి వలన, ముఖ్యంగా కాంగ్రెస్ ఓటు బ్యాంకులు బీటలువారి పంజాబ్, ఉత్తరాంచల్ రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు అధికారం కోల్పోయి నందున కేంద్ర ఆర్థిక మంత్రి 6.5 శాతం వరకు పెరిగిన ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయడానికి రిపోరేట్‌ను పెంచమని, సి.ఆర్.ఆర్. రేట్లు రెండుసార్లు పెంచమని రిజర్వ్ బ్యాంకుకు ఆదేశాలు జారీ చేశారు. సదరు రేట్లు పెంచగానే సుమారు 40 వేల కోట్ల రూపాయలు వ్యాపార బ్యాంకులు, ఇచ్చే రుణాల ద్వారా మార్కెట్లో చలామణి అయ్యే ద్రవ్యాన్ని రిజర్వ్ బ్యాంకులో డిపాజిట్ చేయనయినది. దానివలన హోల్‌సేల్ మార్కెట్ రేట్లు కొంతవరకు తగ్గినట్లు వార్తలు వచ్చాయి. కాని రిటైల్‌మార్కెట్‌లో కూరగాయలు, తిండి గింజలు, నూనెల రేట్లు మాత్రం తగ్గలేదు. ఆంధ్రప్రదేశ్‌లో అక్రమ తిండిగింజల నిల్వలపై విజిలెన్స్ దాడులు జరిపి లక్షలాది టన్నుల తిండిగింజల నిల్వలను వెలికి తీసినప్పటికీ, రిటైల్‌మార్కెట్‌లో ధరలు తగ్గలేదు. దానికి కారణం అధికార పార్టీల ఎం.ఎల్.ఎ.లు సదరు అక్రమ నిలువదారులతో కుమ్మక్కయి వారిపైన సరి అయిన చట్టబద్ధ చర్యలు తీసుకోకపోవడం. సిమెంట్ ఉత్పత్తిదారులయితే ఏకంగా ప్రభుత్వ ఆదేశాలను ఖాతరు చేయక బడ్జెట్‌లో ప్రతిపాదించిన ఎక్సైజు సుంకం అడ్డు పెట్టుకొని సిమెంట్ ధరలు బస్తా ధర రు. 170 ఉన్న దానిని రు. 210 నుండి 240 వరకు పెంచారు. ప్రభుత్వం ఎంత చెప్పినా వినక పెంచిన ధరలకే విక్రయిస్తున్నారు. ఈ విషయంలో ప్రస్తుత ప్రభుత్వాల పస ఏమిటో తెలుస్తోంది. దీనిని బట్టి అటు కేంద్ర ప్రభుత్వానికి గానీ ఇటు రాష్ట్ర ప్రభుత్వానికి గానీ, అత్యవసర వినిమయ వస్తువుల ధరల నియంత్రణలో గానీ, పారిశ్రామికోత్పత్తుల ధరల నియంత్రణలోగానీ తగిన శక్తి ఉన్నట్టు లేదు. ఈ పరిస్థితులలో పదకొండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో లేదా వచ్చే ఒకటి రెండు సంవత్సరాలలో బడ్జెట్ కేటాయింపులు మాత్రం వ్యవసాయ, గ్రామీణ, సంక్షేమ రంగాలకు ఎక్కువ చేసి, 'సమ్మిళితవృద్ధి'ని సాధిస్తామంటే నమ్మశక్యంగా లేదు.

## బడ్జెట్ల ఆమోదాల తీరు

ఇటీవల ముఖ్యంగా 2004లో కాంగ్రెస్ ప్రభుత్వాలు కేంద్రంలో, రాష్ట్రంలో అధికారంలోకి వచ్చిన తర్వాత, ద్రవ్య బిల్లుల పద్దులపై వాటి కేటాయింపుల పై అర్థవంతమైన చర్చలు జరగటం లేదు. అసలు బడ్జెట్లపై ఎలాంటి చర్చలు జరుగక చివరకు గెలిటన్ పద్ధతిలో బడ్జెట్లు ఆమోదిస్తున్నారు. ఏ పద్దుపై ఎంత కేటాయింపు జరిగింది ద్రవ్య బిల్లు ప్రవేశపెట్టినప్పుడు పత్రికలలో చూడటమే కాని తర్వాత ఫైనల్‌గా ఏ పద్దుపై ఎంత కేటాయింపు చేశారో సరైన సమాచారం ప్రజలకు ఉండటం లేదు. సంబంధిత మంత్రులకు కార్యదర్శులకు ఈ విషయంలో సరైన సమాచారం ఉందో లేదో తెలియదు. ఈ విషయంలో ప్రభుత్వ శాఖలలో కొంత గందరగోళముంది. ప్రభుత్వ యంత్రాంగంలో అవినీతి కిందిస్థాయి నుండి పైదాకా పేరుకపోయి ఉంది. అభివృద్ధికి సంబంధించిన నిధులు చాలా దుర్వినియోగమవుతున్నవని కాగ్ తన నివేదికలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఎన్నోసార్లు హెచ్చరించింది. అభివృద్ధికి కేటాయించిన నిధులు దుర్వినియోగమవుతున్నట్లు రోజూ పత్రికలలో వార్తలు వస్తున్నవి. మంత్రులు, సెక్రటరీలు, డైరక్టర్లు ఇతర ఉన్నతోద్యోగు లు ఎవరూ పర్యవేక్షణలు చేయరు. కింది స్థాయిలో ఏం జరుగుతోంది పట్టించుకోరు. పైనుండి చాలా స్కాంలలో ఉన్నతోద్యోగులు కూడ కుమ్మక్కవుతున్నట్లు అభియోగాలు ఉన్నాయి. కేంద్ర ప్రభుత్వం విద్య అభివృద్ధికి 2 శాతం సెస్సుల రూపంలో కొన్ని వేల కోట్ల రూపాయలు వసూలు చేసి, సర్వశిక్ష అభియాన్‌లాంటి స్కీంల కింద రాష్ట్రాలకు కేటాయిస్తే, అట్టి నిధులను, సరసాదేవి, సుబ్రమణ్యం లాంటి వారు కాజేస్తుంటే ఇక ప్రభుత్వం చెప్పే 'ఇంక్లూజివ్ గ్రోత్' ఎలా సాధ్యమవు తుందన్నదే ప్రశ్న. ◆

**వచ్చే సంచికలో...**

- **ఫోకస్ - ఆదివాసి ప్రాంతాలలో పాలన, సంక్షేమం**
- **స్వల్పకాలిక ఉపకార వేతనాల నివేదికలు ప్రారంభం**
- **అరవైఏళ్ల కింద గద్వాల సంస్థానంలో ఆర్థిక జీవన సర్వే**

ప్రభుత్వ వివక్షాపూరిత సాగునీటి విధానాలు, హరిత విప్లవం కొనితెచ్చిన ప్రాంతీయ అసమానతలే తెలంగాణలో వ్యవసాయ సంక్షోభానికి కారణాలని అంటున్నారు **ఎం. కోదండరాం, కె. సీతారామరావు**

# తెలంగాణ సాగునీటికి సూక్ష్మ సేద్యమే పరిష్కారమా?

1956లో సమైక్యాంధ్ర రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత సాగునీటిరంగంలో తెలంగాణ జల వనరులు సమగ్ర దోపిడికిలోనైనాయి. గత ఐదు దశాబ్దాల కాలంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాలు సాగునీటి రంగంలో అవలంబించిన వివక్షాపూరితమైన విధానాల ఫలితమే తెలంగాణలో నేటి వ్యవసాయ సంక్షోభం. తెలంగాణ జల వనరుల చౌర్యానికవసరమైన వివక్షాపూరిత విధానాల రూపకల్పన, పథక రచన సమైక్యాంధ్ర రాష్ట్రంలో నిరంతరంగా కొనసాగుతునే ఉన్నది. ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వం కొనసాగిస్తున్న 'జలయజ్ఞం' దానిలోని ప్రధాన పథకాలైన పోలవరం, పులిచింతల ప్రాజెక్టులు, పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ సామర్థ్యం పెంచడం, దుమ్ముగూడెం-నాగార్జున సాగర్ లింక్ కాలువ పథకం ఇవన్నీ తెలంగాణ నీటి వనరుల మళ్లింపుకు జలయజ్ఞం పేరుతో ప్రభుత్వం వేసిన సాగునీటి పథకాలు. ఈ మధ్యకాలంలో జారీచేసిన సూక్ష్మ సేద్యానికి సంబంధించిన జి.వొ 34 కూడా ఈరకమైన వివక్షాపూరితమైన విధానాల కొనసాగింపుకు తాజా ఉదాహరణ. ఇట్లాంటి వివక్షాపూరిత సాగునీటి విధానాల వల్ల ఆంధ్రప్రదేశ్ సాగునీటి రంగంలో ఏర్పడ్డ ప్రాంతీయ అసమానతలు కొనసాగి స్థిరీకరింపబడే ప్రమాదం కనబడుతున్నది. ఈ కింద పేర్కొన్న గణాంక వివరాలను పరిశీలిస్తే తెలంగాణకు సాగునీటి రంగంలో జరిగిన అన్యాయం, వివక్షతతో పాటు తెలంగాణ ప్రాంతంలో వ్యవసాయరంగానికున్న సాగునీటి వనరుల ప్రస్తుత స్థితిగతులు తెలుస్తాయి. కృష్ణా, గోదావరీ నదుల పరీవాహక ప్రాంతాల విస్తీర్ణం తెలంగాణలో 68, 79 శాతాలైతే కోస్తాంధ్రలో 31, 21 శాతం. కాని ఈ రెండు నదుల్లోంచి తనకు న్యాయంగా దక్కాల్సిన వాటా దక్కకపోవడమే కాక, కనీసం 15 శాతం నీటిని కూడా తన సాగునీటి అవసరాలకు వాడుకొనె పరిస్థితి ఈనాడు తెలంగాణా ప్రాంతానికి లేదు. ప్రణాళికా వ్యయంలో అత్యధిక భాగం కోస్తాంధ్ర సాగునీటి రంగ అభివృద్ధికి మళ్లించడంవల్ల ఈ ప్రాంతంలో కాలువల కింద సాగుభూమి 1960-61, 2000-01 (అంటే 40 సంవత్సరాల కాలంలో) మధ్యకాలంలో 20 శాతం పెరిగింది. ఇదే కాలంలో మొత్తం సాగుభూమి 29.09 లక్షల హెక్టార్ల నుండి 45.28 లక్షల హెక్టార్లకు పెరిగింది. ప్రభుత్వ పెట్టుబడితో ప్రాజెక్టులను ఆధునీకరించి, ఆయకట్టును స్థిరీకరించారు. 2004-05 సంవత్సరం నాటికి ప్రాజెక్ట్ కాలువల కింద ఉన్న సాగుభూమిలో 83 శాతం కోస్తాంధ్రలోనే ఉంది. 1960లలో కృష్ణా, గోదావరి డెల్టాల్లో ప్రవేశపెట్టిన హరిత విప్లవం ప్రాంతీయ అసమానతలకు దారితీస్తుందనీ, తెలంగాణ వ్యవసాయాభి వృద్ధికి ప్రత్యేక విధానాలను రూపొందించాలనీ, ఇక్కడ పండే పంటల అభివృద్ధికి ప్రత్యేక పరిశోధనా సంస్థ స్థాపించాలనీ ప్రతిపాదించిన తెలంగాణ రీజినల్ కమిటీ సూచనలు ప్రభుత్వ చెవికి వినిపించలేదు. అంతేగాక తెలంగాణలో చెరువులు పూర్తిగా నిర్లక్ష్యానికి గురయ్యాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం సాగునీటికై చేసిన బడ్జెట్ కేటాయింపుల్లో 10 శాతం మాత్రమే చిన్న నీటిపారుదల వ్యవస్థపై ఖర్చు చేసారు. కాని తెలంగాణలో మైనర్ ఇరిగేషన్ ప్రధానమైన సాగునీటి వ్యవస్థ అంటే, ఇక్కడది 'మేజర్ ఇరిగేషన్' అన్నమాట. చెరువుల నిర్వహణ సరిగా లేక వీటికింద ఉన్న సాగుభూమి 1960-61 నుండి 2000-01 మధ్యకాలంలో 11.51 లక్షల హెక్టార్ల నుండి 7.26 లక్షల హెక్టార్లకు, ఆ తర్వాత 2004-05 నాటికి మరింత తగ్గి కేవలం 4.77 లక్షల హెక్టార్లకు చేరుకున్నది. ఈ పరిస్థితుల్లో తెలంగాణలో బావుల (ఓపెన్ అండ్ బోర్) కింద సేద్యం పెరిగింది. ప్రస్తుతం తెలంగాణలో మొత్తం సాగునీటి సౌకర్యం గల భూమిలో 70-80 శాతం బావుల కిందనే సేద్యమవుతున్నది. 1980 దశకంలో బావుల, బోర్ల సంఖ్య పెరగడంతో పాటు అవి వాడే విద్యుచ్ఛక్తి వినియోగం కూడా బాగా పెరిగింది. రాష్ట్రంలో ఉన్న మొత్తం బావుల్లో 62 శాతం, బోర్లలో 64 శాతం తెలంగాణ ప్రాంతంలోనే ఉన్నాయి. 1994-95, 2000-01 మధ్యకాలంలో కొత్తగా తవ్విన బావులు, బోర్లలో 73 శాతం తెలంగాణ ప్రాంతంలోనే వచ్చాయి. భూగర్భ జలాల స్థాయిని నిలిపి ఉంచే ఉపరితల జలవనరులైన చెరువులు క్షీణించడం వల్ల, వర్షాభావ పరిస్థితుల మూలంగా బోర్లు, బావులు ఎండిపోయినవి. రైతుల పెట్టుబడి వృథా అయి ఎందరో రైతులు బలవన్మరణాల పాలయినారు. ఈ విధంగా ప్రభుత్వ వివక్షాపూరిత సాగునీటి విధానాల వల్ల తెలంగాణలో వ్యవసాయ సంక్షోభం పెరిగి తీవ్రస్థాయికి చేరుకొన్నది.

## 2

1996 నుండి మళ్లీ అస్తిత్వంలోని కొచ్చిన తెలంగాణ ఉద్యమం ఫలితంగా, అన్ని వర్గాల ప్రజల్లో తెలంగాణ-వాదం పెంచిన చైతన్యం మూలంగా సోయికొచ్చిన తెలంగాణ ఇంజనీర్లు ఈ ప్రాంత జలవనరుల రక్షణకు, వినియోగానికి ఎన్నో పథకాలు రూపొందించి ప్రభుత్వానికి ప్రతిపాదనలుగా పంపించినారు. తెలంగాణలో రావాల్సిన సాగునీటి ప్రాజెక్టులన్నీ భారీ ఎత్తిపోతల పథకాలే. ఈ ఎత్తిపోతల పథకాల నిర్మాణానికయ్యే ఖర్చు తగ్గించే ఎన్నో అనుసరణీయమైన సూచనలు, ఎత్తిపోతల దూరాన్ని తగ్గించి బ్యాలన్సింగ్ రిజ్వాయర్లతో గ్రావిటీ ద్వారా చేరుకోగల్గిన ప్రాంతాలకు సాగునీరందించడం వంటి పథకాలు తెలంగాణ ఇంజనీర్లు రూపొందించారు. జల విద్యుదుత్పత్తి అవసరమైన చోట నీరు కిందికి పోయి వృథా కాకుండా ప్రత్యేకంగా రివర్సిబుల్ టర్బైన్స్ రూపొందించడలో తెలంగాణ ఇంజనీర్ల కృషి ఎంతో శ్లాఘనీయం. ఈ విధంగా ఒకపక్క తెలంగాణ ప్రజల్లో పెరుగుతున్న చైతన్యం, మరోపక్క సాంకేతికంగా తోసివుచ్చలేని విధంగా తెలంగాణ ఇంజనీర్లు రూపొందించిన ప్రత్యామ్నాయ సాగునీటి పథకాలు ప్రభుత్వ వివక్షపూరిత సాగునీటి విధానాన్ని క్రమంగా ఇరుకున పెట్టే పరిస్థితి ఏర్పడింది. ఈక్రమంలోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలంగాణ జల వనరుల చౌర్యానికి మరిన్ని నూతన మార్గాంతరాలు వెదికే ప్రయత్నం మొదలుపెట్టింది. దానిలో భాగమే కాంగ్రెస్ ప్రభుత్వం అమలుచేయదలిచిన 'జలయజ్ఞం' కార్యక్రమం. ఈ 'జలయజ్ఞం'లోని తాజా పథకం సూక్ష్మ సేద్యం, దానికి సంబంధించినదే జి.వొ. నెం.34. దీని ప్రాథమిక లక్ష్యం బిందు, తుంపర సేద్యాల ద్వారా నీటిని పొదుపుచేసి తద్వారా మరింత భూమిని సాగులోకి తేవడం. కాని ఈ ఉత్తర్వును ఎక్కడ, ఎప్పుడు, ఎలా అమలుచేస్తారనదే అంతుపట్టని సమస్య. తెలంగాణ ఎత్తిపోతల పథకాల నీటి కేటాయింపుల్లో కోత విధించడమే ఈ జి.వొ. 34 లక్ష్యమని ఈ ప్రాంత ఇంజనీర్లు, విద్యావంతులు సందేహిస్తున్నారు. ఈ సందేహానికి ఆధారాలు ఎన్నో చూపెట్టవచ్చు. తాజాగా పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ సామర్థ్యాన్ని పెంచే ప్రభుత్వం నిర్ణయమే దీనికి తిరుగులేని నిదర్శనం. ఈ పూర్వరంగంలో జి.వొ.34 కు సంబంధించిన వాస్తవాలను విశ్లేషించే ప్రయత్నం చేద్దాం.

## 3

జి.వొ నెం.34 తెలంగాణ సాగునీటి రంగానికి మనం ఊహించని భారీ నష్టాన్ని కలిగించగలదు. ఈ ఏడాది ఫిబ్రవరి 9న వచ్చిన ఈ జి.వొ లోని రెండవ సెక్షన్ ప్రకారం రాష్ట్రంలోని అన్ని భారీ ఎత్తిపోతల పథకాల కింద బిందు, తుంపర వంటి సూక్ష్మ సేద్యాన్ని ప్రవేశపెడతారు. అందుకని భారీ ఎత్తిపోతల కింద పిల్ల కాలువలను, పంట కాలువలను తవ్వ వద్దని ఈ జి.వొ ద్వారా ప్రభుత్వం ఆదేశించింది. ఈ మధ్యలో జి.వొ.34ను సవరించిన ప్రభుత్వం పిల్ల కాలువలు తవ్వుతామని వాగ్దానం చేసింది. దీనివల్ల జి.వొ. స్వభావంలోగానీ, తెలంగాణ సాగునీటి రంగానికి అది కలిగించే నష్టంలోగానీ ఫరక్ పడేదేమిలేదు.

బిందు, తుంపర సేద్యం వంటి సూక్ష్మ సేద్యం కోసం ప్రతి 10-15 ఎకరాలకు ఒక సంప్ నిర్మిస్తారు. ఈ సంపు లేదా హౌజ్ నిర్మించాలను కోవడం వెనుక ఒక చిన్న కథ ఉన్నది. మొదట అధికారులు కాలువల నుండి నీళ్లను మోటర్ల ద్వారా ఎత్తి పైపుల ద్వారా ఇవ్వాలనుకున్నారు. ఈ వ్యవస్థను ప్రయోగాత్మకంగా నల్గొండలోని ఒక గ్రామంలో ఏర్పాటుచేసి దాని పనితీరును పరిశీలించాలనుకున్నారు. సూక్ష్మ సేద్య వ్యవస్థ ఏర్పాట్లు చేయదానికి ఆ గ్రామానికి వెళ్లిన అధికారులతో అక్కడున్న రైతులు కరెంట్ రోజుకు 7 గంటలే వస్తది కద, మరి మిగతా సమయంలో కాలువ ద్వారా వచ్చే నీళ్లను ఏం చేస్తరని అడిగింద్రు. ఇంజనీర్లకు వెంటనే సమాధానం తోచలేదు. రైతులేమో ముక్కు ఎక్కడ అంటే తలకాయ చుట్టు చెయి తిప్పి చూపినట్టు కాలువలతో నీళ్లివ్వకుండ ఈ మోటర్లకూ, పైపులకూ పైనుంచి అదనపు ఖర్చు ఎందుకన్నరు. ఇంజనీర్లు, అధికారులు వాపసు వచ్చి మంత్రులతోని ఈ మాటే చెప్పింద్రు. కానీ సూక్ష్మ సేద్యాన్ని ప్రవేశపెట్టాలని నిర్ణయానికొచ్చిన ప్రభుత్వం కరెంట్ లేనప్పుడు కాలువల్లోకి వచ్చే నీళ్లను ఏం చేయాలో చెప్పమని పెద్ద పెద్ద నిపుణులను పిలిపించింది. వారంతా వచ్చి ఏడుగంటలు మోటార్లు పైపుల ద్వారా తీసుకొనిపోయే నీరు పోగా కాలువల్లో మిగిలిన నీటిని నిలువ ఉంచడానికి ఎన్ని సంపులు కావాల్నో, అవి ఎంతసైజులో ఉండాల్నో లెక్కలుకట్టి చెప్పింద్రు. అగొ ఆట్లొచ్చినయి సంపులు. సంపులు కట్టిన తరువాత ఉద్యానవన శాఖ, బిందు సేద్యం కింద సాగుయోగ్యమైన పంటలను గుర్తించి పత్తి రైతు సాగునీటి అవసరాలను అంచనావేస్తుంది. దానిని బట్టి పైపులను వేసి నీళ్లందిస్తరు.

ఇక్కడ ఒక విషయం చెప్పుకోవాలి బిందు, తుంపర సేద్యంతో అన్ని పంటలు సాగుచేయడం సాధ్యపడదు. ముఖ్యంగా కూరగాయలు పండించడానికీ పండ్ల తోటల పెంపకానికీ, కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో చెరుకు పంటకు, పల్లి పంటకు బిందు, తుంపర సేద్యాలు పనికొస్తయని వ్యవసాయ-నీటిపారుదల నిపుణుల అభిప్రాయం. శాస్త్రీయ సాగునీటి నిర్వహణకు సంబంధించిన పరిశోధనల ఫలితమే బిందు, తుంపర వంటి సూక్ష్మ సేద్య పద్ధతుల ఆవిర్భావం. ఈ పద్ధతులు ఎక్కడ సాధ్యపడుతాయో అక్కడ పెట్టాలని కేంద్ర ప్రభుత్వం జారీచేసిన జల విధానం నిర్దేశిస్తున్నది. నీటి కొరత ఉన్నచోట, పంటపొలాలు సమతలంగా లేనిచోట, నీటి తీపుకం ఉన్న భూముల్లో ఈ సూక్ష్మ సేద్య పద్ధతులు అమలుచేయవచ్చునని నిపుణుల అభిప్రాయం. ఇది చాల ఖర్చుతో కూడుకొన్న వ్యవహారమని కేంద్ర వాటర్ మేనేజ్‌మెంట్ మాన్యువల్ పేర్కొంది. పండ్లు, కూరగాయల తోటలకు ఇదిబాగా ఉపకరిస్తుందని పేర్కొన్నారు. అమెరికావంటి విద్యుత్తు సమృద్ధి దేశంలోనే సూక్ష్మ సేద్యంతో సాగయ్యే భూమి 37.8 శాతమయితే 62.8 శాతం సాంప్రదాయిక సేద్యం కింద ఉన్న భూమి అన్న విషయం మనం గుర్తుచుకోవాలి.

ఈ 34 జి.వొ ప్రకారం సూక్ష్మ సేద్యంలోని మోటార్లు, పైపులు తదితర పరికరాల నిర్వహణకు ప్రత్యేకమైన రైతుమిత్ర గ్రూపులను ఏర్పాటు చేస్తారు. ఈ గ్రూపులు సంపుల నిర్మాణానికి భూమి ఇస్తమనీ, తమ భూమిలో పైపులు వేయదానికి అనుమతిస్తమనీ, పైపులు తదితర సూక్ష్మ సేద్య పరికరాలకయ్యే ఖర్చులో 30 శాతం వాటాధనాన్ని భరిస్తమనీ, పైపులు వేయడానికి శ్రమదానం చేస్తామనీ, పైపులైనుల, హౌజుల

నిర్వహణ బాధ్యత స్వీకరిస్తమనీ, ఆరుతడి పంటలు మాత్రమే వేస్తమనీ, ఈ పథకం అమలుకు అధికారులకు, ప్రజాప్రతినిధులకు సహకరిస్తమనీ ప్రభుత్వానికి రాసివ్వాలి. అట్లా రాసిచ్చిన వారికే సూక్ష్మ సేద్యం కల్పిస్తారు.

పై వివరాలను పరిశీలించినప్పుడు మనం ఇక్కడ మూడు విషయాలను గమనించవచ్చు. మొట్టమొదటగా తెలిసేదేమిటంటే ఈ సూక్ష్మ సేద్యం ప్రధానంగా తెలంగాణలోనే ఎక్కువగా అమలులోకి రాబోతున్నదనే వాస్తవం. ఎందుకంటే తెలంగాణలో వచ్చేవన్నీ ఎత్తిపోతల పథకాలే. నిజామాబాద్ జిల్లాకు సాగునీరందించడానికి నిర్మిస్తున్న గుత్ప, అలీసాగర్, కరీంనగర్, మెదక్, రంగారెడ్డి జిల్లాకు నీరందించే ప్రాణహిత – చెవెళ్ల లింకు ప్రాజెక్ట్, నల్గొండకు నీరివ్వడానికి పూర్తి కాబోతున్న ఎలిమినేటి మాధవరెడ్డి ప్రాజెక్ట్, మహబూబ్‌నగర్ జిల్లాకు కృష్ణా నీటిని మళ్లించే భీమా, నెట్టెంపాడు, కల్వకుర్తి, కోయిల్‌సాగర్ ప్రాజెక్టులు – ఈ రకంగా తెలంగాణలో నిర్మాణమవుతున్న ప్రాజెక్టులన్నీ ఎత్తిపోతల పథకాలే. సూక్ష్మ సేద్యంలో వ్యవసాయ–నీటిపారుదల నిపుణల అంచనా ప్రకారం ఒక టి.ఎం.సి. నీటితో పదిహేను వేల ఎకరాల పైనే సాగవుతుంది. అందువలన తక్కువ నీటితో ఎక్కువ సాగుచూపించి మిగతా నీటిని రాయలసీమకు, ఆంధ్రకు మలుపుకొని పోవచ్చుననేది ఆంధ్ర వలసపాలకుల రహస్య ఎజండా. ఇది జివొ 34 జారీచేయడం వెనుక నున్న ప్రభుత్వ అసలు ఉద్దేశం, కుటిలనీతి. రెండో విషయమేమిటంటే సూక్ష్మ సేద్యం చాలా ఖర్చుతో కూడుకొన్న పని. జి.వొ. 34 ప్రకారమే సూక్ష్మ సేద్యానికి కావలసిన మోటార్లను, పైపులను కొనడానికి ఎకరాకు రు. 15,000 ఖర్చు వస్తుంది. సంపుల నిర్మాణానికయ్యే ఖర్చు కలిపితే ఈ మొత్తం ఇంకా పెరుగుతుంది. కాలువల నిర్మాణానికైతే ఇందులో పదోవంతు అంటే రు. 1300 మాత్రమే ఖర్చు వస్తది. దీనితో పోలిస్తే బిందు, తుంపర సేద్యానికయ్యే ఖర్చు ఐదింతలు ఎక్కువ. అంతేకాదు అందువలన నిర్మాణం ఆలస్యం కావచ్చు. ఇప్పటికే తెలంగాణ ప్రాజెక్టుల విషయంలో ప్రభుత్వం నిర్లక్ష్య వైఖరిని ప్రదర్శిస్తున్నది. సరిగ్గా కేటాయింపులు చేయదు. ఇప్పుడు కొత్తగ సూక్ష్మ సేద్యాన్ని తెచ్చి ఖర్చు పెంచితే కేటాయింపులు జరుగక మరింత ఆలస్యం కావచ్చు. ఇక మూడవ విషయమేమిటంటే సూక్ష్మ సేద్యం ఫలితంగా రైతు పైన మోయలేని భారం పడుతది. పైపులు, ఇతర పరికరాల కొనుగోలుకయ్యే ఖర్చులో 30 శాతం భరించడమే కాక నిర్వహణ బాధ్యత రైతుదే. ఆపైన కరెంట్ బిల్లుల మోత, అవి రైతులే కట్టుకోవాలి. ఇంత ఖర్చు పెట్టడమే కాదు సూక్ష్మ సేద్యం కింద సాగయ్యే పంటలకయ్యే అధిక పెట్టుబడి రైతు పెట్టుకొక తప్పదు. ఇప్పటికే మనరాష్ట్రంలో సాగునీటి రంగంలో ప్రాంతాల మధ్య తీవ్రమైన అసమానతలున్నాయి. తీరాంధ్రలో ప్రభుత్వమే తన ఖర్చుతో సాగునీటి సౌకర్యాన్ని కల్పిస్తే తెలంగాణ రైతులు తమ ఖర్చుతో బావులు తవ్వుకొంటున్నారు, బోర్లు వేసుకొంటున్నారు. జి.వొ 34 వలన ఈ అసమానతలు శాశ్వతంగా స్థిరీకరింపబడి, వ్యవస్థితమవుతయి. బలవంతంగా బిందు, తుంపర సేద్యాన్ని ప్రవేశపెట్టి ప్రభుత్వం రైతుల వీపుల మీద కొండంత భారాన్ని మోపనున్నది. ఇటు సాగునీటికయ్యే ఖర్చు, అటు దానితో సాగయ్యే వాణిజ్య పంటలకయ్యే పెట్టుబడి భారాన్ని తట్టుకోలేక చిన్న, సన్న రైతులు తమ భూమిని అమ్ముకొనే పరిస్థితి రావచ్చు. నీటిని వృథా చేయకుండా శాస్త్రీయంగా వినియోగించడమే ఈ జి.వొ లక్ష్యమయితే సూక్ష్మ సేద్య ప్రయోగాలు చేయవల్సింది తెలంగాణలో కాదు. ఒక టి.ఎం.సి. నీటిని ఆరువేల ఎకరాలకు తీరాంధ్రలో, ఒక టి.యం.సి. నీటిని 3800 ఎకరాలకు వాడనున్న పోలవరం ఆయకట్టులో ఈ సూక్ష్మ సేద్య పద్ధతులు ప్రయోగాత్మకంగా అమలుచేస్తే పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణమే అనవసరం. పుష్కరం తాటిపూడి వంటి పోతల పథకాల ద్వారా ఆ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేయవచ్చు కద! తెలంగాణకెందుకీ సూక్ష్మ సేద్యం పీడ!

సూక్ష్మ సేద్యం పేరుతో ప్రభుత్వం తెలంగాణకు కృష్ణా, గోదావరి జలాల్లో రావాల్సిన న్యాయమైన వాటాను రాకుండా చేస్తున్న కుట్రకు మరో పేరే జి.వొ 34. కాబట్టి ఈ కుట్రను వ్యతిరేకించాల్సిందే. నిశ్శబ్దంగా జరుగుతున్న ఈ కుట్రవల్ల తెలంగాణ పరీవాహక ప్రాంతంలో ప్రవహిస్తున్న కృష్ణా–గోదావరి నదీ జలాల్లో తెలంగాణ రైతులకు న్యాయంగా రావాల్సిన వాటాను కోల్పోవడమే కాకుండా, వచ్చే కొద్దిపాటి నీటిని పొందడానికి కూడ రైతు మరింత పెట్టుబడి పెట్టవలసి ఉంటుంది. కాలువలతో నీటిని తెచ్చి చెరువులను నింపితే అటు వ్యవసాయానికి ఇటు పశుపోషణకూ, చేపల పెంపకానికీ అవకాశం ఉంటది. భూగర్భ జలాల స్థాయి ఎప్పటికీ అందుబాటులో ఉంటది. బతుకు దెరువు దొరుకుతది. బతుకమ్మ నిలబడతది. అట్ల జరుగకుంటే సూక్ష్మ సేద్యం భారాన్ని మోయలేక తెలంగాణలోని చిన్న–సన్నకారు రైతులు తమ భూములమ్ముకొనే ప్రమాదం త్వరలోనే రాబోతున్నది. ఈ భూమిని స్వంతం చేసుకొవడానికి కాంట్రాక్టర్లు, అగ్రిబిజినెస్ కంపెనీలు సిద్ధంగా ఉన్నాయి. ఆ భూమిని కొని పెద్ద వ్యవసాయ కమతాలుగా మార్చి పండ్లు, కూరగాయలు పండించి హెరిటేజ్ కంపెనీ దుకాణాల ద్వారాకానీ, ఇతర గుత్త సంస్థల దుకాణాల ద్వారాకానీ లాభాసాటిగా అమ్మి పైసలు సంపాదించవచ్చునని ఆంధ్ర వలస పాలకులు ఆశపడుతున్నరు. రాజశేఖర్‌రెడ్డి ప్రభుత్వం జలయజ్ఞం పేరుతో తెలంగాణ జలవనరుల చౌర్యానికవసరమైన విధి–విధానాలు, పథకాలు రూపొందిస్తే, వీటి ఫలితంగా తెలంగాణ చిన్న, సన్నకారు రైతులు నిండ మునిగి భూమలమ్ముకుంటే వాటిని కొని కాంట్రాక్ట్ వ్యవసాయం, సూక్ష్మ సేద్యంతోని కూరగాయలు, పండ్లు పండించి తమ హెరిటేజ్ కంపెనీ దుకాండ్లతోని అమ్ముకొని విపరీతంగా లాభపడాలని చంద్రబాబు నాయుడు పథకాలేస్తున్నడు. తెలంగాణను ముంచుట్ల (లోపట లోపట) ఇద్దరిదీ ఒక్కటే మాట, ఒక్కటే బాట.

**4**

శాస్త్రీయ సాగునీటి నిర్వహణ పద్ధతుల్లో భాగంగా వచ్చిన సూక్ష్మ సేద్య పద్ధతులను పనిగట్టుకొని వ్యతిరేకించాల్సిన అవసరమెవ్వరికుండదు. ఏ సాంకేతిక విజ్ఞానమైనా ఆలంబనచేసుకోవడానికీ, అనుసరించడానికీ అవసరం, సందర్భం ఉంటుంది. ఆయా ప్రాంతాల ప్రజల అవసరాలకనుగుణంగా సాంకేతిక విజ్ఞానం తోడ్పడితే సమస్యలేమి రావు. అది ప్రజలకు త్వరలోనే ఆమోదయోగ్యమయి అనుసరణీయమవుతుంది. కాని ప్రజల అవసరాలను పరిగణనలోకి తీసుకోకుండా ఏ సాంకేతిక విజ్ఞానాన్నైనా బలవంతంగా రుద్దడానికి ప్రయత్నిస్తే ప్రజల నుండి వ్యతిరేకత మొదలవుతుంది. తెలంగాణలో సూక్ష్మ సేద్య పద్ధతులను

# కె.ఎల్. మహేంద్ర



ప్రముఖ కమ్యూనిస్టు నేత కె.ఎల్. మహేంద్ర (85) ఆగస్ట్ 12న ఖమ్మం జిల్లా కొత్తగూడెం సింగరేణి ఆసుపత్రిలో అనారోగ్యంతో మరణించారు. ఆయన పూర్తి పేరు ఖుష్ బదన్‌లాల్ మహేంద్ర. ఆయన నవంబర్ 25, 1922లో హైదరాబాద్‌లో జన్మించారు. ఆయన ఉస్మానియా యూనివర్సిటీలో విద్యార్థిగా ఉన్నప్పుడే 'వందేమాతరం' ఉద్యమంలో పాల్గొన్నారు. తరువాత శాంతినికేతన్‌లో బి.ఎ. సైకాలజీ (1939-41) పూర్తిచేశారు. బెంగాల్‌లోని బర్ద్వాన్ జిల్లాలో 1942లో సిపిఐ పార్టీ ట్రేడ్ యూనియన్‌లో క్రియాశీలక బాధ్యతలు చేపట్టారు. 1946లో హైదరాబాద్‌కు తిరిగివచ్చి ఎన్నో ట్రేడ్ యూనియన్లు ఏర్పాటు చేయడమే కాకుండా తెలంగాణ సాయుధ పోరాటంలో పాల్గొన్నారు. ఉద్యమంలో ఉండగానే మహిళా ఉద్యమకారిణి ప్రమీలాతాయిని ప్రేమవివాహం చేసుకున్నారు. నిజాం వ్యతిరేక పోరాటంలో మహేంద్ర నాలుగేళ్లపాటు అజ్ఞాత జీవితం గడిపారు. ఒక ఏడాది జైలు జీవితం అనుభవించారు. సంతానం లేని కె.ఎల్. మహేంద్రకు తోడునీడగా ఉన్న భార్య ప్రమీలాతాయి 1995లో మరణించారు. ఆయన 18 ఏళ్లపాటు ఎ.ఐ.టి.యు.సి. రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. ఇండియన్ మైన్ వర్కర్స్ ఫెడరేషన్, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ రోడ్ ట్రాన్స్‌పోర్ట్‌లకు అధ్యక్షులుగా బాధ్యతలు నిర్వహించారు. ప్రపంచట్రేడ్ యూనియన్‌ల సమాఖ్యకు (2000-2005) అధ్యక్షుడిగా ఉన్నారు. 25 ఏళ్ల నుంచి సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియన్‌కు అధ్యక్షుడుగా చివరి వరకు ఉన్నారు. కార్మికులహక్కుల కోసం అనేక ఉద్యమాలకు రూపకల్పన చేశారు. ఆయన 'ఈవెంట్స్ అండ్ మూవ్‌మెంట్స్', 'రీకలెక్షన్స్ అండ్ రిఫ్లెక్షన్స్' అనే రచనలు చేశారు. ◆

ఎక్కడ, ఎప్పుడు, ఏవిధంగా అమలుచేయాలనే విషయాలపై ప్రభుత్వం నిపుణులచే శాస్త్రీయ అధ్యయనం చేయించే ప్రయత్నమే చేయలేదు. తెలంగాణ రైతుల అనుభవాలను, అభిప్రాయాలను, అవసరాలను పరిగణనలోకి తీసుకొనే ప్రయత్నం కూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయలేదు. వ్యవసాయరంగ ఉత్పత్తి పద్ధతుల్లో వచ్చే మార్పులు సాగులో భాగమైన రైతుల నైపుణ్య అవసరాలకూ, సాంకేతిక విజ్ఞానానికీ, పెట్టుబడికీ ప్రత్యక్ష సంబంధం కలిగి ఉంటాయి. కాబట్టి రైతులు తమ పొలాలను వ్యవసాయ-పర్యావరణ పరిస్థితులకు, సామాజికార్థిక పరిస్థితుల కనుగుణంగా మలుచుకొంటారు. తెలంగాణలో కూడా తరతరాలుగా రైతులు సమర్థవంతంగా చేసిన పని ఇదే. అందుకే తెలంగాణలో ప్రధానమైన సాగునీటి వనరు చెరువు. తెలంగాణ ప్రాంతంలో 'ఊట చెరువులు, గొలుసుకట్టు చెరువులు' వ్యవసాయానికి సాగునీరందించడమే కాకుండా భూగర్భ జలస్థాయిని నిరంతరంగా నిలిపి ఉంచాయి. ప్రస్తుతం తెలంగాణలో చిన్న-సన్నకారు రైతుల వ్యవసాయమంతా బావులు, బోర్లపై ఆధారపడి ఉన్నది. ఈ బావుల, బోర్ల వ్యవసాయానికి కరెంట్ కీలకమై కూర్చున్నది. ఈ బావులకు, బోర్లకు నీరందించే 'జల' భూగర్భ జలస్థాయి మీద ఆధారపడి ఉంటుంది. ఈ భూగర్భ జలస్థాయి ఉపరితల జలవనరులైన చెరువుల నిర్వహణపై ఆధారపడి ఉంటుంది. ఈ విధంగా తెలంగాణలో వ్యవసాయాభివృద్ధికి కీలకమైన చెరువులను విస్మరించి, నిర్లక్ష్యం చేసి, వాటిని నీటితో నింపే ప్రయత్నం చేయక సూక్ష్మ సేద్య పద్ధతులను ప్రవేశపెట్టడం వల్ల ఉపయోగమేమి? నీటి కొరత ఎక్కువగా ఉన్న ఖుష్కీ భూముల వ్యవసాయానికి సూక్ష్మ సేద్య పద్ధతులు ఒక ఐచ్ఛికంగా ఉపయోగపడతాయనడంలో సందేహం లేదు. తెలంగాణలో కూడా పండ్ల తోటల పెంపకానికి ఈ సూక్ష్మ సేద్య పద్ధతులను వాడిన అనుభవం కొంత రైతులకున్నది. సూక్ష్మ సేద్య పద్ధతులను వాటికి సంబంధించిన సాంకేతిక విజ్ఞానాన్ని ఏయే భూముల్లో, ఏయే పంటలకు, ఎప్పుడు వాడుకోవాలనేది రైతులే నిర్ణయించుకోవాలి. ఎంతటి ప్రజాస్వామిక ప్రభుత్వమైనా సూక్ష్మ సేద్య పద్ధతులను ఏకపక్షంగా, బలవంతంగా ఏ ప్రాంతంలోని రైతులపైనా రుద్దడానికి వీల్లేదు. పంటల తీరును, అవసరాలను బట్టి మార్కెట్ పరిస్థితుల కనుగుణంగా సూక్ష్మ సేద్య పద్ధతులను వినియోగించే స్వేచ్ఛ రైతులకుండాలి.

ప్రస్తుతమున్న ప్రపంచీకరణ పరిస్థితుల్లో వ్యవసాయాన్ని కూడా వ్యాపారంలా నిర్వహించాలి నిజమే కాని ఈరోజు తెలంగాణ రైతులు (ప్రధానంగా చిన్న-సన్నకారు రైతులు) చేస్తున్న సేద్యం వ్యాపార - వ్యవసాయం కాదు. వీలైనంత వరకు వ్యవసాయంలో వచ్చే రకరకాల అపాయాలు తగ్గించుకొని, ప్రతికూల పరిస్థితుల్లో కూడ తన కుటుంబ పోషణకవసరమయ్యే ఆదాయాన్ని సంపాదించుకొనే వ్యూహాత్మక వ్యవసాయం చేయాల్సిన పరిస్థితులు తెలంగాణ రైతుల కున్నవి. ఇది తెలంగాణ వ్యవసాయానికి సంబంధించిన అత్యంత కీలకమైన వాస్తవం. ఈ వాస్తవాలను విస్మరించి తెలంగాణ వ్యవసాయాన్ని, పేద రైతుల జీవితాలను ప్రభావితం చేసే అత్యంత కీలక నిర్ణయమైన సూక్ష్మ సేద్య విధానానికి సంబంధించిన జి.వొ. 34ను ప్రభుత్వం ఇంత బాధ్యతా రహితంగా ఎలా జారీ చేసిందనేదే ఆశ్చర్యం కల్గించే విషయం.

ప్రస్తుతమున్న వ్యవసాయం సంక్షోభ పరిస్థితుల్లో తెలంగాణ వ్యవసాయానికి జివో 34లో వివరించిన సూక్ష్మ సేద్య పద్ధతులు ఉపయోగపడవు. దీనికి ప్రత్యామ్నాయంగా 34 జివోను రద్దుచేసి నేల పొరల్లోని తేమను, భూగర్భ జలస్థాయిని నిలిపి ఉంచే చెరువులను కాలువల ద్వారా నింపే కార్యక్రమం చేపట్టాలి. సూక్ష్మ సేద్య పద్ధతులను బలవంతంగా, ఏకపక్షంగా తెలంగాణ రైతులపై రుద్దకూడదు. తాము వేసుకొనే పంటల అవసరాల కనుగుణంగా బిందు, తుంపర సేద్యాన్ని వినియోగించుకొనే స్వేచ్ఛ రైతులకుండాలి. చివరిగా ఒక్కమాట, తెలంగాణ లోని చెరువులను సక్రమంగా పునరుద్ధరించి వాటికి జలకళను ప్రసాదిస్తే రైతులకు సూక్ష్మ సేద్య పద్ధతులను వాడుకునే స్వేచ్ఛ ఇచ్చినట్టే లెక్క ◆

**పాలకుల మతాల ప్రాతిపదికన చారిత్రక యుగ విభజన చేయడం మతతత్వ చరిత్ర రచనా దృక్పథంలోని ప్రధాన లక్షణం అంటున్నారు ఎస్. మహబూబ్ బాషా**

# జాతీయతత్వం ఒళ్లో మతతత్వం కొమర్రాజు రచనల పరిశీలన

*(గత సంచిక తరువాయి)*

భారతదేశ చరిత్రపట్ల జేమ్స్‌మిల్ దృక్పథాన్ని పదిలపరచడం లోనూ, కొనసాగించడంలోనూ సర్ హెన్రీ ఇలియట్ విశేష కృషి చేశాడు. హెయిలీబరీ కళాశాలలో చదివిన ఇలియట్ 'భారత ప్రభుత్వ ఫారెన్ డిపార్ట్‌మెంట్'లో ముఖ్యకార్యదర్శి స్థాయికెదిగాడు. పారశీక (పర్షియన్) భాషను విశేషంగా అధ్యయనం చేసిన ఈయన ఢిల్లీ సుల్తానుల, మొఘలుల కాలం నాటి క్రానికల్స్‌లలో ('చరిత్ర'లు) ఎంపిక చేసిన భాగాలను ఆంగ్లంలోకి తర్జుమా చేయగా, ఆయన మరణానంతరం ఆయనకు ఈ కృషిలో సహాయపడ్డ ప్రొఫెసర్ డౌసన్ సంపాదకత్వంలో 1867-1877 మధ్య పై శీర్షికతో ఎనిమిది సంపుటాల్లో వెలువడిందా చరిత్ర. ఈ చరిత్రకు స్పష్టమైన రాజకీయ అజెండా ఉంది. దాన్ని మొదటి సంపుటానికి ఇలియట్ రాసిన ముందుమాట స్పష్టపరుస్తుంది.

ఈ చరిత్ర వెలుగుచూసే నాటికి 'ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం'గా అంగీకరించబడుతున్న సంఘటనలు (1857) జరిగాయి. బ్రిటిష్ పాలన పునాదులు దాదాపుగా కదిలిపోయేటంత పని అయ్యింది. ఈ చారిత్రక సందర్భంలో తమ వలసపాలనకు చట్టబద్ధతను చేకూర్చుకోవడానికై పాలిత ప్రజల సమ్మతిని తయారు చేయాల్సిన అవసరం ఆంగ్లేయులకు పెరిగింది. కాబట్టి తమ పాలన 'భారతీయుల'కు మేలు చేకూర్చేదని నమ్మించాలి. 1857 సంఘటనలకు 'ముస్లిం'లు ప్రధాన బాధ్యులుగా భావించబడ్డారు కాబట్టి ఇక 'హిందువు'లను మంచి చేసుకోవాలి; హిందువుల్లో ముస్లింలపై ద్వేషభావాన్ని రగల్చాలి. ఈ దుష్టయజ్ఞంలో మధ్యయుగ "ముస్లిం చరిత్ర"ను సమిధగా మార్చారు. అందుకే ఇలియట్ తను సంకలించిన / క్రోడీకరించిన చరిత్రను చదివితే ఎలాంటి భయానక దృశ్యం గోచరిస్తుందో / గోచరించాలో ఇలా సెలవిచ్చాడు :

"... ఈ సంపుటంలో ఉటంకించిన స్వల్ప భాగాలనుంచి గూడ మహమ్మదీయులతో విభేదించినందుకు హిందూవులను ఎట్లా ఊచకోత కోశారో, ఊరేగింపుల మీద, పూజమీద, నైవేద్యాలమీద ఎటువంటి సాధారణ నిషేధాలు విధించారో, ఇతర అసహన చర్యలు అమలు చేశారో విగ్రహాలనెలా ధ్వంసం చేశారో, ఆలయాలను ఎట్లా నేలమట్టం చేశారో, ఎట్లా బలవంతపు మతాంతీకరణలో వివాహాలు చేశారో, జప్తులు, ఆంక్షలు విధించారో, హత్యలు, ఊచకోతలు సాగించారో, ఆ పనులు చేసిన నియంతల మదమార్చల్యాలు, తాగుబోతుతనం ఎంతటివో తెలిసి ఈ దృష్యమంతా అతిశయోక్తి కాదని చూపుతుంది."

డౌసన్, ఎలియట్ ల చరిత్రల్లోని మరో ముఖ్యాంశం 'అనువాద రాజకీయాలు' రాజకీయ అజెండాకనుగుణంగా సాగిన అనువాదంలో పలుచోట్ల మూలాధారాల్లో లేని విషయాలను ఇరికించారు. మూలాధారాల్లో లేని ఇస్లాంను సూచించే పదజాలాన్ని ఉపయోగించడం వల్ల వారు చెప్పిన విషయాలు మతం రంగును పులుముకున్నాయి. రొమిలా థాపర్ మాటల్లో : "ఎలియట్ అండ్ డౌసన్ సంపాదకత్వం వహించిన తుర్కో-పర్షియన్ గాథల అనువాదం మొదట 1867-77లో ప్రచురితమైంది. మూలంలో ఇస్లామిక్ వ్యక్తీకరణలు లేని చోట వాటిని జొప్పించి అక్కడి ప్రకటనలకు లేని మత భావనను కల్పించడం జరిగింది." (రొమిలా థాపర్, సోమనాథా : ది మెనీ వాయిసస్ ఆఫ్ ఎ హిస్టరీ, పెంగ్విన్/వైకింగ్, న్యూఢిల్లీ, 2004, పు. 186). ఉదాహరణకు ఉద్బి తన గ్రంథంలో "అతడు (మహమూద్ గజ్నవి) ప్రతి సంవత్సరమూ ఒకసారి భారతదేశం ('హింద్') మీద దండెత్తాలని నిశ్చయించాడు" అని రాయగా ఇలియట్, డౌసన్‌ల అనువాదంలో అది "సుల్తాన్ (మహమూద్ గజ్నవి) సంవత్సరానికొక్కసారి భారతదేశం ('హింద్') మీద పవిత్రయుద్ధం చేయాలని ప్రతినపూనాడు" అని పూర్తిగా మతం రంగుపులుముకుంది (రొమిలా థాపర్, పు. 207-208). దీనిని బట్టి ఇలియట్, డౌసన్ ల చరిత్రలు ఎంత కుట్రపూరితమైనవో మనకు స్పష్టమవుతోంది.

భారతదేశంలో బ్రిటిష్ రాజ్యస్థాపన అనేది హిందువులను 'ముస్లిం పాలన' యొక్క క్రూరపదఘట్టనల నుండి కాపాడింది కాబట్టి వారు బ్రిటిష్ పాలన ఎంతటి ప్రయోజనకారో గుర్తించాలి ("మన పాలన ఎంత మృదువైనదో, ఎంత సమానమైనదో దాని వల్ల వారికి ఒనగూరనున్న అసంఖ్యాక అవకాశాలు ఎంతటివో మన స్థానిక పాలితులకు అవి తెలియజెప్తాయి. మన పాలన కింద అత్యున్నత స్థాయి వ్యక్తిగత స్వేచ్ఛను, ఓడిపోయిన జాతికి ఎప్పుడు ఏ సందర్భంలోనూ దొరకనని రాజకీయ అవకాశాల అనుభవిస్తున్న వాగాడంబరపు పెద్దలు దేశభక్తి గురించి తమ ప్రస్తుత దుస్థితి గురించి మాట్లాడే మాటలు ఇక వినబడగూడదు. ")ఎలియట్, డౌసన్, 'ఒరిజినల్ ప్రిఫేస్', పు. xxii)

ఎలియట్, డౌసన్‌లు ఆశించినట్లుగా బ్రిటిష్ పరిపాలన 'ప్రయోజనాలు" గుర్తించాడు కాబట్టే హిందూత్వవాదులకు ప్రాతః స్మరణీయుడైన బంకించంద్ర ఛటర్జీ తన 'ఆనందమఠం'లో బ్రిటిష్ వారి

పట్ల విపరీతమైన ఆరాధనాభావాన్ని వ్యక్తం చేసి వారి రాజ్యస్థాపనను సమర్థించాడు. ఇలియట్, డౌసన్‌ల మార్గంలో అడుగు తప్పకుండా పయనించి బెంగాల్ నవాబును "కుల సంపదల రక్షణ విశ్వాస ఘాతకుడూ", "మనష్యుల కళంకుడూ", "కడుపునిండా తాగి పడుకునే" వాడు అని తూలనాడుతూ ఆగ్రహాన్ని వెల్లగక్కాడు. ఈ నవలలోని ఒక పాత్ర అయిన భవనందుడు ఇంకో పాత్ర అయిన మహేంద్ర సింహుడితో "మహమ్మదీయుల పాలనలో ధర్మం జరుగుతుందా? మహమ్మదీయులను పారదోలితేనే ఎప్పటికైనా మనకు ధర్మం నిలుస్తుంది" అంటాడు.

సంతానుల తిరుగుబాటును అణచివేసిన ఆంగ్లేయుల పట్ల వైముఖ్యం ప్రదర్శింపకపోగా సమర్థిస్తాడు బంకించంద్ర. బ్రిటిష్ సైన్యం సంతానులను మట్టుపెట్టగా హతాశుడైన సత్యానందుడు "ఆహా! మాతా! ఉద్ధరణ మార్గం చూపలేకపోయినావు. నీవు తిరిగి మ్లేచ్ఛులపాలిట పడినావా? సంతానుల అపరాధాలను క్షమించమ్మా!... " అని బాధపడుతుండగా 'మహాత్ముడు' (బంకించంద్ర భావజాలం) అతన్ని ఓదార్చుతూ "సత్యానందా! నీవేమీ చింతచెందకు, ఆంగ్లేయుల రాజ్యం వస్తే తప్ప సనాతన ధర్మం ఇక్కడ పునఃస్థాపితం కాదు. ఆంగ్లేయుల రాజ్యం వచ్చినట్లయితే, హిందువులు జ్ఞానవంతులు అవుతారు. అప్పుడు సనాతన ధర్మం తనంతట తాను వికసిస్తుంది... " అంటాడు. "ఆంగ్లేయులను రాజులు చేసేటట్లయితే ఈ హింసా కార్యక్రమంలో మమ్మల్ని ఎందుకు నియుక్తులను చేశావు" అని అడిగిన సత్యానందుడితో 'మహాత్ముడు' "ఆంగ్లేయులు ఇప్పుడు వర్తక వ్యాపారాలలో మునిగి ఉన్నారు. వారికి రాజ్యాకాంక్ష కలిగించడానికే మిమ్ము నియుక్తులను చేశాము. రాజదండం ఆంగ్లేయులకు రావడం కోసం సంతానులు ఇన్నాళ్లూ పనిముట్లుగా ఉండి పోరాడారు... ఆంగ్ల రాజ్యము నీవల్ల స్థాపించబడింది... పృథ్వి సస్యశ్యామలం అవుతుంది. జనానికి [హిందువులకు] ఐశ్వర్యం ఎక్కువ అవుతుంది. ఆంగ్లేయులు మిత్రులు...." అంటాడు. (కమలాసనుడు, *ఆనందమఠం*, జయంతీ పబ్లికేషన్స్, విజయవాడ, 1998). పై ఉల్లేఖనాల్ని బట్టి చూస్తే బంకించంద్ర బ్రిటిష్ రాజ్యస్థాపనను గట్టిగా సమర్థించాడు. హిందూ ధర్మ పునఃస్థాపనకూ, హిందువుల పునరుజ్జీవనానికీ బ్రిటిష్ రాజ్యస్థాపనే శరణ్యమన్నాడు. ముస్లింలను తూలనాడాడు. హెన్రీ ఇలియట్ తదితర వలసవాదులకు కావాల్సింది సరిగ్గా ఇదే!

'ముస్లిం పాలన' అనే తప్పుడు పదబంధాన్ని సృష్టించి, తద్వారా తప్పుడు భావాల్ని ప్రచారం చేసి, దానికి అన్ని రకాల అవలక్షణాలను అంటగట్టారు కాబట్టీ, ముస్లింల పట్ల హిందువుల్లో తీవ్ర వ్యతిరేకతను సృష్టించి, విద్వేషాగ్ని జ్వాలల్ని రగులింపజేయగల *ఎక్స్‌ప్లోజివ్ పొటెన్షియల్* కల కమ్యూనల్ *కంటెంట్* ఉంది కాబట్టీ, శాస్త్రి గారి పరమాశయం కూడా సరిగ్గా ఇదే కాబట్టీ "పాశ్చాత్యులూ", "విదేశీయులూ", "పగవారూ", "శత్రువులూ" అయి ఉండి కూడా ఇలియట్, డౌసన్‌లు శాస్త్రిగారి పరమ మిత్రులయ్యారు : ఉల్లేఖనార్హులయ్యారు. ఇలియట్, డౌసన్ ల పరమలక్ష్యం తెలిసి ఉండి కూడా వాటినే పట్టుకొని ఊగులాడుతున్న శాస్త్రిగారే "మాసికగంతల్ని" కట్టుకున్న "కొద్దిబుద్ధు"లని దీనివల్ల స్పష్టమవుతోంది. తను మాసికగంతల్ని కట్టుకొని ఇతరులను నిందించడం గురువింద రాజకీయాలు కావా? హిందూత్వ "యిజం"లో "యింప్రిజన్" అయిన శాస్త్రి లాంటి వాళ్లకు ఇలియట్, డౌసన్ లు ప్రాతఃస్మరణీయులవడంలో ఆశ్చర్యం లేదు.

చరిత్ర రచనాశాస్త్రం పరిధి విస్తృతమై ఒక అధ్యయన విషయంగా 'చరిత్ర' సుసంపన్నమవుతున్న తరుణంలో రాజకీయ చరిత్రనూ, అందునా దాదాపుగా రాజుల వ్యక్తిగత చరిత్రనూ పట్టుకొని వేళ్లాడడం శాస్త్రిగారిలోని సంకుచిత్వానికి పరమప్రమాణం. రాజకీయ చరిత్రనూ, రాజుల వ్యక్తిగత చరిత్రనూ తిరగదోడ్డం వలన వీరి రాజకీయం పండుతుంది. 'ముస్లిం' రాజుల్లో అన్ని అవలక్షణాలనూ ఆపాదించి, వాటిని సాధారణ ముస్లింల నెత్తిపై రుద్ది వారిని విలిఫై చేయ్యొచ్చు. పాలకుల మధ్య ఉండిన ఘర్షణలను సామాన్యప్రజల దాకా తెచ్చి వారి మధ్య చిచ్చుపెట్టొచ్చు. సామాజిక, ఆర్థిక కోణాలనుండి చారిత్రక పరిశోధన కావించే మార్క్సిస్ట్ మెథడ్ వీరి దుష్ట రాజకీయాల గాలి తీస్తుంది కాబట్టి మార్క్సిస్టు దృక్పథం కల చరిత్రకారులపై చవకబారు వ్యాఖ్యలతో విరుచుకుపడుతున్నారు. శాస్త్రిగారు 'జాతీయ' దృక్పథం ముసుగులో మతతత్వ దృక్పథంతో బూటకపు 'చరిత్ర'ను క్రోడీకరిస్తూ నిప్పులు తొక్కిన కోతిలా చిందులు తొక్కుతుంటే ఇంకో సెల్ఫ్-స్టైల్డ్ అపర జాతీయవాది అయిన అక్కిరాజు రమాపతిరావు "వర్తమాన భారతదేశ చరిత్ర రచయితలలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో ముందుగా చెప్పుకోదగిన వారు శ్రీ ఎం.వి.ఆర్. శాస్త్రిగారు. ఎంతో శ్రమించి సత్యాన్వేషణ తత్పరత్వంతో, గవేషణ ప్రవృత్తితో, అధ్యయన పరతతో, 'అయంనిజఃపరోవా' అనే అభినివేశం ఎంతమాత్రం లేకుండా సత్యసాధన, శోధన నివిష్ట అంతఃకరణంతో, దార్శనిక సమన్వయంతో, పురాతనకాలపు చరిత్రలోను, భారతీయ వర్తమాన చరిత్రాధ్యయన, అధ్యాపనల అవగాహనలోని సంఘర్షణల పాక్షికతలను సరిదిద్దుతూనూ, పురోగమిస్తున్నారు శ్రీ శాస్త్రిగారు"... (హి.మ.పు. xxv) అంటూ ఒక పెద్ద సర్టిఫికేట్ జారీ చేస్తున్నారు.

శాస్త్రి, అక్కిరాజులకూ, వారి లాంటి సెల్ఫ్-స్టైల్డ్ అపర జాతీయ వాదులకూ పి.ఎన్. ఓక్ అనే పరమ గురూజీ ఉన్నారు. ఈయనగారు ఎంత సునిశిత దృష్టికల మేధావంటే ప్రపంచంలోని ప్రతి నాగరికత వెనకా వేదిక మూలాల్ని వెతికి పట్టుకోగలడు. (వరల్డ్ వేదిక్ హెరిటేజ్ : ఎ హిస్టరీ ఆఫ్ హిస్టరీస్, రెండు సంపుటాలు). తాజ్‌మహల్‌ను కట్టించింది మొఘల్ పాదుషా షాజహాన్ కాదనీ, అది ఒక 'టెంపుల్ ప్యాలెస్' అనీ అది ఈయనగారి 'గ్రేటెస్ట్ హిస్టారికల్ డిస్కవరి' అనీ బుకాయించగలడు. (*ది తాజ్‌మహల్ ఇజ్ ఎ టెంపుల్ ప్యాలెస్*: దీన్నే గొప్ప చరిత్రకారులైన శాస్త్రిగారు శుభ్రంగా కాపీకొట్టి 'తాజ్‌మహలా? రాజమహలా?' శీర్షికతో ప్రకటించారు తన *ఏది చరిత్ర?* (పు. 218-231)లో). *ఆగ్రా రెడ్ ఫోర్ట్ ఇజ్ ఎ హిందూ బిల్డింగ్* అని బొంకగలడు. భారత చారిత్రక పరిశోధనలో పెద్ద-పెద్ద తప్పిదాలు జరిగాయని ఆరోపించి లబ-లబ మొత్తుకోగలడు. (సమ్ బ్లండర్స్ ఆఫ్ ఇండియన్ హిస్టారికల్ రిసర్చ్). ఎక్లెటిక్ సూత్రంలో నిబద్ధతతో నమ్మి, ఆచరించిన అక్బర్ గొప్పదనాన్ని తూష్ణీకరించగలడు (హూ సేస్ అక్బర్ వాజ్ గ్రేట్?) జి.డి. సావర్కర్ అనే మరో సాంస్కృతిక ఫాసిస్ట్ ఏసు క్రీస్తు 'హిందువు' అని ప్రకటించేశాడు. (జీసస్ ది క్రైస్ట్ వాజ్ ఎ హిందూ, ఇండియన్ ఫౌండేషన్ ఫర్ వేదిక్ సైన్స్, రొహతక్, హర్యానా, 2003. ఈ పుస్తకానికున్న కవర్ పేజీపై ఉన్న ఐదు జీసస్ చిత్రాల్లో ఒకదానికి

నుదుట పెద్దబొట్టు (తిలక్), ఇంకోదానికి బారైన అడ్డనామాలూ పెట్టారు) ఇంకా డేవిడ్‌ఫ్రాలే (వామన్ పండిట్ అని నామాంతరం కల పెద్ద ఫ్రాడ్ ఇతడు), ఎన్.ఎస్. రాజారాం మొదలైన వారు సింధూ నాగరికతలో గుర్రపు అవశేషాలనూ, 'అంతర్వాహిని' అయిన సరస్వతి నదినీ 'వెదికి పట్టుకుంటు'న్నారు. సింధూ నాగరికతకు 'సింధు-సరస్వతీ నాగరికత' అని పిలుచుకుంటూ ఉబలాటపడుతున్నారు.

ఈ గురు(విండ)వుల అడుగుల మురికి మడుగుల్లో తప్ప(ప్పు) టడగులు వేస్తున్న శిష్యరత్నాలనేకమంది ఉన్నారు. భారతదేశ చరిత్రను స్నిప్పెట్స్‌లో అందజేసే బాధ్యతను మోస్తున్నారు. వారిలో స్వాతి ఒకరు. *చరిత్రలో ఇలా జరిగింది...!* (నవయుగ భారతి ప్రచురణలు, హైదరాబాద్, 1999) అనీ, దాచినా దాగని నిజాలు అనీ అబద్ధాలను శుద్ధమైన సత్యాలుగా నమ్మించ ప్రయత్నిస్తున్నారు. అలాగే 'వెయ్యేళ్ల విదేశీ దాష్టీకం', మధ్యయుగంలో 'స్వాతంత్ర్య పోరాటం' వంటి భావజాలంతో తేరాల సత్యనారాయణ శర్మ అనే ఆయన పలు పుస్తకాలను వెలువరించారు.[20] "దేశ విముక్తి పోరాటములో" అనేది వీటిలో కొన్నింటి కున్న ఉపశీర్షిక. తేరాల వారి 'దేశవిముక్తి పోరాట' భావజాలం విజయ నగర చరిత్రము (క్రీ.శ. 1336-1680) నకు రాసిన 'ప్రస్తావన'లో ఈ విధంగా సాక్షాత్కరిస్తోంది. ఆయన మాటల్లో :

"హిందూ దేశం రెండు పర్యాయములు తమ దేశ స్వాతంత్ర్యం కొరకై ప్రాణములర్పించి దీర్ఘకాలమైన పోరాటములు సాగింపవలసి వచ్చింది. ఒకటి తురుష్కదండయాత్రలు. మరొకటి ఆంగ్లేయ దురాక్రమణలు. ఇవి రెండు ఒకదాని వెంట మరొకటి జరినప్పటికి వందలాది సంవత్సరముల ఈ దేశ జాతి చరిత్ర వీటి కింద అణగారి పోవలసివచ్చినది. ఒకదానికి మత విద్వేషమే, జాతి విద్వేషమే, సంస్కృతి విరోధమే ఆయుధమైనది. సాధు స్వభావులైన దేశవాసులను కొల్లగొట్టి రాజ్యాధికారము సహితము ఆక్రమించి దేశమును బానిసత్వములోకి నెట్టివేసిన యవన దండయాత్రలు అవి... దక్షిణాదిలో జరిగిన విజయనగర రాజ్యనిర్మాణము వల్ల దీనికి అడ్డుకట్ట పడుట చరిత్రలోనే ఒక మైలురాయి. దక్షిణాది నుండి తురుష్కమూకలను తరిమివేసి తమ దేశ స్వాతంత్ర్యము నిలబెట్టుకొనగలిగి మరొక పోరాటమునకు సమాయత్తము గాగలిగిన శక్తిని విజయనగర రాజ్య చరిత్ర జాతికి అందించగలిగినది..."

ఇలా చెప్పుకుంటూ పోతే ఈ హిందూత్వ సైనిక 'మేధావుల' చిట్టా చాలా పెద్దదే ఉంది. ఇదో తరగని కాలకూట విషగని. వీరి ఉద్దేశం చరిత్ర వక్రీకరణ ద్వారా సమాజంలో విద్వేషాగ్ని జ్వాలల్ని రగులింపజేయడం; 'జాతీయత' పేరుతో 'హిందూత్వ'ను ప్రచారం చేయడం; సమాజాన్ని హిందూత్వీకరించి తమ ఫాసిస్టు అజెండాకూ, జెండానూ పాదుకొల్పడం.

పై వివరణ అంతా ఏ దురుద్దేశంతో సుపథ ప్రచురణల వారు కొమర్రాజు వారి పుస్తకాలను పునర్ముద్రించారో తేటతెల్లం చేస్తుంది. తమ దుష్ట రాజకీయ సిద్ధాంతాల పాచికలు పారించుకోవడానికి కొమర్రాజు వారి పుస్తకాలను అప్రాప్రియేట్ చేసుకుంటున్న వీరు *'మహమ్మదీయ మహాయుగము'* కు కొమర్రాజు వారు రాసిన 'పీఠిక'లోని ఈ కింది మాటల్ని గుర్తుంచుకోవాలి.

"ప్రస్తుతము హిందూదేశములో హిందూ ముసల్మానుల సఖ్యతను గురించి చర్చ జరుగుచున్నది. దానిని గురించి మహమ్మదీయ మహాయుగ చరిత్రకారుడనగు నాయభిప్రాయము తెలుపుట యావశ్యకము. పూర్వమొకప్పుడు హిందూ ముసల్మానులు పోరాడుచుండిరి గనుక వారెప్పుడును స్నేహితులు కానేరనుట లోకానుభవము లేనివారు చెప్పవలసిన మాట... ముసల్మానులీ దేశవాసులయినందున బ్రస్తుతమున హిందూ ముసల్మాను లన్నదమ్ములు. పూర్వమందు మరాటావారు బంగాళమును దోఁచుకొనిరని ప్రస్తుత కాలమందలి బంగాళీవారు మరాటావారిని ద్వేషించుట ఎంత హాస్యాస్పదమో, పూర్వమౌరంగజేబు హిందువులను బాధపెట్టెననియు, అళియ రామరాజు తురుష్కుల బాదపెట్టెననియు నిప్పటి హిందూ ముసల్మానులు పోరాడుట యింతే హాస్యాస్పదము. కావున హిందువులు ముసల్మానుల కష్టసుఖములు తమవిగానే యెంచ వలయును. ముసల్మానులను అట్లే నడచుకొన వలయును. అందువలన నుభయులకును మేలు కలుగఁగలదు. లేనియెడల నుభయులకునూ నష్టము సంభవించుననుటకు సందేహము లేదు" (మ.మ.పు. xxiv - xxv)

పూర్వమొకప్పుడు హిందూ - ముసల్మానులు పోరాడుచుండిరి అనేది అప్పటి సందర్భం దృష్ట్యా కొమర్రాజు వారికి యేర్పడిన తప్పుడు అవగాహనే అయినా హిందువులు, ముస్లింలు కలిసి ఉండాలన్న స్పిరిట్ అప్పటికీ, ఇప్పటికీ చాలాగొప్పది. ఈ విషయాన్ని అక్కిరాజువారూ, ఆయన దుష్టసముచ్చయమూ ఎప్పటికీ జీర్ణించుకోలేపోవచ్చు.

*(అయిపోయింది)*

**అంత్యసూచికలు**

20. తేరాల సత్యనారయణ శర్మ, *తెలుగుదేశ స్థితి : కాకతీయ చరిత్రము (క్రీ.శ. 750-1350)* (2002), *దేశవిముక్తి పోరాటములో ఓరుగంటి చరిత్రము (క్రీ.శ 1325 - 1370)*, (2002), *దేశవిముక్తి పోరాటములో రెడ్డి రాజ్య చరిత్రము (క్రీ.శ. 1325 - 1448)*, (2002), *దేశవిముక్తి పోరాటములో రాచకొండ చరిత్రము (క్రీ. శ. 1325 - 1482)* (2002) *విజయనగర చరిత్రము (క్రీ.శ.) 1336-1680)* (2003), విజయభారతి ప్రచురణలు, నల్లగొండ.

## బీహార్‌లో మళ్లీ వరదలు


పాట్నాలో ఒక వీధి

ఉత్తర బీహార్ వరదల్లో చిక్కుకుంది. బుర్హిగండక్, బాగమతి, కోసి, గండక్ నదులు జూలై నెలలో రెండు వారాల కు పైగా కురిసిన వర్షాలకు ప్రమాద స్థాయిని మించి ప్రవహిస్తున్నాయి. దీనికి నేపాల్ నుంచి వస్తున్న వరద నీరు కలిసి మరింత ఉధృతం అయ్యింది. ఈ వరదల్లో 432 మంది చనిపోయారు, రెండుకోట్ల మంది నిరాశ్రయులు అయ్యారు. ఇరవై జిల్లాల్లో ఎనిమిది వేల గ్రామాలు వరద తాకిడికి గురైయ్యాయి. లక్షల హెక్టార్లలో 338.4 కోట్ల రూపాయల విలువైన పంట నష్టమైంది. అయితే బీహార్ వరదలు ఈనాటివి కావు. గంగా - సింధూ మైదాన ప్రాంతంలో ఈ వరదలు మళ్లీ మళ్లీ పునరావృతం అవుతూనే ఉన్నాయి. 1970లో డా. ఎం.ఎస్. స్వామినాథన్ సూచించిన 'మోడల్ కోడ్' ఈనాటికీ అమలుకు నోచుకోలేదు. దీర్ఘకాలిక దృష్టితో, ప్రణాళికలతో ప్రభుత్వాలు పనిచేయని కారణాంగానే ఇటువంటి స్థితి ఎదురవుతోందని విశ్లేషకులు అంటున్నారు.

## నయాఘర్ రాకుండానే మృత్యుఘర్‌కు

జూలై 14న ఒరిస్సాలోని నయాఘర్ టౌన్‌కు దగ్గర ఒక ఊరి బావిలో ఏడుగురు ఆడపిల్లల పిండాలు బయటపడ్డాయి. ఈ సంఘటన దరిమిలా అదే బావిలో పోలీసులు వెదకగా పెద్ద ఎత్తున పసిపిల్లల శరీర భాగాలు దొరికాయి. ఈ కేసు దర్యాప్తు చేపట్టిన పోలీసులు ఇద్దరు డాక్టర్లను, సిబ్బందిని, నర్సింగ్ హోమ్ యజమానిని అరెస్ట్ చేసినట్లు చెప్పారు. ఒరిస్సాయే కాదు దేశమంతటా స్త్రీల పట్ల కొనసాగుతున్న అణచివేత, అసమానత, లింగవివక్షలో భాగమే ఈ భ్రూణహత్యలు. ప్రాణం పోయాల్సిన డాక్టర్లు డబ్బు కోసం ప్రాణాలు ఇలా తీయాల్సిందేనా.

## బొంబాయి పేలుళ్లు - ముంబాయి శిక్షలు

మార్చి 12, 1993లో బొంబాయిలో జరిగిన వరుస పేలుళ్లలో 257 మంది చనిపోయారు. 713 మంది గాయాలపాలయ్యారు. 1994 నుంచి సాగుతున్న ఈ కేసులో 123 మంది ముద్దాయిలు కాగా వారిలో 12 మందికి ఉరిశిక్షలతో కలిపి వంద మందికి శిక్షలు పడ్డాయి. ఇదే కేసులో సినినటుడు సంజయ్‌దత్ చట్ట విరుద్ధంగా ఎకె-56 రైఫిల్, 9 ఎం.ఎం. పిస్టల్ కలిగి ఉన్నందుకు ఏప్రిల్ 19, 1993లో తొలిసారి అరెస్ట్ అయ్యారు. ఆయుధ చట్టం కింద సంజయ్‌దత్‌కు ఈ జూలై 31న కోర్టు ఆరేళ్ల జైలుశిక్ష విధించింది. తీర్పు చెప్పడానికి మన న్యాయస్థానాలకు ఏళ్లతరబడి కాలం పట్టడం శోచనీయం.

## ఖజానాకు చీకట్లు ఈ 'తారలు'

మహారాష్ట్ర రెవెన్యూ మంత్రి నారాయణ రాణే స్టాంపు డ్యూటీల రూపేణా పలు ఒప్పందాలపై బాలీవుడ్ నటులు, ప్రముఖ మొబైల్ కంపెనీల నుంచి రు. 13.32 కోట్లు ప్రభుత్వానికి రావలసి ఉందని ఆగస్టు 2న అసెంబ్లీలో అన్నారు. ఎన్నిసార్లు నోటీసులు పంపినా స్పందించడం లేదని మంత్రి తెలియజేశారు. ఈ మొత్తంలో 12.12 కోట్ల స్టాంపు డ్యూటీ ఎయిర్‌టెల్ కంపెనీ కట్టాల్సి ఉండగా, 1.2 కోట్లు సినీతారలు, ప్రముఖులు కట్టాల్సి ఉంది. నోటీసులు పంపినా స్పందించని ప్రముఖుల్లో అమితాబ్ బచ్చన్, అభిషేక్ బచ్చన్, ఐశ్వర్యారాయ్, జాన్ అబ్రహమ్, సైఫ్ అలీఖాన్, జూహీచావ్లా, ప్రీతీజింటా, అజయ్‌దేవగన్, కాజోల్, లారాదత్తా, మందిరాబేడి, సంజయ్‌దత్, దియామిర్జా, కరిష్మాకపూర్, అమీర్‌ఖాన్, మలైకా అరోరా ఉన్నారు. సచిన్ టెండూల్కర్ కూడా స్టాంప్ డ్యూటి కట్టాల్సే ఉంది. అదే ఒక బక్కప్రాణి ఓ యాభై రూపాయలు ఏ విద్యుత్ బిల్లో కట్టలేకపోతే ఇంట్లో సామాను వీధుల్లో పడేస్తాయి ఈ ప్రభుత్వాలు.

## శ్యాంబెనగల్‌కు 'దాదాఫాల్కే'



ప్రముఖ సినీ దర్శకుడు శ్యాంబెనగల్‌కు 'దాదా సాహెబ్ ఫాల్కే' అవార్డు వచ్చింది. ఆయన మాతృభాష కొంకణి. ప్యారలల్ సినిమాకు శ్యాంబెనగల్‌ను మార్గదర్శిగా పేర్కొంటారు. ఆయన తీసిన 'అంకుర్' (1974) సినిమా ఉత్తమ భారతీయ చిత్రంగా జాతీయ బహుమతిని గెలుచుకుంది. అలా ఆయన మొదటి ప్రయత్నంతోనే ఇరవై నాలుగు జాతీయ, అంతర్జాతీయ పురస్కారాలు అందుకున్నారు. ఈ 34 ఏళ్లలో 24 సినిమాలను, రెండు డాక్యుమెంటరీ ఫీచర్స్‌ని, నాలుగు టివి సీరియల్స్‌ని నిర్మించారు. గోవింద నిహలానీ, షబానా అజ్మీ, స్మితాపాటిల్, నసీరుద్దీన్ షా, ఓంపూరి వంటి దర్శక, నటుల్ని వెండి తెరకు పరిచయం చేశారు. విలక్షణమైన ఇతివృత్తాలతో గ్రామీణ జీవితాన్నీ, భూస్వామ్య అణచివేతనూ, సామాజిక వాస్తవికతనూ తన చిత్రాల్లో ఎత్తిచూపారు.

## సాయినాథ్‌కు 'మెగసెసె'

ప్రముఖ జర్నలిస్ట్ పి. సాయినాథ్‌కు మెగసెసె అవార్డు వచ్చింది. మనీలాలో జూలై 31న ప్రకటించిన ఏడుగురు మెగసెసె అవార్డు గ్రహీతల్లో ఆయన ఒకరు. ఆయన మద్రాస్ లయోలా కాలేజీ, ఢిల్లీ జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటిలలో చదువుకున్నారు. 1980లో యు.ఎన్.ఐ. వార్తాసంస్థ, బ్లిట్జ్ పత్రికల్లో పనిచేశారు. గ్రామీణ జీవితాలపై ప్రత్యేక అధ్యయనం చేసేందుకు ఆయన టైమ్స్ ఆఫ్ ఇండియా ఫెలోషిప్ పొందారు. ప్రస్తుతం ఆయన 'ది హిందూ' దినపత్రికలో గ్రామీణ వ్యవహారాల ఎడిటర్‌గా పనిచేస్తున్నారు. 'ఎవ్రిబడీ లవ్స్ గుడ్ డ్రాట్' పేరుతో ఆయన రాసిన పుస్తకం అందరికీ సుపరిచితమే.

## ఉపరాష్ట్రపతిగా అన్సారీ



యుపిఎ, వామపక్షాల అభ్యర్థిగా ఉపరాష్ట్రపతి పదవికి పోటీ చేసిన మొహమ్మద్ హమీద్ అన్సారీ ఊహించిన విధంగానే గెలిచారు. విజయానికి 377 ఓట్లు అవసరం కాగా ఆయనకు మొత్తం 455 ఓట్లు వచ్చాయి. ఎన్‌డిఏ అభ్యర్థినిగా నజ్మాహెప్తుల్లా, యుఎన్‌పిఎ అభ్యర్థిగా రషీద్ మసూద్ పోటీ చేశారు. 1927లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (మద్రాస్ సెషన్) కు అధ్యక్షుడుగా ఉన్న డా. ముక్తార్ అహ్మద్ అన్సారీకి ఆయన మునిమనవడు ◆

## ఖత్రోచికి స్వేచ్ఛ

బోఫోర్స్ కేసులో కీలక నిందితుడు ఒట్టావియో ఖత్రోచికి స్వేచ్ఛ లభించింది. బోఫోర్స్ కేసులో సిబిఐ తరపున ఇంటర్‌పోల్ రెడ్‌కార్నర్ నోటీసు జారీ చేయడంతో ఫిబ్రవరి 6న అర్జెంటీనా విమానాశ్రయంలో ఖత్రోచిని పోలీసులు నిర్బంధించారు. అయితే భారత్‌కు అప్పగించడానికి నిరాకరిస్తూ అర్జెంటీనా కింది కోర్టు ఇచ్చిన తీర్పు పై సుప్రీంకోర్టులో అప్పీలు చేయాల్సిందిగా సిబిఐకి గానీ అర్జెంటీనాలో ఈ కేసు ప్రాసిక్యూటర్లకు గానీ ఎటువంటి ఆదేశాలు అందలేదని తెలుస్తోంది. ఈ క్రమంలో అర్జెంటీనా అధికారులు ఖత్రోచికి పాస్‌పోర్టును తిరిగి ఇచ్చేశారు. దీంతో ఖత్రోచి ఆగస్ట్ 15న ఇటలీకి పయనమైయ్యారు. గతంలోనూ మలేషియా నుంచి ఖత్రోచిని దేశానికి తీసుకవచ్చే విషయంలోనూ సిబిఐ విఫలమైంది. దీనికి ప్రభుత్వ ఉదాసీనతే కారణమని ప్రతిపక్షం విమర్శిస్తోంది.

## మేం డమ్మీలం కాదు

నాటో సేనలు ఎరియల్ బాంబింగ్‌తోనూ, భూతలంలోనూ బాధ్యతా రహితంగా చేస్తున్న దాడులలో వందలాదిమంది సాధారణ పౌరులు చనిపోతున్నారని అఫ్ఘనిస్తాన్ అధ్యక్షులు హమీద్ కర్జాయ్ తీవ్ర నిరసన తెలిపారు. అలాగే ఇరాక్ ప్రధాని నూరి-అల్-మలికీ ఇరాక్ శాంతి భద్రతలకు అమెరికా గడువులు పనిచేయవని, అలాంటి షరతులు విధించే అధికారం అమెరికాకు లేదని తేల్చిచెప్పారు. ఇద్దరూ తమ వ్యక్తిత్వాలను ప్రకటించుకున్నారు.

## బ్రిటన్ వైఖరి మారుతోందా?

బ్రిటన్ నూతన ప్రధాని గార్డన్ బ్రౌన్ ఇటీవల అమెరికా ప్రెసిడెంట్ జార్జి బుష్‌ను కలిసినప్పుడు మునుపటి స్నేహబంధం కనిపించలేదు. పరస్పరం చాలా పొడిపొడిగా వ్యవహరించినట్లు మీడియా రిపోర్ట్ చేసింది. దీని కొనసాగింపుగా ఇరాక్‌లో ఉన్న తమ ఐదున్నర వేల సైనికులను బ్రిటన్ తొలగించవచ్చని తెలుస్తోంది. ఇదంతా బ్రిటన్ ప్రజల్లో యుద్ధ వ్యతిరేకత పర్యావసానమే అనడంలో సందేహం లేదు.

## పాకిస్తాన్ - అఫ్ఘనిస్తాన్ జిర్గా

పాకిస్తాన్ - అఫ్ఘనిస్తాన్ సరిహద్దు ప్రాంతాల్లో తాలిబాన్లకు ఆయా ప్రభుత్వాలకు జరుగుతున్న ఘర్షణల మూలంగా చాలామంది గిరిజనులు ప్రాణాలు కోల్పోతున్నారు. అక్కడ శాంతిని నెలకొల్పడానికి పాకిస్తాన్ అధ్యక్షుడు ముషారఫ్, అఫ్ఘనిస్తాన్ ప్రధాని హమీద్ కర్జాయ్ ఆ ప్రాంతాల గిరిజన పెద్దలతో కలిసి ఒక శాంతి సమావేశం (జిర్గా) ఇటీవల నిర్వహించారు. పరస్పరం దూషించుకునే వారు ఇలాంటి సమావేశం నిర్వహించడం ఓ మంచి పరిణామం.

## ఇరాక్‌లో చమురు దోపిడి మొదలైంది

ఇరాక్‌పై అమెరికా దాడి చేయడానికి ముఖ్యకారణం ఆ దేశంలో ఉన్న చమురు నిల్వలపై ఆధిపత్యం కోసమేనన్నది అందరికీ తెలిసిన విషయమే. ఇప్పుడు ఇరాక్ చమురును బహుళజాతి కంపెనీలు దోచుకునే ప్రక్రియ మొదలైంది. 2004 జూన్‌లో ఇరాక్‌లో పాక్షిక స్వయం ప్రతిపత్తి కల స్థానిక కుర్ద్ ప్రభుత్వంతో డి.ఎన్.ఒ. అనే నార్వే దేశానికి చెందిన కంపెనీ చమురు ఉత్పత్తి ఒప్పందం కుదుర్చుకుంది. మొన్న జూన్‌లో డి.ఎన్.ఒ. చమురు ఉత్పత్తి మొదలు పెట్టింది. 35 ఏళ్ల సుదీర్ఘ కాలం తరువాత ఇరాక్‌లో ఓ విదేశీ కంపెనీ ఆధ్వర్యంలో చమురు ఉత్పత్తి మొదలైంది. గతవారం డి.ఎన్.ఒ. చమురు ఉత్పత్తి క్షేత్రాలని 700 మిలియన్ డాలర్లకు కొనడానికి పేరు వెల్లడించకుండా ఒక బహుళజాతి కంపెనీ రహస్య ప్రతిపాదన చేసింది. ఈ ప్రతిపాదన వెనుక ఉన్నది రాయల్ డచ్ షెల్ కంపెనీనే అని అనుమానాలు వ్యక్తమౌతున్నాయి.

## లండన్ పేదలకు చావేజ్ అభయ హస్తం

అమెరికాలో ఉంటున్న పేదలకు చౌక ధరలకు చమురు సరఫరా చేయడం ద్వారా బహుళజాతి కంపెనీలను, అగ్రరాజ్యాన్నీ ఇరుకున పెట్టిన వెనిజులా అధినేత హ్యూగో చావెజ్ ఇప్పుడు లండన్‌లో పేద ప్రజలకు సాయం చేసేందుకు ముందుకు వచ్చాడు. లండన్ మేయర్ కెన్‌లివింగ్‌స్టోన్‌తో ఆగస్ట్ మూడో వారంలో కుదుర్చుకున్న ఈ ఒప్పందం ప్రకారం వెనిజులా లండన్ ప్రజారవాణా బస్సులకు చౌక ధరలకు ఇంధనం సమకూరుస్తుంది. ఫలితంగా లండన్‌లో ఉంటున్న పేద ప్రజలు, వృద్ధులు, రోగులు సబ్సిడీ ధరలకు ఈ బస్సుల్లో ప్రయాణం చేయవచ్చు. ఈ సాయం చేసినందుకుగాను లండన్ నగర కౌన్సిల్ వెనిజులాకు టూరిజం, ప్రజారవాణా, పర్యావరణ పరిరక్షణ, టౌన్‌ప్లానింగ్ వంటి అంశాల్లో సహకారం అందిస్తుంది. సంపన్న దేశమైన బ్రిటన్, ఓ అభివృద్ధి చెందుతున్న దేశమైన వెనిజులాతో ఇటువంటి ఒప్పందం కుదుర్చుకోవడం అవమానకరం అని కొంతమంది బ్రిటన్ రాజకీయ నాయకులు అసహనం వ్యక్తం చేస్తున్నారు. హ్యూగో చావెజ్‌లా విభిన్నంగా ఆలోచించే నేతలుంటే సమసమాజం ఎందుకు సాధ్యం కాదు?

## గుణపాఠం నేర్చుకోని జూనియర్ బుష్

ఆగస్ట్ 22న కాన్సాస్ నగరంలో పదవీ విరమణ చేసిన అమెరికన్ సైనికుల సదస్సులో పాల్గొంటూ ఇరాక్ యుద్ధంపై జార్జ్‌బుష్ చేసిన వ్యాఖ్యలు వివాదాస్పదమయ్యాయి. ఇన్నాళ్లు బుష్‌ను విమర్శించేవారు మాత్రమే ఇరాక్ యుద్ధాన్ని వియత్నాం యుద్ధంతో పోల్చేవారు. మొన్నటి ప్రసంగంలో ఆశ్చర్యకరంగా బుష్‌కూడా ఇరాక్‌ను వియత్నాంతో పోల్చాడు. అయితే వియత్నాం యుద్ధం నుండి అమెరికా అర్ధాంతరంగా వైదొలగడం తప్పు అని ఇరాక్‌లో అలా చేయగూడదనీ అయన సెలవిచ్చాడు. 26 ఏళ్లపాటు సాగి దాదాపు 15 లక్షల మంది మరణాలకు కారణమైన వియత్నాం యుద్ధానికి, అయిదేళ్లుగా సాగుతూ లక్షలమంది మరణాలకు కారణమవుతున్న ఇరాక్ యుద్ధానికి అనేక పోలికలు ఉన్నాయి. రెండు చోట్లా ఒక అబద్ధపు పునాది పైనే యుద్ధం మొదలైంది. రెండు చోట్లా సాక్షాత్తూ అమెరికా దేశాధ్యక్షులే అసత్యాలను సత్యాలుగా నమ్మింపజేశారు. రెండు దేశాల్లోను విదేశీ ఆక్రమణకు వ్యతిరేకంగా స్థానికులు హింసాత్మక ప్రతిఘటన మొదలు పెట్టారు. రెండు యుద్ధాల్లోనూ అమెరికా భారీ సంఖ్యలో సైనికులను కోల్పోయింది. ఆనాడు అవమానభారంతో చేసేదేమీ లేని పరిస్థితిలో వియత్నాం నుండి అమెరికా సైన్యం తిరుగుముఖం పట్టింది. జార్జ్‌బుష్ చేసిన ఈ మతిలేని వ్యాఖ్యల పట్ల ప్రపంచ వ్యాప్తంగా నిరసన వ్యక్తమవుతోంది. అటు అమెరికన్ పత్రికలే కాక ఇతర దేశాల పత్రికలు కూడ ఈ వ్యాఖ్యలను తీవ్రంగా ఖండించాయి. ◆

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంభైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేదీ | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 21.7.07 నుండి 27.7.07 | 4 | - | 7 | - | - | - | 7 | 4 | - | 1 | 9 | 10 | 11 | 4 | - | - | - | 5 |
| 28.7.07 నుండి 3.8.07 | 11 | - | 3 | - | - | - | - | 4 | - | 5 | 17 | 16 | 2 | 7* | - | - | 2 | 4 |
| 4.8.07 నుండి 10.8.07 | 9 | - | 17 | - | - | - | 2 | - | - | 1 | 15 | 16 | 4 | 1 | - | - | 1 | - |
| 11.8.07 నుండి 20.8.07 | 6 | - | 11 | - | - | - | - | 8 | - | - | 22 | 9 | 4 | - | - | - | 6 | - |
| మహబూబ్‌నగర్ | 6 | - | 19 | - | - | - | 7 | 16 | - | 4 | 29 | 49 | 19 | - | - | - | 2 | 5 |
| మెదక్ | 5 | - | - | - | - | - | - | - | - | - | 43 | 55 | 42 | 1 | - | - | - | - |
| కడప | - | - | - | 1 | - | - | 4 | - | - | - | 11 | 4 | 4 | - | - | - | - | - |
| గుంటూరు | 1 | - | - | - | - | - | 14 | 5 | - | 5 | 27 | - | 2 | 2 | - | - | - | 3 |
| **మొత్తం** | **42** | **-** | **57** | **1** | **-** | **-** | **34** | **37** | **-** | **16** | **173** | **159** | **88** | **15** | **-** | **-** | **11** | **17** |

* ముదిగొండ కాల్పుల్లో; ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ - డి. విజయభాస్కర్;
మహబూబ్‌నగర్ - రవికుమార్; మెదక్ - కె. రాజు; కడప - ఎన్.ఎస్. ఖలందర్; గుంటూరు - బి. అంజమ్మ

*గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.*




# ఎందరో త్యాగధనుల కృషి ఫలితం ఈ స్వాతంత్ర్యం...















# ...వారి అడుగుజాడల్లో పయనిద్దాం మనమందరం!

నేడు భారతీయులంతా స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అనుభవిస్తూ ఎందరికో ఆదర్శంగా... అందరికీ ఆత్మీయులుగా జీవిస్తున్నారంటే...! దానికి కారణం **1857**లో బ్రిటీష్ పాలకులపై సిపాయిలు సాగించిన సంగ్రామం. మనం సాధించుకున్న స్వాతంత్ర్యానికి ఆనాడే బీజం పడింది. ఎందరో ప్రాణ త్యాగం చేశారు. దేశభక్తిని చాటి చెప్పి నేలకొరిగారు. రక్తార్పణం చేశారు. ఆ మహనీయుల త్యాగం మనకు నేటికీ ఆదర్శంగా నిలిచింది. వారి ఉద్యమ స్ఫూర్తి మనలో చైతన్యాన్ని నింపింది.

**ఆ స్ఫూర్తి అందించిన ఫలితం...** మనందరికీ స్వాతంత్ర్యం వచ్చింది. భారతదేశం స్వేచ్ఛ వాయువులు పీల్చుకుంది. సార్వభౌమాధికారంతో అన్ని రంగాలలో ప్రగతిని సాధించింది. ప్రపంచానికి ధీటుగా నిలిచింది.

**మన రాష్ట్రంలో గత 60 ఏళ్ళలో...** గత అరవై ఏళ్ళుగా మనం అభివృద్ధిని సాధించుకుంటూ వచ్చాం. మనకు ఉన్న సహజవనరులు, ఖనిజ సంపదను వినియోగించుకుని వ్యవసాయ, పారిశ్రామిక ఇతర అనుబంధ రంగాలను అభివృద్ధి చేసుకుంటూ వచ్చాం. **1960-61**లో **3,872** రూపాయలుగా ఉన్న తలసరి ఆదాయాన్ని ప్రస్తుతానికి రూ.**25,625**కు పెంచుకోగలిగాం. వ్యవసాయ ఉత్పత్తులను పెద్ద ఎత్తున సాధించుకున్నాం. పసిపిల్లల మరణాలను తగ్గించాం. జీవన ప్రమాణాలను పెంచుకోగలిగాం.



**కొత్త పరిపాలనకు శ్రీకారం** : అయితే ఇప్పటికీ పేదరికం మనల్ని వెంటాడుతూనే ఉంది. నదులున్నాయి, అయినా నీరు వృధాగా సముద్రంలో కలిసిపోతోంది. అందుకే పేదరికాన్ని నిర్మూలించి, రైతు జీవితాలను మెరుగుపర్చాలనే ఆలోచనతో ఓ నూతన పరిపాలన మూడేళ్ళ క్రితం ప్రారంభమయ్యింది. అరవై ఏళ్ళ స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపుకునే తరుణంలో మన ప్రభుత్వం సాధించిన విజయాలను గమనించాల్సిన అవసరం ఉంది. **రూ.1.30 లక్షల కోట్లతో కోటి ఎకరాల సాగుకు చేస్తున్న జలయజ్ఞం దేశానికి ఆదర్శంగా నిలిచింది. మహిళలకు పావలా వడ్డీతో ప్రోత్సాహం, ఏటా 20 లక్షల ఇందిరమ్మ గృహాల నిర్మాణం, ఇందిర ప్రభ, రాజీవ్ గృహకల్ప, రాజీవ్ యువశక్తి, ఆరోగ్యశ్రీ వంటి పథకాలు ప్రతి పేదవాడి గడపకు చేరాలన్న ఉద్దేశంతో రాష్ట్ర ప్రభుత్వం నిరంతరం కృషి చేస్తోంది.**

**రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న ఈ కృషి నిరుపేదల జీవితాల్లో ఆశలు నింపాలని కోరుకుందాం...**

**నూట యాభై ఏళ్ళ సంగ్రామ స్ఫూర్తితో ముందుకు కదులుదాం - అరవై ఏళ్ళ స్వాతంత్ర్య ఉత్సవాల్లో పాల్గొందాం**



R.O.No. 287/Sou/Advt.I/2007-08

Printed, Published and Owned by V. Hanumantha Rao and Printed at Charita Impressions for Nutan Art Printers, 11-5-417-420, Red Hills, Lakdi-ka-pool, Hyderabad-500 004 and published at 8-3-898/22, Nagarjuna Nagar,Hyderabad-500 073. Editor : V. Hanumantha Rao



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M285 |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Naveena |
| పేజీలు విడదీసినది | Naveena |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |